మహాబలిపురం

ఫొటో: సూరజ్ ఎస్. శర్మ.



# చతుర

సంపుటి : 8 నవంబర్ 1985 సంచిక : 10

## ఈ నెల సమగ్ర నవల

ప్రేమ!
ఇరు హృదయాల అపూర్వ సంగమానికి ఆలంబనమైన భావన!
అనూహ్యంగా, అనిర్వచనీయమైన ప్రేమే ఆ యువతీ యువకుల్ని కలిపింది!
అంతస్తుల అంతరాల్ని, కులాల పద్మవ్యూహాల్ని ఛేదించుకుని ఒకరికై ఒకరు జన్మించినవారిలా ఏకం కావాలనుకున్నారు వారిద్దరూ! ఆ...

# శివగంగ

....ల ప్రేమఝరి పరిస్థితుల ప్రాబల్యానికి లొంగిపోకుండా నిలిచిందా?
తరతరాలుగా ప్రేమగాథలను విషాదాంతం కావిస్తున్న జాతి మత వైరుధ్యాలు, ఆర్థిక విభేదాలు ఆ జంటను విడదీయడానికి ఏం చేశాయి?

## సి.యస్.రావు

దృశ్య ప్రధానంగా అక్షరరూపం కల్పించిన రమణీయ ప్రేమకథ 'శివగంగ' ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం : దిలీప్ బెనర్జీ

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# హాల్లో! బాగున్నారండీ



మరేమో.... నేనే బుడుగునండి !
మీ సీగాన పెసూనాంబ ఆడుకోవడానికి బొమ్మలు
పదో...ముప్పయో పెట్టి తెచ్చారు కదా !
మరి సీగాన పెసూనాంబ బాగా చదుకోవడానికి ఏం తెచ్చారు ?
ఏం తేలేదు కదూ !
నే చెప్తా కుంచెం వింటారా!
ఇంకా పెద్దగా చదూకోటానికి
బోల్డు డబ్బు కావాలి. కదా !
మరెవరినైనా అడిగితె ప్రైవేటు చెప్పేస్తారు కదా!
మరి డబ్బేమో.... పదో....ముప్పయో వేల రూపాయలు కావాలాయె!
అందుకు నాకు భలే ఉపాయం తెల్సు!
మరేమో ! ఈరోజే నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్లు తీసుకురండి !
అవేమో తనలా కాలేజీకి
వెళ్లేటప్పటికి, చదూకోటానికి పనికి వస్తాయని
రెండు జడలసీత నాకు చెప్పింది
మరి జాతీయపొదుపు సర్టిఫికేట్లు తెస్తారుకదా !

"నెల నెలా కొంత కూడ బెట్టండి.
బాబు భవిష్యత్తుకు శ్రీకారం చుట్టండి .".

ఇంకా ఎన్నెన్నో జాతీయ పొదుపు పథకాల
వివరాలకు



మీకు దగ్గరలో ఉన్న పోస్టాఫీస్, జిల్లా
కలెక్టర్ కార్యాలయంలో
స్పెషల్ తహసిల్దార్,
జిల్లా సేవింగ్స్ అధికారి, భారత
ప్రభుత్వం, డిప్యూటి డైరెక్టర్,
స్మాల్ సేవింగ్స్

NSO/AMCO/12/85






కమీషనర్,
స్మాల్ సేవింగ్స్, ఆంధ్రప్రదేశ్,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029

## మీ భద్రత మా బాధ్యత

# చతుర ప్రపంచం

## రుధిర పానం

అమెరికాలోని న్యూయార్క్‌కి దగ్గిరలో క్వీన్స్ అనే చిన్న పట్టణంలో ఓ పరిశోధనా సంస్థకి డైరెక్టరయిన స్టీఫెన్ గేబ్లాన్ గత 13 ఏళ్ళ నుంచి మానవ రక్తం తాగే వ్యక్తులపై పరిశోధన సాగిస్తున్నాడు.




తాము మానవ రక్తం తాగుతున్నట్టు బహిరంగంగా ప్రకటించుకున్నవారిని స్టీఫెన్ పరీక్ష చేయగా కొందరు అబద్ధమాడినట్టు తేలింది. ఆ విధంగా చెబితే తమకు భయంకరమైన డ్రాకులా సినిమాలలో నటించే అవకాశం లభిస్తుందని వాళ్లు అబద్ధమాడారట!

అయితే నిజంగా మానవరక్తం తాగేవాళ్లు లేకపోలేదు. వాళ్ళు ఎక్కువగా యువతుల రక్తం కోసం ప్రయత్నిస్తుంటారు. మానవ రక్తం తాగేవారికి ఓ అసోసియేషన్ కూడా వుంది. అందులోని సభ్యులు ఇంజెక్షన్ ద్వారా ఒకరి రక్తాన్ని ఒకరు వెలికితీసి, మిశ్రమం చేసి, వైనులో కలుపుకుని తాగుతారు.

ఇటీవల గేబ్లాన్‌కి మానవరక్తం తాగే 12 మంది ఓ అమాయకుణ్ని హత్యచేసి, రక్తం తాగినట్టుగా తెలిసి పోలీసులకి ఫిర్యాదు చేశాడు. కాని సరైన సాక్ష్యాధారాలు లేకపోవడంతో పోలీసులు వారిని అరెస్టు చేయలేకపోయారు. ఆ మానవరక్తపానప్రియులు స్టీఫెన్‌గేబ్లాన్‌పై కోపించి అతని రక్తం తాగుతామని బెదిరించడంతో ప్రస్తుతం అజ్ఞాతంగా కాలం గడుపుతున్నాడు!

## గెలుపుల రికార్డు

గుర్రప్పందాలలో అత్యధికసార్లు గెలుపొందిన గుర్రాల యజమానిగా డాక్టర్





యం.ఎ.యం.రామస్వామి పేరు 1985 గిన్నెస్‌బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో చోటు చేసుకుంది. ఆ విధంగా పేరు గిన్నెస్ బుక్‌లోకి ఎక్కాక కూడా మరో 24 గుర్రప్పందాలలో అతని గుర్రాలు గెలుపొందాయి.

రామస్వామికి 8 ఏళ్ళ పిన్నవయసు నుంచే గుర్రప్పందాలపై ఆసక్తి వుండేది. ఉదయం 5 గంటలకే లేచి గుర్రంపై కూర్చుని ఆడే 'పోలో' ఆడుతూ, గుర్రం కదలికల్ని నిశితంగా గమనించేవాడు.

1965లో రామస్వామి మొట్టమొదటగా 'సిల్వర్ జెట్' అనే గుర్రాన్ని కొన్నాడు. ఆ గుర్రం అప్పట్లో బెంగుళూరులో జరిగిన వేసవికాలపు రేసుల్లో పాల్గొని గెలుపొందింది. అప్పట్నుంచీ ఆ గుర్రం ఓటమి అనేదిలేకుండా 124 గుర్రప్పందాలలోనూ, వెయ్యికిమించి ఇతర పందాలలోనూ గెలిచింది.

''రేసులకి పనికొచ్చే గుర్రపు ఎంపిక, వజ్రాన్ని ఎంచుకోవడంలాంటిదే. మేలు జాతి గుర్రాన్ని ఎంచుకునే ముందు దాని వంశచరిత్రనంతా పరిశీలించాలి. రేసుల్లో ఓ గుర్రం గెలుపొందాలంటే దాని శరీరాకృతి, దానికి శిక్షణ ఇచ్చిన విధానం, దాన్ని పరుగెత్తించే జాకీ సామర్థ్యంతో పాటు కొంత అదృష్టం కూడా తోడవ్వాలి. జాకీ, గుర్రానికి శిక్షణ ఇచ్చిన వ్యక్తి, దాని యజమానుల మధ్య పరస్పరావగాహన ఎంతో అవసరం" అంటాడు రామస్వామి.

వయసు 3 నుంచి 6 ఏళ్లమధ్యగల గుర్రాలనే గుర్రప్పందాలలో ఉపయోగిస్తారు. ఏ గుర్రమూ రేసుల్లో 3,4 ఏళ్లకి మించి పనికిరాదు. రేసు గుర్రాలను ఓట్లు, కేరట్ దుంపలు, పచ్చగడ్డి, గ్లూకోజు, ఫెర్రడాల్, లివ్–52 టానిక్కులతో పెంచి పోషిస్తారు.

రామస్వామి 50 వేల రూపాయలకి కొన్న 'ఎయిర్‌హోస్టెస్' అనే గుర్రం రేసుల్లో గెలిచినందువల్ల అతనికి 6 లక్షల 50 వేల రూపాయలు లాభం వచ్చింది. 80 వేలకి కొన్న 'ఓన్ ఒపీనియన్' అనే మరో గుర్రం 29 రేసుల్లో గెలిచి 20 లక్షలు సంపాదించిపెట్టింది. మనదేశంలో ఓ గుర్రంవల్ల అంతలాభం పొందటం



అరుదు. రామస్వామి నష్టపోయిన సందర్భాలూ లేకపోలేదు. ఓ గుర్రం మీద కొన్ని లక్షలు ఖర్చుపెడితే దానివల్ల 400

రూపాయలుకూడా సంపాదించలేదట.

రామస్వామి దగ్గిర మొత్తం 100 గుర్రాలున్నాయి. మనదేశంలో అంత అత్యధిక సంఖ్యలో గుర్రాలను కలిగి వున్నది అతనే. అది రేసుల్లో గెలుపొందినది కానీ, ఓడినది కానీ, రామస్వామి ఏ గుర్రంపైనా పక్షపాతం వహించకుండా అన్నిటినీ సమానంగా చూస్తాడు.

## ఫుట్ రైటింగ్

మధ్యప్రదేశ్‌లోని బిలాస్‌పూర్‌కి చెందిన సమీర్ ఘోష్ రెండు చేతులూ లేకపోయినా, కాలితో పరీక్ష రాసి డిగ్రీ సంపాదించి, పట్టుదలతో సాధించలేని కార్యమేదీ లేదని నిరూపించాడు. పుట్టుకతో వికలాంగుడు కాని అతను చిన్నతనంలోనే ప్రమాదవశాత్తూ చేతులు పోగొట్టుకున్నాడు.

సమీర్ ఘోష్ 8 ఏళ్ళ వయసులో ఓనాడు ఫుట్‌బాల్ ఆడుతుండగా బంతి వెళ్ళి ఎలక్ట్రిక్ ట్రాన్స్‌ఫార్మర్‌లో చిక్కుకుంది. ఆ బంతిని తీయబోయిన సమీర్‌కి ఎలక్ట్రిక్ షాక్ తగిలి చేతులు చచ్చుబడిపోయాయి. దాంతో మరో మార్గం లేక డాక్టర్లు అతని చేతుల్ని ఖండించివేశారు.




అయినా సమీర్ జీవితం పట్ల నిరాశతో కృంగిపోలేదు. అతనికి వైద్యం జరిగిన ఆస్పత్రిలోని ఓ నర్సు అతనికి పాదాలతో రాయడమెలాగో నేర్పింది.

సమీర్‌కి చిన్నప్పటినుంచీ ఇంజనీరవాలనే అభిలాష వుండేది. ఇంటర్మీడియట్‌లో అతను సైన్సు గ్రూపు తీసుకుని పాదాలతోనే కప్పలపై డిసెక్షన్ చేశాడు కూడా. కాని తర్వాత పరిస్థితులు అనుకూలించక బియ్యే లిటరేచర్‌లో చేరవలసి వచ్చింది.

చిన్నతనంలోనూ, పెరిగే వయసులోనూ తనకు స్నేహితులు ఎంతో సాయపడినట్టు చెప్పుకుంటాడు సమీర్. ప్రస్తుతం అతను కాళ్ళతో పెయింటింగ్ కూడా నేర్చుకుంటున్నాడు. ఫుట్‌బాల్ వల్ల చేతులు పోగొట్టుకున్నా ఇప్పటికీ అతను ఫుట్‌బాల్ ఆటను చూడటమేకాక ఆడుతుంటాడు కూడా.

సమీర్‌కి ప్రయాణాలు చేసేటపుడు మాత్రమే చేతులు లేని లోటు తెలుస్తుంది. వికలాంగుల కోసం బస్సుల్లోనూ, రైళ్ళలోనూ రిజర్వేషన్ వుండదు. ఉద్యోగాల విషయంలో ఇప్పటి ప్రభుత్వం ఇస్తున్న 3 శాతం రిజర్వేషన్‌ను 10 శాతానికి పెంచాలని అంటాడతను. ప్రస్తుతం చదువుతున్న యమ్. ఎ. లిటరేచర్ పూర్తి చేశాక పెద్దయెత్తున సంఘసేవా కార్యక్రమాలను చేపట్టాలనేది సమీర్ ఆశయం.

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంలో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అంటే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోపాటె దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారి మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




B84.55 Tel

*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

# అమెరికన్ శృంగారం

చర్చించుకునేందుకు గానీ, పాల్గొనేందుకు గానీ అమెరికన్లకి అత్యంత ప్రియమైన అంశం 'సెక్స్'. అక్కడ ఓ యువతితో పడకసుఖం పొందాలంటే ఆమె పేరు తెలిసేంత పరిచయంకూడా అక్కరలేదు. అంతగా పట్టింపు లేకుండానే ఒకరితో ఒకరు శృంగారానికి సిద్ధమవుతారు, అపరిచితులు కూడా.



భారతీయ రచయిత ముల్కరాజ్ ఆనంద్ రాసిన 'ఫ్రం ది లేండ్ ఆఫ్ ది కామసూత్ర' పుస్తకం అమెరికన్ల ఆదరణ బాగా చూరగొన్నది. కొత్తగా ఓ భారతీయుడు పరిచయమైనప్పుడు "కామసూత్ర రాసిన దేశంనుంచి వచ్చినవారా?" అని ప్రశ్నించడం అమెరికన్ల కలవాటు! అంతేకాక, "మీరు శృంగారంలో పాల్గొన్నపుడల్లా 'కామసూత్ర' పుస్తకంలో పేర్కొన్న భంగిమలన్నిటినీ అనుసరిస్తారా?", "భారతీయ యువతులు చూడ్డానికి అలా కనబడకపోయినా, శృంగారంలో ప్రవీణులని విన్నాము. నిజమేనా?" అంటూ శృంగారానికి సంబంధించిన ప్రశ్నలెన్నిటినో సందేహించకుండా అడిగేస్తారు.

ఎక్కువమంది అమెరికన్లు – "మేము మా ఇష్టప్రకారం ఎవరితోనైనా శృంగారం జరుపుకోగలం" అనే ఆలోచనా ధోరణి కలిగివుంటారు. ఆడపిల్లలకి 13–14 ఏళ్ళు నిండేటప్పటికే సెక్స్ గురించి అంతా తెలిసిపోయివుంటుంది. వాళ్ళు పెళ్ళికి ముందే శృంగారంలో పాల్గొనడం చెడ్డగా ఏమాత్రం భావించరు. బడిలో తమతో చదువుకుంటున్న భారతదేశపు ఆడపిల్ల ఎవరైనా 14 ఏళ్ళకికూడా ఇంకా కన్యగానే వుందనీ, సెక్స్ అనుభవం లేదనీ తెలిస్తే ఆటపట్టించడం అమెరికన్ పిల్లలకి అలవాటు.

అమెరికాలో జరిగే డిన్నర్ పార్టీలు చాలావరకూ, "ఈరోజు పడకగదికి జిమ్మీని పిలిచాను", "ఈ రాత్రికి జూలీ నాతో గడుపుతానంది" లాంటి మాటలు ఒకరికొకరు చెప్పుకోవడంతో ముగుస్తాయి.

ఒక అమెరికన్ రచయిత తానెదుర్కొన్న వింత అనుభవం గురించి ఓ రచనలో పేర్కొన్నాడు. విడాకులు తీసుకున్న ఓ నడివయసు స్త్రీ తన 16,17 ఏళ్ళకొడుకు, కూతుళ్ళతో కలిసి

నివసిస్తోంది. ఆమె రచయితతో పరిచయం పెంచుకుని ఒకరోజు అతన్ని తన ఇంటికి తీసుకెళ్ళి, పిల్లల్ని పరిచయం చేశాక, అతన్ని తన పడకగదిలోకి తీసుకెళ్ళి శృంగారంలో పాల్గొనమందట.

కొన్నాళ్ళ తర్వాత ఆ రచయిత, "నీ పిల్లలముందే ఓ కొత్త వ్యక్తితో శృంగారాన్ని కోరుకోవడం నీకు సిగ్గుగా అన్పించదూ?" అని అడిగితే, "ఇందులో తప్పేముంది? నాకు శరీరం, మనసూ లేవా? నాకూ శారీరకావసరాలుంటాయని గుర్తించే తెలివి నా పిల్లలకుంది. నేను పిల్లల శృంగారజీవితంలో జోక్యం చేసుకోనప్పుడు వాళ్ళు నాగురించి ఎందుకు విచారపడాలి" అని బదులిచ్చిందటా ప్రౌఢ!

## ఫ్లయింగ్ ఫన్

మద్రాసులో క్వీన్ మేరీస్ కాలేజీలో బియెస్సి చదువుతున్న ప్రీతీసుందరం



అనేయువతి 1978లో అక్కడ ఫ్లయింగ్ క్లబ్బులో చేరి 50 గంటల ఫ్లయింగ్ పూర్తిచేసింది. ఒకరోజు ఆమె ఒకే ఇంజనువుండే పుష్పక్ వి.టి-డి.పి.యస్. వాయు విమానంలో ఫ్లయింగ్‌కి బయలుదేరింది.

ఆ విమానంలో నింపే ఇంధనం 4 గంటలు మాత్రమే ఎగిరేందుకు సరిపోతుంది. కనుక ఫ్లయింగ్ క్లబ్ నిబంధనల ప్రకారం ఆ విమానంలో వెళ్ళినవారు 3 గంటలలోపే తిరిగి రావాలి. 3,500 నుంచి 4,500 అడుగుల ఎత్తులోనే విమానం నడపాలి.

ఆరోజు ప్రీతీ సుందరం మధ్యాహ్నం రెండున్నర గంటలకల్లా విమానాశ్రయానికి చేరుకుంది. ఆమె క్రితం రోజే కంట్రోల్ టవర్ వారి అనుమతి, విమానం స్థితి, వాతావరణ పరిస్థితుల గురించిన పరిజ్ఞానంకోసం ప్రయత్నించింది. అవసరమైన కాగితాలు దాఖలుచేసి కెప్టెన్ నరేంద్రన్, కంట్రోల్ టవర్‌లనుంచి ఆఖరిసారిగా అనుమతి పొందింది.

విమానంలో పులికాట్ సరస్సు

ప్రాంతంపైవిహరించాలనేది ప్రీతీసుందరం ఆలోచన. ఆమె నడుపుతున్న విమానం 3 గంటల 20 నిముషాలకి విమానాశ్రయాన్ని వదిలింది. 6 గంటలకల్లా తిరిగి రావాలని కెప్టెన్ నరేంద్రన్ ఆమెను ఆజ్ఞాపించాడు.

ఓ గంట విమానంలో ఎగిరి గూడూరు దగ్గరికి చేరుకునేటప్పటికి హఠాత్తుగా ఆమె ఆకాశంలో ఏ దిక్కుకు వెళ్లాలో మరిచిపోయింది.

ప్రీతీ సుందరానికి కింద రైలు పట్టాలు కనబడ్డాయి. అంతకుముందు ఓసారి కెప్టెన్ నరేంద్రన్‌తో కలిసి ఫ్లయింగ్ చేస్తుండగాకూడా వాటినిచూసివుండటంతో తాను ఆర్కోణం రైల్వేస్టేషన్‌కి దగ్గరలో వున్నట్టు గుర్తించింది.

విమానంలోని పెట్రోలు క్రమక్రమంగా అడుగుకి చేరుకుంటోంది. సూర్యాస్తమయం సమీపిస్తోంది.

విమానంలో ఎగురుతున్న ప్రీతీసుందరానికి దారి తోచకపోయినా భయపడలేదు. మనసును ఆందోళనకి అతీతంగా స్వాధీనంలోకి తెచ్చుకుని ధైర్యాన్ని కూడదీసుకుంది. ఎక్కడో ఒకచోట విమానాన్ని దింపడం ఉత్తమమని నిర్ణయించుకుంది.

కిందకు చూస్తే ఏదో సరస్సు గోచరించింది. అది పులికాట్ సరస్సు కావచ్చు అనుకుంది. అప్పుడు సమయం 6 గంటల 10 నిముషాలయింది. సరస్సుపై విమానంలో చక్కర్లు కొట్టిన ఆమెకి అది పులికాట్ సరస్సు కాదనిపించింది.

తను ఏ ప్రదేశంలో వున్నదో తెలియదు. క్రమంగా రాత్రి తాలూకు చీకటి అలుముకోవడం చూసిన ఆమె వీలైనంత వెంటనే విమానాన్ని భూమిపై దింపాలని నిర్ణయించుకుంది. అప్పుడామెకి ఓ చర్చి పైభాగం కనబడటంతో దగ్గరలో ఏదో పట్టణముంటుందనే ఆశ చిగురించింది. విమానం ఎగిరే ఎత్తును 600 అడుగులకి తగ్గించింది. తర్వాత దాన్ని మరో 50 అడుగులు తగ్గించిన ఆమెకి తనవైపు ఆశ్చర్యంగా చూస్తున్న మనుషులు కనబడ్డారు.

ఆమె 'ఫస్ట్ చెక్' ప్రయోగించి ఇంజను వేగం తగ్గించింది. తర్వాత 'థర్డ్ చెక్' ప్రయోగించి విమానాన్ని లేండ్ చేసింది. ఆవిధంగా ఆమె తమిళనాడులోని ముత్తురంగం గ్రామంలో ఓ ఎండిపోయిన ఉప్పు సరస్సుపై దిగింది. అక్కడి గ్రామస్తులు ప్రీతీ సుందరాన్ని ఆశ్చర్యంగా చూశారు. కాసేపు ఆమె ఎవరో దేవత అనుకున్నారు. వారికి ఏంచేయాలో తెలియలేదు. ఆమె వారితో మామూలుగా మాట్లాడాకగానీ ఆశ్చర్యమనుంచితేరుకోలేదు.

ఓ యువకుడు ఆమెను తన ఇంటికి తీసుకెళ్ళి ఆతిథ్యమిచ్చాడు. మిగిలిన గ్రామస్తులు విమానం దగ్గరేవుండి కాపలా కాశారు.

అప్పటికి మద్రాసులో కెప్టెన్ నరేంద్రన్ ఆమె దారితప్పి వుంటుందని గ్రహించి తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ పోలీసుల్ని గాలింపుకి పంపి వారి దగ్గర ఎప్పటికప్పుడు సమాచార సేకరణ చేయసాగాడు. ప్రీతీ సుందరం ఊళ్ళోవున్న పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి తన గురించి చెప్పుకోవడంతో వారి ద్వారా వెంటనే కెప్టెన్ నరేంద్రన్‌కి సమాచారం అందింది.

అతను ఆమె తండ్రిని కూడా వెంటబెట్టుకుని అక్కడికి రావడంతో ప్రీతీ సుందరం క్షేమంగా ఇల్లు చేరింది. *




* పచ్చని పైరు విప్లవానికి..

* పాడి పరిశ్రమాభివృద్ధికి..

* గ్రామసీమల సౌభాగ్యానికి..

మార్గదర్శి

# అన్నదాత

## వ్యవసాయదారుల సచిత్ర మాసపత్రిక



సాలు చందా రూ.24/- మాత్రమే

పోస్టేజి ఉచితం

విడిప్రతి రూ.2/-



అన్నదాత

ఈనాడు కాంపౌండ్

సోమాజిగూడ, హైదరాబాద్-500 004

ఫోన్: 223422



# శివగంగ

సి.యస్.రావు

పుష్యమాసం. సంక్రాంతి దగ్గరపడు తోంది. చలి బాగా ముదిరింది. తూర్పు తెల్లవారకముందే కొంత ఊరుమేలుకొంది.

సాతాని జియ్యరుల చిడతల చప్పుడు ... తంబురానాదం... గొంతెత్తి పాడుతున్న గానం, గాలిలో కరిగి ఊరందర్నీ మేలుకొలుపుతోంది.

చలిని లెక్క చేయకుండా లేచిన కన్నెపిల్లలు వీధి వాకిళ్ళముందు వత్తుగా కళ్లాపు చల్లుతున్నారు. కళ్లాపు చల్లడం పూర్తయిన కొందరమ్మాయిలు, అరుగు మీద పెట్టుకున్న ముగ్గుచిప్పను ఎడమ చేతిలో పెట్టుకుని, కుడిచేతిని గడ్డానికిఆన్చి ఏం ముగ్గువేయాలా అని ఆలోచిస్తూ ఉన్నారు.

అరవిరిసిన ముద్దమందారంలాంటి ఒకమ్మాయి, పరికిణీ కుచ్చిళ్ళను పైకి దోపుకుని వేలాడుతున్న ఓణీని నడుముకు బిగించుకుని ఒక్క క్షణం తాను వేయబోయే ముగ్గును వాకిటముందు ఊహించుకుంది. ఆమె పెదవులపై లేత వెన్నెలలాంటి చిరునవ్వు తొణికిసలాడింది. వంగి చుక్కలు పెడుతోంది. జడ ముందుకు పడింది. ఒక చేతిలో ముగ్గుచిప్ప మరోచేతిలో ముగ్గు ఉండటంచేత ముందుకుపడిన జడను తలవిసిరి వెనక్కు వేసుకుంది. ఆ జడ కదలిక నల్లతాచు బుస్సునలేచినట్లయింది. పెట్టినచుక్కలను ఎంతో నేర్పుతో ముగ్గుతో కలుపుతోంది.

పక్క వాకిట్లో ముగ్గువేస్తున్న ఓ అమ్మాయి. "ఈవేళ ఏం ముగ్గువేస్తున్నావే గంగా?" అంది.

''ఇంద్రుడి రథం''బదులు చెప్పింది గంగ.

''పొరపాటున ఇంద్రుడు మన ఊరివైపు షికారొస్తే నీ రథం కంటబడితే తన రథం వదిలేసి నీరథమే ఎక్కుతాడు" అంది పక్కింటమ్మాయి.

''ఒకవేళ బ్రహ్మవస్తే నువ్వువేస్తున్న హంస ఎక్కడా... ?'' అంది గంగ నవ్వుతూ.

శ్రీరాములు చేతిలో ఉన్న కర్రను చంకలో పెట్టుకుని, జేబులో ఉన్న అగ్గిపెట్టె తీసుకుని చుట్టముట్టించుకుంటూ వచ్చాడు. మెట్లుదిగి గంగ వేస్తున్న ముగ్గు ముందు నిలబడ్డాడు. అతని పాదాలను చూసిన గంగ నిటారుగా నిలబడింది.

ఎదురుగా నిలబడిన గంగను శ్రీరాములు తృప్తిగా చూసుకున్నాడు. "అప్పుడే ఎక్కడ తెల్లారిందమ్మా నీకు?" అన్నాడు నవ్వుతూ.

"వెలుగొచ్చాక వీధిలో ముగ్గెయ్యడం బాగోదుగా నాన్నా" అంది గంగ.

"పిచ్చితల్లీ" అంటూ తల నిమిరి ముందుకు నడిచాడు శ్రీరాములు.

పక్కింటినుంచి గుర్రంమీద దొరయ్య బయల్దేరాడు. గుర్రపు డెక్కల చప్పుడు విని, "బాబాయ్... బాబాయ్! నీ గుర్రాన్ని పక్కనుంచి వెళ్ళమను- ముగ్గు తొక్కేస్తుంది" అంది గంగ:

"ఫరవాలేదులేమ్మా!" అంటూనే గుర్రాన్ని అదిలించాడు దొరయ్య. గుర్రం గంగ ముగ్గునే కాకుండా ఆ వీధిలోని కన్నెపిల్లలు వేసుకున్న ముగ్గుల్ని తొక్కుకుంటూ వెళ్ళిపోయింది. గుర్రపు డెక్కల చప్పుడు వినగానే ముగ్గులు వేస్తున్న అమ్మాయిలు అరుగులు ఎక్కేశారు. గుర్రం వెళ్ళిపోయాక దిగి చెరిగిపోయిన ముగ్గులను సరిచేసుకుంటున్నారు.

గంగ "మాయగుర్రం! నాప్రాణానికే వచ్చింది. బంగారంలాంటి ముగ్గు పాడు




చేసింది" అంటూ వొంగొని చెదిరిపోయిన ముగ్గును సరిచేసుకుంది.

నాగమ్మ పాలచెంబు చేతపట్టుకుని అరుగుమీదకొచ్చింది.

"ఏమ్మా గంగమ్మా .... నీకు నిద్ద రక్కర్లేదా...?" అంది.

"ఎందుకక్కర్లేదు బామ్మా" గట్టిగా అంది గంగ.

"మీరందరూ ఎంత రాత్రుందనగా లేస్తే ఇంతింత ముగ్గు వేయగలరో నేను ఊహించుకోలేనచే?!"

"ఇంతకీ ముగ్గులెలా ఉన్నాయో చెప్పు?" అంది పక్కింటమ్మాయి.

"ముగ్గుల్నే చూసి, ముగ్గేసినోళ్ళని పెళ్ళాడే వోడుంటే రూపాయి కట్నం అడగకుండా నిన్ను పెళ్ళి చేసుకోవాలే" అంది నవ్వుతూ నాగమ్మ.

అందరూ నవ్వుకున్నారు.

"నీ చిన్నప్పుడు నీవిలా ముగ్గులేసావా బామ్మా?" మరో అమ్మాయి అడిగింది నాగమ్మని.

"ఎయ్యకపోవడం ఏంచే! పెళ్ళికాని క్రితం పుట్టింటి దగ్గర మొదలెట్టి అత్తారింటిదాకా వెతుక్కుంటూ వేసుకొని పోయేవాళ్ళం"

"మరి పెళ్ళయ్యాక!?" అడిగింది మరో అమ్మాయి.

"పెళ్ళయాక ముగ్గుల్లేవు గిగ్గుల్లేవు. రేపు పెళ్ళయ్యాక మీరైనా అంతేనే! ఇంత చలిలో మొగుణ్ణి ఒక్కణ్ణే పక్కమీద వదిలేసి వీధిలో ముగ్గులేత్తానంటే మొగుడొదులాడా? ఆ మొగుడు వదిలినా సందిట్లోంచి మీరు బయటకొత్తారా!!"

"బామ్మ ఎప్పుడ్డూ ఇలాంటి మాటలే!"

"ఆ...ఉన్నమాటేనే చిలకల్లారా! నేను పాలు పితకడానికి పోతున్నాను. శ్రీరంగ రంగ రంగా. మాయన్న కావేటిరంగ ... రంగా!" అంటూ ఆవు దగ్గరకుపోయింది.

రెండు మోకాళ్ళ మధ్యలో చెంబు పెట్టి ఆవుపాల ధారల్ని చెంబులోకి పడేలా పిండుతోంది. మనమడు చిన్నా లేగదూడని పట్టుకుని నిలబడ్డాడు. ఏదో చిత్రమైన ధ్వని వినిపిస్తోంది. దానికను గుణంగా సాతానయ్య తంబుర నాదం వీధి వాకిట్లో మోగుతోంది. గంగ కాలి మువ్వల పట్టాల ధ్వని ఆ నాదానికి లయ అయింది. పాటగా మారింది.

అలా ఆరంభమయినపాటతో ఊరంతా నిద్రలేస్తోంది. దొరయ్య భార్య వర్ధనమ్మ వళ్ళు విరుచుకుని మంచం దిగింది.

అరుగుమీద ఉన్న కుట్టుమిషన్ను తుడుస్తున్న శివుడు అమ్మాయిలు పాడుతున్న పాటకు అనుగుణంగా హమ్ చేస్తూ లయగా తల ఊపుతున్నాడు. తర్వాత మిషన్ మీద కూర్చుని ఒక గుడ్డమీద నేర్పుగా 'శ్రీ' అని కుట్టాడు. ఆ తర్వాత కుడుతూనేతను పాడటం మొదలుపెట్టాడు. దాంతో అప్పటిదాకా పాడుతున్న అమ్మాయిలు పాడటం మానేసి వాళ్ళ పాదాలకున్న మువ్వల పట్టీల సవ్వడితో తాళం వేయసాగారు.

శివుడు మిషను ఆపుచేశాడు. మిషన్‌తో పాటు పాటా ఆగింది. అమ్మాయిల పాదాల పట్టీల సవ్వడి మాత్రం వినిపిస్తోంది. ఆ సవ్వడిని విని శివుడు అక్కడక్కడ వున్న అమ్మాయిల్ని చూశాడు. వాళ్ళంతా నవ్వారు. ఆ నవ్వుల జలపాతానికి ఉక్కిరిబిక్కిరై శివుడు ఇంట్లోకి పారిపోయాడు. పని చేసుకుంటున్న శాంతమ్మ పక్కన చేరాడు.

"ఇప్పటిదాకా మిషన్ తొక్కుతూ పాడుకుంటున్నవాడివి ఎవరో తరుము

# మధురమైన రుచులన్నీ ప్రియలోనే వున్నయ్!




మీరు కోరుకొనే రకరకాల పచ్చళ్ళు మీ కందిస్తుంది-ప్రియ. మరపురాని రుచిరానుభూతులతో రూపొందినవే ప్రియ పచ్చళ్ళు. ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి తీసుకు వెళ్ళండి.

**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED

## ఎంతో రుచి... ఎంతో రుచి... - ప్రియ

Kiron/PF/833

కొస్తున్నట్టు లోపలికి పరుగెత్తుకొచ్చావేం బాబూ" అని అడిగింది శాంతమ్మ కొడుకుని.

"ఆడపిల్లలు నవ్వారమ్మా" అన్నాడు శివుడు సిగ్గుపడుతూ.

* * *

దొరయ్య గుర్రం మీద కూర్చుని చుట్టూ కలియచూశాడు. పూలతోటల్లో కొందరు కలుపు తీస్తున్నారు. మరో పూల తోటలో కొంతమంది ఆడకూలీలు పూలు కోస్తున్నారు. జామితోటలో ఎవరో మనిషి కదిలినట్టు కనిపించాడు దొరయ్య కంటికి. "ఎవర్రా అది?" దొరయ్య గర్జించాడు. ఆ గర్జన నలుపక్కల ప్రతి ధ్వనించింది. ఓ చెట్టుమీదున్న పక్షులు ఎగిరిపోయాయి. పూలు కోస్తున్న ఆడ కూలీలు, పనిచేస్తున్న జనం చేతిలో ఉన్న పనిని వదిలేసి అంతా దొరయ్యవైపే చూశారు. దొరయ్య గుర్రాన్ని అదిలించి జామితోటమీదికి పోనిచ్చాడు. పారిపో తున్న లేడిపిల్లను వెంటాడుతున్న రేసు కుక్కలా జామితోటలో పరుగెడుతున్న మనిషిని దొరయ్య వెంబడించాడు. అలా వెంబడించి వెంబడించి పారిపోతున్న వాడి జుట్టు పట్టుకున్నాడు. గుర్రం ఆగేదాకా గుర్రంతో పాటే దొరయ్య చేతికి చిక్కిన వ్యక్తి కూడా కుయ్యోమొర్రో అనిఅరుస్తూ పరుగెత్తాడు.

గుర్రం ఆగింది.

"జామి తోటలోకి ఎందుకొచ్చావురా" జుట్టు వదలకుండానే చాలా నెమ్మదిగా అడిగాడు దొరయ్య.

"కిందపడిన చిలకకొట్లు ఏరుకుందా మనండీ" అన్నాడు పోలిగాడు.

"ఏరుకున్నావా?"

"ఏరుకున్నానండీ"

"ఏవీ... చూపించు"

పైమీదున్న కండువాలో కట్టిన కాయల్ని దొరయ్య ముందు పోసాడు పోలిగాడు. ఆ జామికాయల్లో ఎక్కడా చిలక కొట్టినట్లు ఆనవాలులేని కాయలు కూడా కొన్ని వున్నాయి. వాటిని చూసి "ఇవి చిలక్కొడితే రాలిపోయిన కాయ లేనా? మాట్లాడవేరా చెవల్లంజాకొడకా.." అంటూ చేతిలోవున్న జుట్టును ఓ గుంజు గుంజాడు దొరయ్య. పోలిగాడు విల విల్లాడాడు.

"తప్పయిపోయిందండీ బాబు. అవి చిలక్కొట్లుకావు... కోసినియ్యే" అన్నాడు వణుకుతూ పోలిగాడు.

"కళ్ళతో కోసావా...చేత్తోకోసావా?" దొరయ్య అడిగాడు.

పోలిగాడు మాట్లాడలేదు. "కళ్ళతో కోస్తే కళ్లు పీకేస్తాను, చేత్తో కోస్తే చెయ్యి రిచేస్తాను" అని అరిచాడు దొరయ్య.

"చేత్తోనే కోసాను బాబూ... ఈసారికి ఈ తప్పు కాయండి బాబూ! చచ్చి మీ కడుపున పుడతా" పోలిగాడు దొరయ్య కాళ్లు పట్టుకున్నాడు.

"నీలాంటి దొంగలంజకొడుకు నా కడుపునెందుకురా పుట్టడం ... నన్ను దొంగోడి బాబనిపిద్దామనా? చేత్తోకోసావు కాబట్టి..." అంటూ చెయ్యి పట్టుకుని మెలి పెట్టి ఒక్కలాగు లాగాడు. పెళపెళమని శబ్దం వచ్చింది. పోలిగాడు కెవ్వున అరిచాడు. దొరయ్య గుర్రం ముందుకు వెళ్ళిపోయింది. పోలిగాడి చెయ్యి వేలాడ బడిపోయింది. ఏడుస్తూ పోలిగాడు పొలాలమీదకు వెళ్లాడు... పొలాల్లో పని చేస్తున్న వాళ్ళందరూ వాణ్ని జాలిగా చూసారు. గట్టుమీద నిలబడి కర్రమీద

చంక అనించి చుట్ట కాలుస్తూన్న శ్రీరాములు కాళ్ళమీదపడ్డాడు పోలిగాడు ఏడుస్తూ.

"ఏమిట్రా...ఏమయింది?" శ్రీరాము లడిగాడు. పోలిగాడు రెండవ చేతితో వేలాడబడుతున్న చేతిని ఎత్తి ''తమ్ముడు గారండీ...'' అన్నాడు ఏడుస్తూ.

"ఊ...సర్లే. అతగాణ్ణి తోమి కట్టు కట్టమంటాన్లే'' అన్నాడు శ్రీరాములు.

''వద్దండీ బాబు. మొన్న మన గిత్తకి చట్ట బెణికిందని దొరయ్య బాబుగారు తోముతుంటే చూసాను...గిత్త గిలగిల లాడిపోయింది'' పోలిగాడు భయపడుతూ అన్నాడు.

''సరే...అయితే పట్నంపోయి కట్టు కట్టించుకో" అని జేబులోంచి డబ్బు తీసిచ్చాడు శ్రీరాములు.

''దండాలు బాబూ'' అని పోలిగాడు వెళ్ళిపోయాడు.

దొరయ్య గుర్రంమీద ఇంటికి వచ్చాడు. ఇంటిముందు గుర్రం ఆగ్గానే దొరయ్య పాలేరు గన్నిగాడొచ్చి గుర్రం కళ్ళెం పట్టుకున్నాడు. దొరయ్య గుర్రం దిగి లోపలకెళుతూ ''ఒరేయ్ గన్ని... గుర్రాన్ని బాగా మాలిష్‌చేసి దాణాపెట్టి సిద్ధం చెయ్...మధ్యాహ్నానికల్లా గుర్రం రడీఅయి వుండాలి. బద్ధకించావంటే చెమ్డా కాలో తీసేస్తాను నాకొడకా'' అన్నాడు.

"చిత్తం" అని మారుమాట్లాడకుండా గుర్రాన్ని సాలలోకి తీసుకెళ్ళాడు వాడు.

దొరయ్య గొంతు విని అద్దంముందు కూర్చుని జాకెట్టు అందాల్ని చూసు కుంటున్న వర్ధనమ్మ ఉలిక్కిపడి లేచింది. కొంగు నిండుగా కప్పుకుంది. అంతకు ముందు మొఖంలో కనిపించే చలాకీ తనాన్ని చంపుకుంది. పెద్ద కంచు చెంబుతో కాళ్లు కడుక్కునేందుకు నీళ్ల తీసుకెళ్ళి దొరయ్య చేతికి అందించింది. కాళ్లు కడుక్కున్నాక తన భుజం మీదున్న టవల్‌తో కాళ్ళు వత్తింది. ఇంకా వత్తుతూవుంటే "ఊఁ..." అని దొరయ్య విదిలించుకుని ముందుకు నడి చాడు. అతని మోకాలు వర్ధనమ్మ తలకి తగిలింది. ఏం మాట్లాడకుండా కాళీ చెంబును, విడిచిన చెప్పుల్ని తీసుకుని లోపలకెళ్ళింది.

"భోజనం వడ్డించు!'' ఆదేశించాడు దొరయ్య. వర్ధనమ్మ మారు మాటాడ కుండా మిషన్‌లాగే భోజనం వడ్డించి పక్కకు వదిగి నిలబడింది.

* * *

శివుడు తన ఇంటి ఎడమపక్క అరుగుమీద మిషన్ తొక్కుతున్నాడు. కుడిపక్క అరుగుమీద పరిచి ఉన్న ఈతాకు చాపలమీద శివుడి వయస్సువాళ్లే నలుగురు యువకులు కూర్చున్నారు. ఓ పదేళ్ల కుర్రాడు కాజాలు కుడుతున్నాడు. ఆ నలుగురిలోనూ ఒకడు తనముందు హార్మోనియం పెట్టె పెట్టుకుని సాధన చేస్తున్నాడు. కిట్టప్ప అనే అతను ''సుబ్బారావ్... నేనో పాట పాడుతాను! నువ్వు వాయిస్తావా?" అన్నాడు. "'శృతి ఎంత?" సుబ్బారావ్ అడిగాడు. "అవన్నీ మనకు తెలియవు. నేను పాడు తాను శృతి ఎంతో నువ్వెతుక్కో...!" అన్నాడు కిట్టప్ప.

"సరే. ట్రైచేస్తాను... పాడు'' సుబ్బారావు హార్మోనియం మెట్లమీద వేళ్ళు కదిలించాడు. కిట్టప్ప అల్లంత దూరాన వస్తున్న ఒక పల్లెపడుచుని చూసి పాట మొదలెట్టాడు. ఆమె పూల

పరికిణీ పిక్కలదాకా ఎగ్గట్టి, నెత్తిన బట్టల మూట పెట్టుకొని చాకిరేవుకి పోబోతూ శివాకి జాకెట్టు గుడ్డ ఇవ్వడానికి వస్తోంది.

కిట్టప్ప ఆమె నడకను, ముస్తాబునూ, ఆమె చూపులనూ, ఆమె నెత్తిమీద బట్టల మూటనూ, ఆమె ఒంపులను వర్ణిస్తూ పాట మొదలెట్టాడు.

ఆ పడుచు మిషన్ దగ్గరకొచ్చింది. పాట మంచి రంజులో వుండగా లోపల నుంచి శివా తల్లి శాంతమ్మ సున్నుండల పళ్ళెం పట్టుకుని బయటకు వచ్చింది. పాట ఆగి పోయింది. ''అందరూ తినండి బాబూ'' అంటూ పళ్లెం ఆ కుర్రాళ్ల ముందు పెట్టి ఒక ఉండ శివ చేతికి అందించిందామె.

జాకెట్టు గుడ్డ ఇవ్వడానికి వచ్చిన పల్లెపడుచు చుక్క శివ దగ్గర నిలబడి, "ఈ జాకెట్టు మొగ్గలా కుదిరింది శివయ్య బాబూ...ఈ గుడ్డను అచ్చుముచ్చు ఈ జాకెట్టులాగే కుట్టాలి'' అంది.

"కొలతలు నా దగ్గర్లేవు. ఆది జాకెట్టు కావాలి" అన్నాడు శివుడు.

"ఇదిగో...ఇదే ఆది" అంది చుక్క తన వంటినున్న జాకెట్టు చూపిస్తూ.

శివ తికమకపడ్డాడు.

''సరే..ఆ ఆదేలే! ఆ జాకెట్టు కావాలి" అన్నాడు శివుడు.

"భలేవోడివే. ఈ జాకెట్టు ఎలా ఇవ్వమంటావు?" అంది కొంటెగా శివుడి కళ్ళల్లోకి చూస్తూ చుక్క.

"ఇప్పుడు కాదు...తర్వాత పట్టుకొచ్చి ఇవ్వు" అన్నాడు శివా మిషను తొక్కుతూనే.

"మంచి బేరమే! సందాళకి కొత్త జాకెట్టు యేసుకుని సినిమాకి యెల్దామనుకుంటే ఈయన ప్రోగ్రాం అంతా పాడు చేసేశాడు" అని అక్కడనుంచి వెళ్ళిపోయింది చుక్క.

''శివా...ఓ మంచి పాటో పద్యమో అనవయ్యా! ఈ కిట్టప్ప గాడితో తల దిమ్మెక్కిపోయింది" అన్నాడు అబద్ధం.

''అబద్ధం చెప్పిన మాట నిజమయ్యా! ఓ మంచి పాట అను...నేను వాయిస్తాను" అంటూ హార్మోనియం మెట్లమీద వేళ్లను పరుగెత్తించాడు సుబ్బారావ్.

''నువ్వు వాయించు...నేవద్దనడంలేదు. ఆ పాట కూడా కాస్త మాకు వినపడనీ. నీ వాయింపుతోనే మమ్మల్ని వాయించేయకు" అన్నాడు కిట్టప్ప.

"మీరు కాస్త ఉండండిరా.... శివాని ఆలోచించుకోనివ్వండి. శివా! తెలుగు మాష్టారు నీచేత రాయించాడన్నావు చూడు ... ఆ పాట పాడు" అన్నాడు పుల్లయ్య.

"నీకా పాటంటే భలే ఇష్టమనుకుంటాను పుల్లయ్యా! ఎందుకో నాకూ ఇష్టమే" అని ఆలాపన మొదలుపెట్టాడు శివ. శివ పాట పాడుతుంటే ఎదురుగా పెరట్లోవున్న ఆవు, ఆవుదూడ మోరలు ఎత్తిపెట్టి వింటున్నాయి.

ఎదురింటి వరండాలో బియ్యం కడుగుతున్న గంగ పాటలో లీనమైపోయింది. గిన్నెలోని కుడితి వంచడంతో పాటు పాటను వింటూ కడిగిన బియ్యాన్ని కూడా వంపేసింది-పాట పూర్తయింది.

నాగమ్మ వచ్చి గంగ వెనకాల నిలబడి నేలపాలైన బియ్యాన్ని చూసి, "ఏంటే పిల్లా ఈ పని? బంగారంలాంటి బియ్యాన్ని నేలపాలు చేశావు. పట్టపగలే కలలుకంటున్నావా ఏంటి?" అంది.

గంగ ఈ లోకంలోకొచ్చింది. "లేదు బామ్మా...గిన్నె చేయిజారి పోయింది.



జాగ్రత్తగా ఎత్తుతాలే" అంది నవ్వుతూ.

"బియ్యం వొలకపోసుకొనేటంత పరధ్యానం అయితే ఎలాగే పిల్లా?" అంది నాగమ్మ లోపలకుపోతూ.

బామ్మ మాటలకు తనలోతానే నవ్వుకుంది గంగ. ఎదురుగా అరుగుపైన మిషన్‌మీద కూర్చున్న శివుణ్ణి కాలివేళ్ల మీద లేచి చూసింది.

అంతలో 'గంగా' అంటూ బామ్మ లోపలనుంచి పిలిచింది. 'వస్తున్నా బామ్మా' అంటూ లోపలకు పరుగెత్తింది గంగ.

"నేను వంటింట్లో ఉంటే నువ్వా వరండాలో ఉంటావేంటే ... వంట వేళప్పుడు..!"

"ఆ టైలరబ్బాయి బాగా పాడతాడు బామ్మా...వింటున్నాలే"

"అంటే ఆ శాంతమ్మ కొడుకు శివుడేనా..?"

"అవును బామ్మా"

"అంత బాగా పాడతాడన్న మాట"

"నీకు వినబడదుగానీ...ఆ అబ్బాయి పాట వింటూంటే మనల్ని మనమే మరచి పోతామనుకో..!"

"అయితే ఓ పనిచేయవే పిల్లా! పాట వినడమేగా ముఖ్యం. ఈ వంటింట్లో కూర్చుని విను-నాకు వినబడదుకాబట్టి నే వరండాలో కూర్చుని ఆ కుర్రాడెలా పాడుతున్నాడో చూస్తా"

ఇంతలో శివుడు హార్మోనిస్టు ప్రోద్బలంతో ఉద్యోగవిజయాలు నాటకంలో పద్యం ఒకటందుకొన్నాడు.

"అదిగో బామ్మా...మళ్ళీ పాడుతున్నాడు" అని చెంగునలేచింది గంగ.

"నువ్వు ఇక్కడనుంచే వినవే" అని జబ్బపట్టుకుని గంగను కూర్చోబెట్టి, నాగమ్మ బయటకువచ్చి శివుడు పాడుతున్న పద్యాన్ని వింటూ నిలబడింది.

పద్యం పూర్తయ్యేసరికి బామ్మ వెనక ముక్కాలు పీటమీద నిలబడివుంది గంగ. ఆమె వెనక తమ్ముడు చిన్నా ధాన్యం బస్తామీద నిలబడివున్నాడు. ఇంచుమించు ముగ్గురూ తన్మయత్వంలోనే ఉన్నారు.

పక్కవాటాలో వర్ధనమ్మకు పాట అయిపోయాక ముక్కుకేదో వాసన తగిలినట్లుంది. "అయ్యయ్యో.. ఈ మాయదారి పిల్లాడి పాటల్లోపడి కూర మాడబెట్టాను. ఆయనగారొచ్చి కాల్చెయ్యో తీసేస్తానంటాడు" అంటూ వంటింట్లోకి పరుగెట్టింది.

* * *

చిన్నా అరుగుమీద బొంగరం తిప్పుకుంటున్నాడు.

"చిన్నా..." వర్ధనమ్మ పిలిచింది.

"ఏమిటి పిన్నీ!" అంటూ లోపలకు వెళ్లాడు చిన్నా.

"నువ్వు బంగారు తండ్రివిరా" అంది నవ్వుతూ వర్ధనమ్మ.

"బామ్మ కూడా నన్ను అలాగే అంటుంది"

"నువ్వో చిన్నపని చేసిపెడతావా నాకు"

"బామ్మ కూడా ఇంతే! నాతో ఏదైనా పని ఉన్నప్పుడే నన్ను బంగారు తండ్రీ అంటుంది"

"అదికాదు నాన్నా..నువ్వీ సున్నుండ తిను ముందు" అంటూ డబ్బాలోంచి సున్నుండ తీసిచ్చింది.

"బామ్మా ఇంతే.."అని చిన్నా ఇంకా ఏదో అనబోతుంటే, "కాసేపు ఆ బామ్మ సంగతి ఆపుచేసి నా మాట వినరా నాన్నా" అంది వర్ధనమ్మ.

"సరే...చెప్పు" అంటూ చిన్నా నోటి నిండా మినప సున్నుండ పెట్టుకున్నాడు.

"ముందు తిను...తర్వాత చెప్తాను" అంది వర్ధనమ్మ.

"నేను తింటూ వినగలను. చెప్పు... ఫర్వాలేదు" అన్నాడు చిన్నా.

నోట్లో ఉన్న సున్నుండ పొడుం వర్ధనమ్మ చేతిమీద పడింది.

"అందుకే ముందు తినరా నాయనా అన్నాను" అంది వర్ధనమ్మ పమిట చెంగుతో తుడుచుకుంటూ.

"అయిపోయిందిలే..చెప్పు" అన్నాడు చిన్నా నోట్లో సున్నుండ మింగేస్తూ.

"నువ్వో చిన్నపని చేసిపెట్టాలి నాన్నా...!"

"ముందు మంచినీళ్లు ఇచ్చి చెప్పు" చిన్నా అన్నాడు విసుగు బయటకు కనబడనీయకుండా.

వర్ధనమ్మ చిన్నాకి మంచినీళ్లు తెచ్చిచ్చింది.

చిన్నా నీళ్లు తాగి "ఇప్పుడు చెప్పు"





అన్నాడు.

"నువ్వు టైలర్ శివా దగ్గరకు వెళ్ళి ఈ అయిదు రూపాయలు ఇయ్యి. వాణ్ణి కొత్త సినిమా చూడమను. చూసి రేపు మన ఇంటికి రమ్మను" అందామె!

"ఓ...అలాగే" అంటూ అయిదు రూపాయలనోటు అందుకుని పరుగెత్తాడు చిన్నా.

"ఎవరికీ చెప్పకూ" అంది వర్ధనమ్మ.

"చెప్పనులే" అంటూ బయటకు పరుగెత్తాడు.

ఇంటి ముందుకు వెళ్ళేసరికి చిన్నాను పిలిచింది గంగ-

"ఎక్కడికిరా ఆ పరుగు" అంటూ!

"చెప్పకూడదు" అన్నాడు చిన్నా.

"ఏం? ఎందుకు చెప్పకూడదు??"

"పిన్ని చెప్పొద్దంది!"

"నా తో చె ప్పొ చ్చు లే. చెప్పు... ఫర్వాలేదు"

"నీతో చెప్పొచ్చని పిన్ని చెప్పలేదు"

"అయితే చెప్పకుపో!"

"అలా కోప్పడతావెందుకు..బతిమాలితే చెపుతాగా"

"అదీ...బంగారు తండ్రంటే అలా ఉండాలి! చెవిలో చెప్పు"

"టైలర్‌కి అయిదు రూపాయలిచ్చి రమ్మంది పిన్ని" అన్నాడు చిన్నా మెల్లగా రహస్యం చెప్పినట్టు.

"టైలర్ దగ్గిరకెళుతున్నావా? నాకూ్కడా చిన్న పనుందిరా..ఉండు" అంటూ లోపల కెళ్ళింది గంగ. ఓ గుడ్డ మూట పట్టుకొచ్చి, "ఇది ఆ టైలరబ్బాయికిచ్చి రేపు సాయంకాలానికి కుట్టివ్వాలని చెప్పు" అంది గంగ.

చిన్నా ఆ గుడ్డ మూట తీసుకుని "ఇంత గట్టిగా ఉందేమిటి?" అన్నాడు.

"నీకా గొడవంతా ఎందుకురా... చెప్పినపని చేసిరా" అంది గంగ.

"సర్లే...ఇచ్చేసి వస్తా" చిన్నా పరుగెత్తాడు.

"చిన్నా..."గంగ పిలుస్తోందే ఆగకుండానే "ఎవరికీ చెప్పనులే" అని పరుగెత్తాడు.

"కొంటె కోణంగి" అని నవ్వుకుంది గంగ.

* * *

చిన్నా, శివ మిషన్ ముందు నిలబడ్డాడు. పక్క అరుగుమీద శివ స్నేహితులు నలుగురు, కాజాలు కుట్టే కుర్రాడు ఉన్నారు. "ఏం చినబాబూ... ఇలా వచ్చావు?" అన్నాడు శివ.

"వీళ్ళందరూ టైలర్లేనా?" చిన్నా అడిగాడు.

"అదేంబాబు ... అలా అడుగుతున్నావ్?" అన్నాడు శివా నవ్వుతూ.

"ఎప్పుడూ ఇక్కడే ఉంటారుగా వీళ్ళు?"

"వాళ్ళంతా నా స్నేహితులు"

"అయితే వాళ్ళను అరుగుమీద కూర్చోబెట్టిందే నువ్వు కుట్టలేవా?"

"కుట్టగలననుకో. ఒక్కణ్నే ఉంటే బోరు కొడుతుందిగా!"

"సరే... మరిప్పుడెలా?"

"ఏమిటి బాబు?"

"మా పిన్ని ఈ సంగతి ఎవరికీ చెప్పొద్దంది-మరి నీకు చెబితే వాళ్లందరూ వింటారు...ఎలా?"

"చెవులో చెప్పుబాబు ... ఫర్వాలేదు"

చిన్నా చెవిలో ఏదో చెప్పి "ఇదిగో... ఐదు రూపాయలు" అని ఇచ్చాడు. తర్వాత "ఇది మా అక్క ఇచ్చింది రేపు సాయంకాలంకల్లా జాకెట్టు కుట్టివ్వాలట.

వస్తాను" అని వెళ్ళిపోయాడు. చిన్నా వెళ్ళిపోగానే పక్క అరుగుపై కూర్చున్న నలుగురూ శివ చుట్టూ మూగారు.

"చిన్నా నీ చెవిలో చెప్పిన రహస్యం ఏమిటి?" అడిగాడు సుబ్బారావ్.

"ఎందుకో నాకు భయంగానేవుంది" అన్నాడు శివ.

"రహస్యం ఏమిటో చెబితే భయం పోయేమార్గం నేను చెబుతా"

"ఈ రాత్రికి నన్ను సినిమా చూసి రేపు మధ్యాహ్నం ఇంటికి రమ్మన్నారట వర్ధనమ్మగారు" అన్నాడు శివ - రేపు మధ్యాహ్నం ఉరిశిక్ష ఖాయం అన్నట్టు మొఖం పెట్టి.

నలుగురూ ఇటూ అటూ పచార్లు చేస్తున్నారు. పుల్లయ్య సడన్‌గా ఆగి-

"మధ్యాహ్నంపూట ఇంటికి రమ్మన్నారూ అంటే దొరయ్యగారు పొలంలో ఉండే వేళన్నమాట" అన్నాడు.

"అంటే భర్త ఇంట్లో లేనివేళ. పగలు కాబట్టి ఎవ్వరూ అనుమానించని వేళ" అన్నాడు అబద్దం.

"పెళ్ళయి ఏడేళ్ళయినా ఇంతవరకూ ఆవిడ కడుపు పండలేదు. ఏ స్త్రీకైనా తల్లి కావాలని కోరిక ఉండటం సహజం కదా!"

"ఒరేయ్ ఒరేయ్... మీ దుంపతెగా! ఏమిట్రా ఆ వాగుడు. ఆ దొరయ్యగారి చెవినిపడితే కాళ్లో చెయ్యో విరిచేస్తాడు" అన్నాడు శివ బిక్కమొఖం పెట్టి.

"ఇటువంటి అవకాశం నా జీవితంలో ఒక్కసారైనా వస్తుందా అని నాకు ఊహ తెలిసినప్పటినుంచి ఎదురుచూస్తున్నాను. కానీ నాకు రాలేదు. నీకొచ్చింది. అదృష్టవంతుడివిరా" సుబ్బారావ్ ఆవేశంగా, బాధగా అన్నాడు.

"ఏమిటోయ్ ... నా బొందవకాశం" అని చిరాకుపడ్డాడు శివ.

"ఒక స్త్రీ ఐదు రూపాయల నోటు పంపించి సినిమా చూడమని ఆదేశించడమే ఓ గొప్ప అవకాశం. చూసి మర్నాడు మధ్యాహ్నం ఇంటికి రమ్మని ఆహ్వానించడం మరీ మహత్తరమైన అవకాశం"

"అయితే నేనే శివాను అని నువ్వు పోవచ్చుగా?"

"ఎలా వీలవుతుంది నాయనా! శివాని ఈ ఊళ్ళో ఎరుగని వాళ్ళెవరు!? వాడు కుట్టగలడు, పాడగలడు. నేనే శివానని వెళితే మిట్టమధ్యాహ్నం వచ్చి తలుపు కొట్టాడని ఆవిడ నామీద ఫిర్యాదు చేస్తే ఆ దొరయ్యగారు కాళ్లో చెయ్యో విరిచేస్తాడు" అన్నాడు సుబ్బారావ్.

"మరిప్పుడు నన్నేం చెయ్యమంటార్రా?" శివ అడిగాడు.

"ధైర్యే సాహసే లక్ష్మి అన్నారు. ఈ రాత్రికి సినిమా చూసి రేపు మధ్యాహ్నం నీవు వెళ్ళడమే" అన్నాడు అబద్దం.

"నాకెందుకో భయంగా ఉందిరా"

"భయపడకురా. మేం సాయమొస్తాములే"

"'నిన్నొక్కణ్ణే రమ్మంటే వీళ్ళందర్నీ ఎందుకు తీసుకొచ్చావ్?' అని అడిగితే ఆవిడ?" అన్నాడు శివ.

"అవును...అదీ పాయింటే" అన్నాడు సుబ్బారావ్.

"మరి ఏం చేద్దామంటార్రా" అని అడిగాడు నిస్సహాయంగా శివ.

"శివా! పోనీ నీవు వెళ్ళి ఆమె చెప్పినట్లు బుద్ధిగా నడుచుకుంటే" అన్నాడు సుబ్బారావు.

"అసలు నీ కంటికి నేనెలా కనిపిస్తున్నానురా" అన్నాడు కోపంగా శివ.

"ఓపని చేయరా శివా! నీవు లోపలికెళ్ళు...పదినిమిషాల్లోగా నీవు బయటకు రాకపోతే అర్జంటుగా మీ అమ్మ పిలుచుకు రమ్మంది అని నేను కబురు తెస్తా. నాతో వచ్చేద్దువుగాని" అని సలహా ఇచ్చాడు కిట్టప్ప.

"ఏమో...ఇదంతా చూస్తుంటే మన శివాని ఆ శివుడే రక్షించాలిగానీ మన చేతుల్లో ఏమీ లేదనిపిస్తోంది. మనవాడా ఇంట్లో అడుగుపెట్టిం తరువాత..." అబద్ధం ఏదో అనబోతుంటే, "ఊరుకోరా! తలుచుకుంటేనే గుండె జల్లుమంటోంది" అన్నాడు శివ.

"నిజమే మరి... బల్లి మీద బూడిద గుమ్మడి పండు పడినట్టు అనిపిస్తోంది" అన్నాడు సుబ్బారావ్.

"ఏది ఏమైనా పెద్దవాళ్ళతోపని. చెప్పినట్టు చేయడం మంచిది. కాదంటే ఆవిడగారు నీమీద దొరయ్యగారితో ఏదైనా చెప్పితే వాడు అసలే దుర్మార్గుడు" అన్నాడు కిట్టప్ప.

"రేపు మాత్రం మీరందరూ తప్పకుండా రండిరా! మీరు ఇక్కడుంటే నాకు కొండంత ధైర్యం" అని బతిమాలాడు శివ.

లోపలినుంచి శాంతమ్మ శివాని భోజనానికి రమ్మని పిలిచింది. "వస్తున్నాను" అన్నాడు శివ.

స్నేహితులు కూడా భోజనానికి వెళ్దామని లేచి వెళ్ళిపోయారు. లోపలకు వెళ్ళబోతున్న శివాకు చిన్నా తెచ్చి ఇచ్చిన గుడ్డ మూట కనపడింది..విప్పాడు. కొత్త జాకెట్టు గుడ్డా, దాని అడుగున ఉతికిన పాతజాకెట్టు, దానికింద జీడిపప్పు మిఠాయి అగుపించాయి. వాటితోపాటే ఓ ఉత్తరం ఉంది.

"శివా... నువ్వు బాగా పాడుతావు. నీ పాట వింటూంటే నన్ను నేనే మర్చిపోతాను. అందుకే తియ్యని కానుక" అని ఉందా ఉత్తరంలో.

జీడిపప్పు మిఠాయి తీసుకుని నోట్లో వేసుకున్నాడు. ఎదుటి వరండాలో నిలబడి గంగ తననే పరిశీలనగా చూస్తోందని గ్రహించిన శివాకి వెంటనే పాడాలనిపించింది. ఉత్తరాన్ని ఓసారి చూసుకుని 'గంగ' అని రాసి ఉన్న చోట ముద్దు పెట్టుకుని పాట మొదలెట్టాడు.

గంగ తృప్తిగా వింటోంది.పాడుతూనే శివ హుషారుగా ఆ ఉత్తరాన్ని జేబులో పెట్టుకున్నాడు. ఆ చేతికి చిన్నా తెచ్చి ఇచ్చిన కొత్త ఐదు రూపాయల నోటు తగిలింది.

పాట తక్కున ఆగిపోయింది మధ్యలోనే.

* * *

శివ దొరయ్యగారి ఇంటి వీధి గుమ్మం ముందు నిలబడి "అమ్మగారూ!" అన్నాడు అతనికే సరిగ్గా వినపడనంత నెమ్మదిగా.

వర్ధనమ్మ తలుపు తీసింది.

నవ్వుతూ "వచ్చావా...రాలోపలికి" అని తప్పుకుని దారిచ్చింది శివా లోపలికి రావడానికి.

"ఫర్వాలేదు...చెప్పండి" అన్నాడు శివ బెరుకుగా.

"నేను బయటకు రాకూడదు, తలుపు తెరుచుకుని గుమ్మంలో ఇంతసేపు నిలబడకూడదు. నువ్వు లోపలకురా....చెపుతాను" అంది వర్ధనమ్మ.

శివ గడప దాటి లోపలకు అడుగు

పెట్టాడు. "రా లోపలకు" అంటూ లోపలి గదిలోకి నడిచిందామె! శివ ఆమె వెంట పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్లాడు.

ఆమె వెనక్కి తిరిగి అతని ముఖంలోకి చూస్తూ "సినిమా చూశావా"? అనడిగింది నవ్వుతూ. శివ చూసాను అన్నట్టు తల ఊపాడు.

"ఎలా ఉంది?"

"పాటలు బాగున్నాయి"

"ఖర్మ. పాటల సంగతి కాదురా! జాకెట్లు...జాకెట్లు ఎలా ఉన్నాయి?"

"ఏం జాకెట్లండీ!"

"అవే..ఆ కొత్తగా వచ్చిన అనూరాధా, పాత జయమాలిని వాళ్ల జాకెట్లు ఎలా వున్నాయి?'' అడిగింది వర్ధనమ్మ కుతూహలంగా.

"ఒళ్లంతా కనబడుతూందండీ! జాకెట్టుకి మీటరు బట్ట కావల్సివుంటే పావు మీటరుతో సరిపెట్టేసినట్టున్నారండీ!''

''కరెక్టురా. నా జాకెట్లు ఇంక నువ్వలానే కుట్టాలి''

''ఎందుకండీ?''

"అవి నీకు బాగున్నాయా లేదా!''

శివ మాట్లాడలేదు.

"సిగ్గుపడకు. మగాళ్లందరికీ ఆ జాకెట్లు బాగానే వుంటాయి. అంచేత అలాగే కుట్టాలి. మా నాగమ్మత్త రవికల్లా కాదుసుమా. వంటినుంచి మొలచినట్టుండాలి...టైటుగా''

''సరే... అది ఇవ్వండి"

''ఆదా...?"

''అవునండీ...అది జాకెట్టండీ!''

''అలాంటి జాకెట్లు నాకు లేవు. ఇంత వరకు నీవు కుట్టలేదు"

''మరెలాగండీ...?''

''అది తీసుకో'' అని అతని ఎదురుగా నిలబడింది.

"టేప్ తేలేదండి" అని పరుగెత్తినట్టు నడిచిపోయాడు శివ.

ఇదంతా వెనకవైపు కిటికీలోంచి చూస్తోంది గంగ.

శివ వెళ్లిపోతూంటే వీధి వైపుకువచ్చి శివాను చూసి నవ్వింది.

శివా ఆమెను చూశాడు. ఆగాడు. ఆమె నవ్వు ఆపింది. అలా ఒకరినొకరు చూసుకున్నారు. గంగ నవ్వుకుని లోపలికి వెళ్ళిపోయింది.

శివా అడుగుముందుకు వేయబోతూ కాళ్ళముందున్న వాకిట్లోని ముగ్గును పరిశీలనగా చూశాడు. ముత్యాలముగ్గంటే ఇదేనేమో అనుకున్నాడు. స్నేహితులు ఎదురువచ్చారింతలో. ఎదురుగా వచ్చిన శివాను చూసి 'హమ్మయ్య'అనుకున్నారు.




శ్రీరాములు, దొరయ్య అరుగుమీద కూర్చున్నారు. రోడ్డుమీద ఎదురింటి చాకవార రత్తి, దాని మొగుడు సింహాద్రి, మరో ఇద్దరు తల నెరిసినవాళ్లు కూర్చున్నారు.

"ఇంతకి నువ్వు చెప్పదల్చుకున్నదేమిటే రత్తి?'' శ్రీరాములు అడిగాడు.

"ఆతగాడు నా మొగుడండీ!అతగాడికి నేను పెళ్లాన్నండి. నాతో మొగుడిలా

మసులుకోవాలి. నన్ను పెళ్లాంగా చూసుకోవాలి వాడు. కాని, నాతో మాట్లాడియాడాది అవుద్దండీ! మేమిద్దరం ఒక గూట్లో నిద్దురచేసి ఏడాదిపైనే దాటిపోయిందండీ! పేరు కాడి పెళ్లాన్నండీ-నా రెక్కల కష్టం చేసుకుని నేను బతుకుతున్నాను. అతగాడిది పావలా కూడా నేను తింటంలేదండి" అని చెరిగేసింది రత్తి.

"ఏరా సింహాద్రీ... కట్టుకున్న పెళ్లానికి తిండీ, బట్టా పెట్టాల్సిన బాధ్యత లేదట్రా!" గర్జించాడు దొరయ్య.

"మొగుడంటే తిండీ బట్టా పెడితే సరిపోతుందేంటండీ! ఆడు పెట్టే ఆ తిండీ బట్టా రెక్కల కష్టం చేసుకుని నేనే సంపాదించుకోగలను. నాక్కావల్సింది నా మొగుడు నాతో నా మొగుడులా వుండాలి.కుక్కతిరుగుడు తిరిగొచ్చి నన్ను కుక్కిన పేనులా పడి వుండమంటే నేనుండను'' అంది రత్తి ఆవేశంగా.

"నీ సమాధానమేమిట్రా?" శ్రీరాములు అడిగాడు.

"విడాకులిచ్చేమనండీ! నాకూ దానికీ కుదరదు" సింహాద్రి తలవంచుకుని అన్నాడు.

"తస్సాదియ్యా...నువ్వే తీర్పు చెప్పేస్తున్నావ్. ఊరికి పెద్ద మా అన్నయ్యా, నువ్వా...! చెయ్యోకాలో విరిచేసి గుర్రం చేత తొక్కించేస్తాను నా కొడకా"అంటూ కోపంతో తన చేతిలోసి కర్రను సింహాద్రి మీదకు విసిరాడు దొరయ్య.

"తప్పయిపోయింది దొరయ్యబాబూ! అదంటే పడక చటుక్కున నోరుజారింది గానీ తమరి మాటకెదురు చెబుదామని కాదు" అంటూనే విసిరిన కర్రతెచ్చి దొరయ్యకు ఇచ్చాడు సింహాద్రి.

"రత్తి ఏం తప్పుచేసిందని విడాకులిమ్మంటావ్?" శ్రీరాములు అడిగాడు.

"అది తప్పుచేసిందని కాదండీ!నాకూ దానికీ కుదరదండి''

"ఎందుకని..."

సింహాద్రి మాట్లాడలేదు.

"ఆడు నోరిప్పడండి బాబయ్యా! నే చెబుతాను...అవునోకాదో తలూపమనండి. ఓ ముండను తీసి పక్కూళ్ళో పెట్టాడండి. ఊళ్ళో కూలిపని చేయడం మానేసి అరటి గెలలు, కూరగాయలు పట్నం తీసుకెళ్ళి అమ్ముతున్నాడండి. వచ్చిన డబ్బుల్తో దానికి సబ్బులూ, పూలూకొని సింగారించి మురిసిపోతున్నాడండి. తాళి కట్టించుకున్న దాన్ని నన్ను మరిచిపోయాడండీ'' అంది రత్తి.

"ఏరా... నిజమేనా?" శ్రీరాములు గంభీరంగా అడిగాడు.

సింహాద్రి కిమ్మనలేదు.

"మాటాడవేరా చెవలంజాకొడకా!"

"నిజమేనండీ" సింహాద్రి సమాధానం చెప్పాడు.

రత్తికి ఎలా న్యాయం చేస్తారో విందామని తలుపుచాటున నిలబడి ఉంది వర్ధనమ్మ.

గంగ, చిన్నా జరుగుతున్నది చిత్రంగా వింటున్నారు.

"రత్తిని నిర్లక్ష్యం చేయడానికి అదేమయినా తప్పుచేసిందా?"శ్రీరాములు అడిగాడు సింహాద్రిని.

"లేదు"

"అలాంటప్పుడు తాళికట్టి నీకు నచ్చినన్నాళ్లు కాపురంచేయడం, నచ్చనప్పుడు దాని మోహం చూడకపోవడం తప్పుకదట్రా ! అదేమన్నా పశువనుకున్నారా... పనికొచ్చినన్నాళ్లు వాడుకుని,

పనికిరానినాడు తోలెయ్యడానికి. రేపటి నుంచి దాన్ని బుద్ధిగా ఏలుకో. మళ్ళీ నీ ముండదగ్గరకు వెళ్ళినట్టు తెల్సిందో...''

శ్రీరాములు మాట పూర్తికాకుండానే అందుకుని, ''కాలోచెయ్యోవిరిచేసి గుర్రం చేత తొక్కించేస్తాను. మళ్ళీ ముండగొడవ లేకుండా చేసేస్తా నా కొడకా'' అని గర్జించాడు దొరయ్య.



అప్పటికే గుర్రాన్ని తెచ్చి నిలబెట్టాడు సన్నిగాడు. గుర్రాన్నెక్కి వెళ్ళిపోయాడు దొరయ్య.

అలా బయల్దేరి వెళ్ళిన దొరయ్య గుర్రం ఓ ఇంటి ముందాగింది. ఆ ఇంటి గడపకు జారబడి చక్కగా అలంకరించుకున్న ఒక స్త్రీమూర్తి నిలబడి ఉంది. దొరయ్య గుర్రం దిగాడు.

''ఇలా ఎంతసేపటినుంచి ఎదురుచూస్తున్నావ్?'' అన్నాడు ఆమె బుగ్గమీద చిటికేస్తూ.

''ఎదురుచూస్తున్నది నిన్న తెల్లవారు

జామున మీరు వెళ్ళినప్పటినుంచి. ఈ గుమ్మం దగ్గర ఇలా నిలబడింది మీ గుర్రపు డెక్కల సవ్వడి చెవిన పడినప్పటి నుంచి" అంది ఆవిడ నవ్వుతూ.

"నీ మాటలే పారిజాతాలు. మాటలతో మనిషిని కట్టేస్తావ్. చేష్టలతో మనసును సొంతం చేసుకుంటావ్ పారిజాతం"

''అందుకే కాబోలు ఊరు మాటు మణిగేక వస్తారు, ఊరు నిద్దట్లో ఉండగానే వెళ్లతారు. పగలంతా మీకోసం ఎదురు చూస్తూ ఒంటరిగా ఉండాలి"

"ఏం చేస్తాం చెప్పు.పరువు ప్రతిష్టలు గల వంశంనాది. పదిమందికి చెప్పే వాళ్ళమేగానీ చెప్పించుకునేవాళ్ళంగాదు. అందుకే చీకట్లో సరసం"

''ఈవేళ ఇంతాలస్యమయిందేం? మీరింకా రాలేమోనని పక్కమీద మల్లెలు బిక్కమొఖం వేశాయి...''

దొరయ్య నవ్వి "మరి నువ్వో..?" అన్నాడు.

''నేనా...అలిసివాడిపోయాను'' అంది పారిజాతం అతనిని చుట్టుకుంటూ ఆమెను దగ్గరకు తీసుకుని మల్లెల పాన్పుమీద వాలుతూ, ''ఏం చేయను పారిజాతం! బయల్దేరేవేళవరకు తగువు ఒకటొచ్చింది. మొగుడు సర్గ్గా ఏలుకోవడంలేదని పెళ్లాం మా అన్నయ్యదగ్గర తగువుపెట్టింది. తీర్పుకు ఇద్దరం ఉండాలిగా... అందుకు ఆలస్యం అయింది"

''ఇంతకీ తీర్పు ఏమిటో...?" అంది కొంటెగా చూస్తూ పారిజాతం.

"ముండను వదిలేసి పెళ్లాన్ని బుద్ధిగా ఏలుకోమని చెప్పాను. లేకపోతే..."

''లేకపోతే కాలో, చెయ్యో విరిచేసి గుర్రంచేత తొక్కించేస్తానన్నారు... అంతేనా?" అంది పారిజాతం నవ్వుతూ.

దొరయ్య కూడా నవ్వాడు.

''న్యాయం ఎదుటివానికి చెప్పడమే కానీ ఆచరించే అలవాటు లేదా?" అంది పారిజాతం కొంటెగా.

ఆమెను దగ్గరకు లాక్కుని,"పెద్దవారు చెప్తారు తప్ప చెయ్యరు '' అన్నాడు దొరయ్య.

* * *

చిన్నా పరుగెత్తుకుంటూ మిషన్ దగ్గరకొచ్చాడు. ''శివా... నిన్ను మా అక్క అర్జెంటుగా రమ్మంది" అంటూనే మళ్ళీ పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు.

మిషన్మీదున్న బట్టలు అక్కడే పదిలేసి లేచాడు శివ.

''టేప్ పట్టుకెళ్ళవయ్యా టైలరూ!" అన్నాడు కిట్టప్ప.

శివ టేప్భుజమ్మీద వేసుకోబోతోంటే అన్నాడు సుబ్బారావు– "వద్దు... టేపు పట్టుకెళ్ళితే కొలతలు తీసుకోమనొచ్చు'' అన్నాడు సుబ్బారావ్.

"అయితే వద్దు" అని భుజంమీదున్న టేపుని మిషన్ మీదకు విసిరేశాడు శివ.

"వట్టి చేతుల్తో వెళ్ళితే మర్యాద ఉండదు" అన్నాడు కిట్టప్ప

"నిజమే" అని కత్తెర తీసుకున్నాడు శివ.

"అదెందుకు...యుద్ధానికి వెళ్ళినట్టు" అన్నాడు అబద్ధం.

"ఆ..గుర్తొచ్చింది. చిన్నమ్మాయిగారి జాకెట్టు పట్టుకెళతాను" అని కుట్టిన జాకెట్టు అందుకున్నాడు శివ.

"పరుగెత్తకు నాయనా...నడిచి వెళ్లు" అన్నాడు సుబ్బారావ్.

శివ వెళ్లేసరికి గంగ నాయనమ్మకు తలదువ్వుతూ, "నీకని మంచి మల్లు కొన్నానే బామ్మా!'' అంటోంది.




"ఎందుకే?" అంది బామ్మ.

"ఎందుకేంటే! నీకు రవికలు కుట్టిద్దామని! చిన్నాని టైలరుని పిలుచుకు రమ్మని పంపించాను కూడాను..."

"అమ్మాయిగారూ... చిన్నమ్మాయిగారూ..." పిలిచాడు శివ.

ఆ పిలుపు వినగానే ఒక్క ఉదుటున లేచి, "వస్తున్నా" అంటూ వెళ్ళి తలుపు తీసింది గంగ.

ఒక్క క్షణం ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటూ నిలబడిపోయారు.

"ఎవరే వచ్చింది? సీసా కొబ్బరినూనె తన్నేసి పోయావు" అంది లోపల్నుంచి బామ్మ.

"రా లోపలికి" అని, "టైలరొచ్చాడు బామ్మా" అంది బామ్మకు వినపడేలా.

"వచ్చాడా!" అంటూ నాగమ్మ వచ్చి, "ఏరా శివయ్యా....బాగున్నావా?" అని పలకరించింది.

"బాగానే ఉన్నానమ్మా!" చేతులు కట్టుకుని మరీ చెప్పాడు శివా. గంగ లోపల్నుంచి మల్లుబట్ట తెచ్చి శివా చేతిలో పెట్టింది.

"మా బామ్మకు రవికెలు కుట్టాలి" అంది గంగ.

"ఆది రవిక ఒకటివ్వండి" అన్నాడు శివ.

"'ఏమిటి కావాలట?" అంది నాగమ్మ.

"ఆది రవికట" గట్టిగా చెప్పింది గంగ.

"నాకు రవిక కుట్టడానికి ఆది ఎందుకురా! కుర్రపిల్లలకయితే బిగుతుగా ఉండాలి కాబట్టి ఆది కావాలిగాని. వీలయినంత వదులుగా కుట్టు నాకు గాలేస్తుంది. దీని పోరుపడలేక రవికలు తొడుక్కుంటున్నాను గానీ, ముసలాయన పోయినప్పటినుంచి రవికే ఎరుగను" అంది ముసలమ్మ.

గంగ నవ్వుతూంటే శివ పొట్లం అందించాడు- "ఇది మీ జాకెట్టు" అంటూ.

గంగ పొట్లం విప్పబోతే, వద్దన్నట్టు కళ్ళతోడే సైగ చేశాడు శివ! శివ వెళ్ళిపోయాక నాగమ్మ లోపలకు వెళ్ళిపోయింది. గంగ శివ ఇచ్చిన కొత్త జాకెట్టు పొట్లాన్ని చేత పట్టుకుని పడకగదిలోకి వెళ్ళి దాన్ని విప్పింది. కొత్త జాకెట్టు జబ్బలమీదకు వచ్చేలా, తాను వాకిట్లో వేసిన ముగ్గుల్నే జాకెట్టుమీద కుట్టాడు శివ. అది చూసుకుని జాకెట్టుని ముద్దు పెట్టుకుంది గంగ. అప్పుడే వేసేసుకుంది.

ఆ జాకెట్టుతోపాటు ఒక సంపెంగ పువ్వును కూడా ఆ పొట్లంలో ఉంచాడు శివ. ఆ పువ్వును తీసి ఒక్కసారి వాసన చూసి బుగ్గకు రాసుకుంది. శివ పాటలు తలుచుకుని మైమరచిపోయింది. తనకు తెలియకుండానే "శివా" అనుకుంది కూడా.

* * *

శ్రీరాములు ఇంటిముందు కొచ్చి ఆగింది పంచాయితీ సమితి జీపు. వచ్చినవారితో అరుగుమీద కవాచీ బల్లమీద శ్రీరాములు కూర్చున్నాడు. దొరయ్య మరో అరుగుమీదకుర్చీలో కూర్చున్నాడు. పాలెం పంచాయితీ సమితి అధ్యక్షుడు భూషణం రెండు చేతులు తలకింద పెట్టుకుని వాలు కుర్చీలో పడుకున్నాడు. అరుగు కింద మెట్టుమీద భూషణం నౌకర్లు బండోడు, దుక్కోడు నిలబడి ఉన్నారు. ఒకడి చేతిలో తుపాకీ, మరొకడి చేతిలో బల్లెం!

భూషణం శ్రీరాములు బావమరిది.

భూషణానికి ఒకే ఒక అక్క. ఆమెను శ్రీరాములుకిచ్చి పెళ్ళిచేశారు. ఆమె నాలుగేళ్ళ క్రితమే కాలం చేసింది ఆ ఒక్కగానొక్క అక్కకు పుట్టిన కూతురు గంగ, కొడుకు చిన్నా అంటే భూషణానికి ఎంతోగారాం. వీలైనప్పుడల్లా వచ్చి చూసి వెళ్తూ ఉంటాడు. ప్రతిచిన్న పండక్కీ, పెద్ద పండక్కీ కూడా తల్లిలేని పిల్లలనే జాలితోను మేన కోడలు, మేనల్లుడి పట్లగల ప్రేమతోను వాళ్ళింటికి తీసుకెళుతూ ఉంటాడు. అలా పిలుపడక పోతే గంగే నరెడ్ల సవారీ బండిలో మేన మామగారి ఊరు వెళుతూవుంటుంది.

వచ్చే సంవత్సరాది పండక్కి కూడా గంగనూ, చిన్నాను వాళ్ళ ఊరు పంపించమని చెప్పడానికి వచ్చాడు భూషణం.

"నేను మళ్ళీ వచ్చినా రాకపోయినా గంగని, చిన్నాని పండక్కి పంపండి బావగారూ" అన్నాడు శ్రీరాములుతో.

"అలాగేలే" అన్నాడు శ్రీరాములు చుట్ట చుట్టుకుంటూ.

"ఇక్కడ వాళ్ళకేం తక్కువనీ బావ గారూ... ప్రతి పండక్కీ పిల్లల్ని మీ ఊరు తీసుకెళ్తామంటారు" అన్నాడు దొరయ్య.

"ఇక్కడ వాళ్ళకేం తక్కువనికాదు దొరయ్య బావగారూ! మా అక్క పోయిన నాటినుంచి మా ఇంటికి వచ్చి గంగ మసలుతూవుంటే మా అక్కే మా ఇంట్లో మసల్తున్న తృప్తి నాకు. సరే... ఇంక చిన్నా అంటారా - వాడంటే వాళ్ళత్తకి ఎక్కడలేని ప్రాణం"

"సర్లేవయ్యా.... తీసుకెళ్దువుగానిలే పిల్లల్ని. ఇంతకీ మీ సమితి రాజకీయాలెలా ఉన్నాయి?" అడిగాడు శ్రీరాములు.

"ఏం చెప్పమంటారు బావగారూ! ఈనాటి రాజకీయాలు ప్రాణాల్తో చెలగాటం. పొడవడాలు, నరకడాలు, చంపడాలు, తుపాకులు, బాంబులు - ఇవే నిత్య కార్యక్రమాలయిపోయాయి అనుకోండి" అన్నాడు భూషణం.

"కనపడతానే వుందిగా బండోడి చేతిలో తుపాకీ, దుక్కోడి చేతిలో బల్లెమూనూ'' అన్నాడు దొరయ్య.

ఇంతలో చుక్క ఉతికిన బట్టలమూట నెత్తినెట్టుకుని అటు వచ్చింది. శ్రీరాములు గారి ఇంటి ముందుగానే దొరయ్యగారి ఇంట్లోకి వెళ్ళాలి అది!అల్లంత దూరాన్న చుక్క కనపడినప్పటి నుంచి దుక్కోడి కళ్ళు చుక్క మీదే వున్నాయి! తననే చూస్తున్న ఆ దుక్కోణ్ని, దుక్కోడి కండలు తిరిగిన శరీరాన్ని ఓరకంటితో చూసేసి, బుద్ధిగా దొరయ్యగారి ఇంట్లోకి వెళ్ళిపోయింది చుక్క.

"అమ్మగారూ ... బట్టలట్టుకొచ్చానండీ" అన్న చుక్క మాట విని వర్ధనమ్మ లోపల్నుంచి వచ్చి తుంగచాప పరిచింది.

చుక్క నెత్తిన వున్న మూట కిందకు దించి చాపమీద పెట్టింది. మోకాళ్ల మీద కూర్చుని చీరలూ, పంచెలు, దుప్పట్లు, జాకెట్లు వేరుచేస్తోంది.ఎదురుగా కూర్చున్న వర్ధనమ్మ చుక్క తొడుక్కున్న జాకెట్టునే పరిశీలనగా చూస్తోంది. చూసి చూసి చివరికి,

"ఈ జాకెట్టు ఎక్కడిదే చుక్కా....? ఎక్కడ కుట్టించుకున్నావ్?'' అనడిగింది కుతూహలంగా.

''నా మొఖానికింత మంచి జాకెట్టు నేనెక్కడ కుట్టించుకోగలను. మన చిన్నమ్మాయిగారిది. జాకెట్టు చూడగానే ముచ్చటేసి తొడిగేసుకున్నాను. మన




శివయ్యకు చూపించి ఇలాంటిది కుట్ట గలడేమో అడుగుదామని...'' అంది చుక్క.

ఆ జాకెట్టు గంగకు శివ ఎంతో ఆప్యాయంగా కుట్టియిచ్చినదే. ఆ సంగతి వర్ధనమ్మకు, చుక్కకు తెలియదు.

"ఒకవేళ ఆ శివగాడు ఇలాంటి జాకెట్టు కుట్టగలనంటే చేప్ పట్టుకుని నేరమ్మన్నానని చెప్పు'' అంది వర్ధనమ్మ.

''అలాగేనమ్మగారూ! చిన్నమ్మాయి గారింటికెళ్లి బట్టలు పట్టుకుని వెళ్లి పోతాను" అంటూ లేచింది చుక్క.

"శివాకు చెప్పడం మరిచిపోవుగా" జ్ఞాపకం చేసింది వర్ధనమ్మ వెళ్ళిపోతున్న చుక్కకు.

"భలేవారే... చిన్నమ్మాయిగారికాడ బట్టలట్టుకుని శివయ్య మిషన్‌కాడికే నే వెళ్లేది. అదిసరేగానీ అమ్మగారో, అరుగు మీద మనుషులెవరండీ!"

"చుట్టాలొచ్చారు!"

"అవు నాకు తెలుసులెండి. శ్రీరాములు బాబుగారి బావమర్దిగారేగా. నేనడిగేది తుమ్మదుంగలా కింద మెట్టుమీద నిలబడిన ఆ వస్తాదును గురించీ" అంది చుక్క.

"నే చూడలేదు! పాలెం అన్నయ్యగారి మనుషులై వుంటారు! ఏం...జడుసు కున్నావా?'' అంది నవ్వుతూ వర్ధనమ్మ.

''నాకెందుకండీ జడుపూ. కడవంత సమ్మిడికాయక త్తిపీటకులోకువఅన్నారు" అంటూ చిన్నమ్మాయిగారింటి వైపు వెళ్ళి పోయింది.

"బట్టలేయండి అమ్మాయిగోరూ" అంది చుక్క రెండు చేతులు నెత్తిమీద పెట్టుకుని గోడలు, దూలాలు చూస్తూ.

"సరిగ్గా చుట్టాలొచ్చే సమయానికే వస్తావే బట్టలేయండి అంటూ" అంటూ బయటకొచ్చింది గంగ. బయటకు వచ్చీ రావడంతోనే చుక్క తొడుక్కున్న జాకెట్టు చూసి "నీ దుంపతెగ అప్పుడే తొడిగేసావా జాకెట్టు. ఒక్కసారి తొడు క్కుని వేసాను, సింగారించేసావు. ఇంక నీకు చచ్చినా వేయను జాకెట్టు" అంది కోపంగా గంగ.

చుక్క నవ్వుతూనే "కోప్పడకం డమ్మాయిగారూ చాకలికట్టిన బట్టలు కట్టు కుంటే కడుపు చలవంటారు. పిల్లాపాపల్తో పది కాలాలపాటు చల్లగా ఉంటారండీ" అంది చుక్క.

"శాస్త్రాలు చాల్లే... ఇంకో జాకెట్టు ఇస్తాను... ఆ జాకెట్టిప్పి ఇక్కడే ఉతికి ఇచ్చేయ్"

"మా తల్లివికదూ ఒక్కసారి ఈ జాకెట్టు ఆ శివయ్యకు చూపించి ఇలా కుట్టిపెట్టమని బతిమాలి వొచ్చేదాకా ఊర్కోండమ్మాయిగారూ! ఒంటినపూసిన మల్లెపూవులాఉందమ్మాయిగారూ జాకెట్టు! చూసేకొద్దీ చూడబుద్దవుతుంది" అని బతిమాలింది చుక్క.

ఆ జాకెట్టును చుక్క అలా పొగుడుతూ, శివాను అలాటి జాకెట్టు కుట్టమనిబతిమాలుకుంటానంటూం టేగంగ పెదవులపై చిరునవ్వు కదలాడింది. చుక్కమీద కోపం కరిగిపోయింది.

"సరే... తగలడు. నా జాకెట్టు మాత్రం సాయంత్రం పట్టుకొచ్చి ఇచ్చేయ్ జాకెట్టు తెచ్చాకే బట్టలేస్తాను" అంది గంగ.

"అమ్మాయిగోరో... ఆ బయట నిలబ డిన వస్తాదులెవరండీ?"

"మా మావయ్య మనుషులు"

''వాళ్లూ మావయ్యగారి ఊళ్లోనే ఉంటారా?"

"వాళ్లమీద పడిందేం కన్ను?"

"భలేవారే - నా కన్ను వాళ్ళమీద పడటం ఏమిటి. వాళ్ళిద్దర్లో కాస్త లావుగా ఉన్నాడే వాడే నామీదేశాడు కన్ను. కడవంత గుమ్మడికాయక తిపిటకులోకువే. ఆడు నాకు లెక్కేంటి" అని బయటకు వెళ్ళిపోయింది. మెట్లుదిగివెళ్తూ దుక్కొన్ని ఓరకంట చూసింది. నవ్వీ నవ్వనట్టు చిరునవ్వు నవ్వింది. దుక్కోడు ఉక్కిరి బిక్కిరయ్యాడు.

"వస్తాను బావగారూ" అంటూ లేచాడు భూషణం. గుమ్మందగ్గర నిలబడి "పండక్కి తప్పకుండా రండమ్మా! పిన్నిగారితో కూడా చెప్ప వెళ్తన్నానని'' అంటూ మెట్లు దిగి జీపు ఎక్కాడు భూషణం.



మిషన్ ముందుకు వచ్చి నిలబడిన చుక్కను చూసి,

"నీ జాకెట్టు పట్టుకెళ్లిపోయావుగా... మళ్లీ వచ్చావేం?'' అన్నాడు శివ.

"అంటే...ఇంకో జాకెట్టు కుట్టించుకో కూడదా'' అంది చుక్క.

"ఇచ్చుకో''

"మరి కుడతావా?''

"నువ్వ బట్టా, ఆది జాకెట్టు ఇస్తే కుడతా. తొడుక్కున్న జాకెట్టు చూపించి ఇల్లాంటి జాకెట్టు కుట్టమంటే నావల్లకాదు" అన్నాడు శివ.

"ఆహా... అసలు నాకొక్క జాకెట్టు కూడా లేదు. వంటిమీద జాకెట్టు లేదనుకో''

''ఆ..'' అంటూ అప్పటిదాకా తల వంచుకునే కుడుతున్న శివ తలపైకెత్తాడు. చుక్క వంటిమీద చుక్క తొడుక్కున్న జాకెట్టు చూసాడు.

''ఈ జాకెట్టు ఎక్కడిది?''

"చిన్నమ్మాయిగారిదయ్యా''

''జాకెట్టు కుట్టిపెడతా.కానీ ఆ జబ్బల మీద ముగ్గులు నాకు రావు'' అన్నాడు శివ.

"ఇదెక్కడి బేరమయ్యా! మూడు ముళ్లు వేత్తాగానీ మంచంమీద తొంగో సన్నట్టుంది నీ వరస. జాకెట్టు సోకంతా జాకెట్టు జబ్బలమీద ముగ్గుల్లో ఉంటే, ముగ్గుల్లేని జాకెట్టెందుకూ. నా కంటే చిన్నోడివి నీకు దండమెట్టకూడదు గానీ ఆ ముగ్గులుకూడా వేసిపెట్టు. నువ్వేది అడిగితే అది యిత్తా''

"నాకు రాదు మొర్రో అంటే ముగ్గు లెయ్యమంటావేంటి ! నేనేమయినా ఆడ పిల్లనా ముగ్గులేయడానికి? నేను జాకెట్టు కుట్టిస్తా ముగ్గులు కావలిస్తే చిన్నమ్మాయి గారిచేత వేయించుకో''

''బాబ్బాబు... ఎలాగోలాగు వేసి పెడుదువూ''

"చుక్క అంత ముచ్చటపడుతున్న ప్పుడు కాదనకు శివా! వెధవది నాకు ముగులు రావుగానీ వస్తే జబ్బలమీదేకాదు వీపుమీద, ఛాతీమీద కూడా వేసేవాణ్ణి" అన్నాడు సుబ్బారావ్.

''నేను నిన్నెప్పుడు అడిగానయ్యా" అంది చుక్క అటు చూసి!

"లేదు .... వూరకనే చెప్పాను''





అన్నాడు సుబ్బారావ్.

"వీపుమీద ముగ్గులేస్తాను, ఛాతీమీద ముగ్గులేస్తాను అనీ హెచ్చులు పోయా వంటే చాకిరేవెట్టేస్తాను...అసలే నా నోరు, చెయ్యి మంచివికావు" అంది కోపంగా చుక్క.

కిట్టప్ప నవ్వుతూ "నీకూ నీవారులేరు నాకూ నా వారులేరు ... గాలిలోనా తేలి పోదామా" అని పాడాడు.

"ఇదిగో కిట్టప్పా...! నాకు మా అయ్య వున్నాడు ... నీకు మీ అయ్యా, అమ్మా వున్నారు. మా అయ్యకి తెలిస్తే నిన్ను చాకిరేవెట్టేయ్యడం ఖాయం. నేను మీ ఇంటికెళ్ళి చెప్పినా మీ అయ్య నిన్ను చాకిరేవు పెట్టెయ్యడం ఖాయం. అసలే నా నోరు, చెయ్యి మంచివికావు. బుద్ధిగా పడుండు.ఏమయ్యా శివయ్యా నాసంగతేం చేసావు'' అంటూ శివ వైపు తిరిగింది చుక్క.

"ఆ ముగ్గు నాకు రాదు...ఏదో వేరే ముగ్గు వేయమంటే వేస్తా. అది కూడా ఇప్పుడు కాదు...తీర్థం బట్టలు బోలెడన్ని వున్నాయి. తీర్థం అయ్యాకే" కాస్త మెత్త బడ్డాడు శివ.

"తీర్థానికే వేసుకెళ్ళాలయ్యా కొత్త జాకెట్టు" గారాబంగా అడిగింది చుక్క.

"నువ్వు తీర్థానికి వస్తున్నావా?'' అన్నాడు కిట్టప్ప.

"ఏం...నువ్వూ వస్తున్నావా?" చుక్క అడిగింది.

"మేమంతా వెళ్తున్నాం'' అన్నాడు కిట్టప్ప.

"నేను రావట్లే'' శివ అన్నాడు.

"నువ్వు రాకపోతే మేమూ వెళ్ళము. సరే...ఈసారికి నువ్వెళ్ళిరా చుక్కా''

కిట్టప్ప ఆ మాట అంటుండగానే చిన్నా పరుగెత్తుకొచ్చాడు.

"ఈ జాకెట్టు వదులయిందట... బిగువు చేయమంది మా అక్క. ఎంత బిగువు చేయాలో అందులోనే రాసుంది'' చెప్పి తూనీగలాగ వెళ్ళిపోయాడు చిన్నా.

జాకెట్టు విప్పాడు శివ... అందులో చిన్న చీటీమీద "రేపు తీర్థానికి వెళ్తున్నాం. నువ్వూ రావాలి" అని వుంది.

"సరే...ఇస్తాలే...నువ్వెళ్ళు" అన్నాడు శివ చుక్కని వుద్దేశించి.

"తీర్థానికి ముందే ఇచ్చేస్తావా"

"ఇస్తానన్నానుగా" అన్నాడు శివ.

"నా బంగారుకొండా" అంటూ మెటికలు విరిచి వెళ్ళిపోయింది చుక్క.

"ఇంతకీ తీర్థానికి ఎలా వెళ్దామను కుంటున్నారురా" అన్నాడు శివ.

"శివుడు లేని తీర్థం మాకెందుకు" అన్నాడు కిట్టప్ప.

"ఒకవేళ నే వస్తే'' అన్నాడు శివుడు నవ్వుతూ. నలుగురు స్నేహితులు ఒకేసారి ఈలవేసారు.

ఎదురింటి వరండాలోవున్న గంగ ఆ ఈలకు వులిక్కిపడి వెనక్కి చూసింది.

* * *

నరెడ్ల సవారీ బండిమీద నాగమ్మ, గంగ, చిన్నా తీర్థానికి బయల్దేరారు... చింతలూరులో నూకాలమ్మ తీర్థం చాలా గొప్పగా జరుగుతుంది ... ఆ తీర్థానికి చుట్టుపట్ల గ్రామాలనుంచి, పట్టణాలనుంచి కూడా జనం వస్తారు ... నూకాలమ్మకు ముడుపులు చెల్లించుకుంటారు. చింతలూరు వైపు వెళ్ళే రోడ్డు బండ్లతోటి,సైకిళ్ళతోటి, స్కూటర్ల తోటి రద్దీగా వుంటాయి.

గంగ వాళ్ళ నరెడ్ల బండి చింతలూరు వైపు వేగంగా పోతోంది... బండి తొట్టెలో పగ్గాలు పట్టుకుని చిన్నా కూర్చున్నాడు...

బండిముందు కొండా పరుగెడుతున్నాడు. బండికి ముందూ వెనకా తెరలు కట్టి వున్నాయి.... శివ, శివ స్నేహితులు సైకిళ్ళమీద వస్తున్నారు... బండిని దాటివాళ్లు వెళ్ళడం చూసింది గంగ.

ఆ బండి



గంగా వాళ్ళదని తెల్సిన శివ తన స్నేహితుల్ని ఆ బండి దాటేదాక గట్టిగా మాట్లాడొద్దని వారించాడు.

చీకటిపడటంతోటే తీర్థం మొదలయింది... గుడికి వెళ్ళేదారికి రంగు రంగుల కాగితాలతోటి, మామిడి కొమ్మల



తోటి తోరణాలు కట్టారు. ఆ రోడ్డుకు ఇటు అటు దుకాణాలు వెలిసాయి. మిఠాయి దుకాణాలు, చిన్నసైజు కాఫీ హోటళ్ళు, గాజుల దుకాణాలు, ఇత్తడి దుకాణాలు, గుండాట, కవల్లాట, చక్రం ఆటలాంటి జూదాలు ఏర్పాటు చేయబడ్డాయి...కొంతమంది ఆడవాళ్ళ గాజులు తొడిగించుకుంటున్నారు... చిన్నపిల్లలు బుడగలు, ఈలలు కొనమని తల్లులతో

మారాం చేస్తున్నారు. కుర్రకారు జనం అమ్మాయిలున్న వైపు వెళ్లి దోపుళ్ళాడిపిస్తున్నారు...నవ్వుకుంటున్నారు. కేరింతలు కొడుతున్నారు.

తీర్థంలో ఒకచోట గాజుల దుకాణం దగ్గర చుక్క గాజులువేయించుకుంటోంటే శివ, అతని స్నేహితులు చూసారు. చుక్కే శివాను పలకరించింది.

"శివయ్యబాబూ..నువ్వుకుట్టినజాకెట్టే! ఒంటికి మొగ్గలా అమరింది" అంది చుక్క. శివ అంత తీర్థంలో చుక్కతో మాట్లాడ్డం సిగ్గనిపించి నవ్వి ఊరుకున్నాడు.

"చేతిమీద ఆ ముగ్గును కూడా ఏసేస్తే ఏం చక్కగా ఉండేది" అంది చుక్క.

శివ బదులు చెప్పలేదు.

"నువ్వొక్కత్తివే వచ్చావా చుక్కా?" అన్నాడు కిట్టప్ప.

"లేదు... ఇంకా నలుగుర్ని వెంటేసుకొచ్చాను" అంది చుక్క వెటకారంగా.

"ఎవరు వాళ్లు...?" అన్నాడు సుబ్బారావ్.

"మీరు నలుగురే" అంది శివాను తప్పించి మిగిలినవార్ని చూపుతూ.

"మరయితే నువ్వా మాతోనే ఉండాలి" అన్నాడు అబద్ధం.

"ఉంటాను. భుజం తాకించడానికి, కాళ్లు తొక్కడానికి వెర్రిమొర్రి ప్రయత్నాలుచేస్తే ఒక్కొక్కర్నే చెరువు దగ్గరకు తీసుకెళ్లి చాకిరేవెట్టి పిండి ఆరేస్తాను" అంది చుక్క వాళ్ళకళ్ళలోకి సూటిగా చూస్తూ.

"ఎందుకంతంత మాటలూ...నీ దగ్గర మేమెప్పుడూ జెంటిల్‌మెన్స్‌మేగా" అన్నాడు సుబ్బారావ్.

ఇంతలోగంగ నాయనమ్మను,చిన్నాను వెంటబెట్టుకుని తీర్థంలోకొచ్చింది. కొండా బండిదగ్గరున్నాడు. కుందనంబొమ్మలాంటి గంగ తీర్థంలోంచి నడుస్తూ ఉంటే ఆడా మొగా, చిన్నా పెద్దా ఆమెనే చూస్తున్నారు. ఆమె కట్టుకున్న పట్టు పరికిణీ పైన వేసుకున్న నీలిరంగు వోణి, జబ్బలమీద ముగ్గులు అల్లి శివా ఇచ్చిన జాకెట్టులో గంగ చూడముచ్చటగా ఉంది. పల్లెసీమలోని అందం సరదాపడి అమ్మాయిగా పుట్టినట్లుంది గంగ.

తాను కుట్టిచ్చిన జాకెట్టే గంగ వేసుకున్నందుకు శివ లోలోపలే మురిసిపోతుంటే,

"అలా కాస్త దగ్గరకెళ్దాంపద" అన్నాడు సుబ్బారావ్ శివాతో.

"ఇలాంటి తీర్థాలలో, ఉత్సవాలలోనే కావాలనుకున్న మనుషుల్ని కాస్త దగ్గర్నుంచి చూడొచ్చు, పలకరింపుగా నవ్వొచ్చు. వీలైతే కాస్త చెయ్యొకాలో తాకించవచ్చు"

"ఇంక నువ్వు నోరు ముయ్యొచ్చు" అన్నాడు శివ.

ఇంతలో ఓ ఇద్దరు బస్తీ కుర్రాళ్ల గంగ వెంట పడ్డారు. ఏదో నవ్వుతూ, తుళ్ళుతూ ఆమె అందం గురించి కామెంటు చేస్తూ పక్కపక్కనే నడుస్తున్నారు. తోసుకుంటున్నారు. ఆ తోపుళ్లాటలో ఒకడు వచ్చి కావాలని గంగను తాకాడు.

గంగ కోపంగా చూసింది.

'సారీ' అన్నాడు అతను. అక్కడితోటి ఆగకుండా "కోపంలో మరీ అందంగా ఉందిరా" అన్నాడు పక్కవాడితో.

"ఆ వాలుజడ చూస్తోంటే తాకకుండా ఉండటం కష్టమనిపిస్తోంది" అన్నాడు మరొకడు.




ఇదంతా గమనిస్తున్న శివా, అతని స్నేహితులు ఉండబట్టలేకపోయారు.

"మనూరమ్మాయిని ఆ వెధవలెవరో అలా అల్లరిపెడుతోంటే చూస్తూ ఊరుకుంటారేమిట్రా..పదండి వాయించేద్దాం" అన్నాడు సుబ్బారావ్. శివ ఆపుచేసాడు. అతని కళ్లు చుక్క కోసం వెతికాయి. చుక్క మరో ఇద్దరమ్మాయిల్తో కల్సి మిఠాయి దుకాణం దగ్గర కనిపించింది.

శివ ఆమెను పిలిచి చెవిలో ఏదో చెప్పి గంగ వెంటపడుతున్న కుర్రాళ్ళని చూపించాడు.

చుక్క అప్పటిదాకా వేలాడుతున్న కచ్చా బిగించి, తన పక్కనున్న స్నేహితురాళ్ళకి చెవిలో ఏదో చెప్పి యుద్ధానికి బయల్దేరినట్టు బయల్దేరింది.

కాస్త ఎదరకు వెళ్లి గంగకి, ఆ కుర్రాళ్ళకి ఎదురొచ్చింది.

గంగతో మాట్లాడుతూనే దగ్గరగా వచ్చిన ఓ కుర్రాణ్ణి మోచేత్తో డొక్కలో ఓపోటు పొడిచింది. 'అమ్మో' అన్నాడతను.

"ఇలా పొడిచి మీ పట్నంలో అయితే సారీ అంటారు కదా బాబు" అంది చుక్క నవ్వుతూ.

అతను నవ్వాడు వెకిలిగా!

"కంట్రీ బ్యూటీ" అన్నాడు పక్కవాడు.

"ఏంటీ..కంత్రీ గింత్రీ అంటున్నావ్" అంటూ నవ్వుతూ అతని దగ్గరకు వెళ్ళి కాల్తొక్కింది. వెనక్కి గెంటింది. తూలి పడబోతే పట్టుకుంది పడకుండా.

అలా, చుక్క ఆమె స్నేహితురాళ్లిద్దరూ ఆ ఇద్దరు పట్నం కుర్రాళ్ళనీ తీర్థం నుంచి తప్పించి బంతాడుకున్నారు.

"ఇప్పుడర్థమయిందా పట్నం కుర్రాళ్లూ! ఒంటరిగా అమాయకమైన ఆడపిల్ల కనిపిస్తే ఏడిపించి పెద్ద మగాళ్ళమనుకోవద్దు. ఇంతటి మొగాళ్లు ముగ్గురాడపిల్లల మధ్యలో పడేసరికి ఎలా అయిపోయారో చూడండి – చాకిరేవు పెట్టిపిండేసిన మప్పట్లాగా. ఇకనుంచి బుద్ధిగా బతకండి" అని బుద్ధిచెప్పి చుక్క, ఆమె స్నేహితులు శివా దగ్గరకొచ్చారు.

గుడికి కుడిపక్క ఖాళీగా వున్న మైదానంలో రంగులరాట్నం,జయింట్ వీల్ ఉన్నాయి. "రంగులరాట్నం ఎక్కుతావా చిన్నా?" అంది గంగ.

"ఎక్కుతా ఎక్కుతా" అంటూ చిందులుతొక్కాడు చిన్నా.

"వాడికన్నీ కొరికి మప్పుతావేనువ్వు" అంటూ రంగులరాట్నం వైపు నడిచింది బామ్మ. రంగులరాట్నం దగ్గర అప్పటికే ఏనుగునూ, పులినీ, గుర్రాన్ని ఎక్కి శివ, శివ స్నేహితులు రడీగా ఉన్నారు. ఖాళీగా వున్న కుర్చీలో గంగ, చిన్నా బామ్మని మధ్యలో కూర్చోబెట్టుకుని ఎక్కి కూర్చున్నారు.

రంగులరాట్నం తిరిగి, తిరిగి ఆగాక నాగమ్మ దిగి నడుస్తూ తూలితే శివ పట్టుకున్నాడు.

"నా బాబే.. పడిపోదును. సమయానికి వచ్చి పట్టుకున్నావు" అందామె.

"తీర్థానికి నువ్వొక్కడివే వచ్చావా.. మీ అమ్మకూడా వచ్చిందా?" అని పలకరించింది నాగమ్మ.

"నేనొక్కణ్నే వచ్చానండీ" అన్నాడు శివ. "ఏవంటాడో" అంది నాగమ్మ సరిగ్గా వినపడక గంగతో.

"ఒక్కడే వచ్చాడట" అంది గంగ గట్టిగా బామ్మ చెవిలో.

"మరయితే మాతోపాటే ఉండరాదూ"

అంది నాగమ్మ శివాతో. ఇంతలో శివ స్నేహితులు కూడా అక్కడకు వచ్చారు. తమ ఊరివాళ్ళే కాబట్టి గుర్తించింది నాగమ్మ.

"ఇంకా ఉందిగానీగ్యాంగూ" అని నవ్వుతూ మనవణ్ని, మనవరాల్ని తీసుకుని గరగాట వైపు వెళ్ళింది.

ఆ ఊరి చాకళ్లు గరగాటలో ఆ చుట్టు పక్కల మంచి పేరున్నవాళ్లు. నాలుగు గరగలు ఆడుతున్నాయి. రెండు పూల గరగలు, రెండు సాదా గరగలు. పూల గరగలు పొడుగ్గా శంఖు ఆకారంలో ఉంటాయి. మామూలు గరగలు చీరగట్టి పాము పడగ ఆకారంలో ఉంటాయి. చాకళ్లు ఈ గరగలను తమ నెత్తిపైన చుట్టుకున్న తలపాగాల పైనుంచీ డప్పు దరువుకు అనుగుణంగా అడుగులేస్తూ అభినయిస్తూ ఆడుతారు. అది ఒకరకమైన జానపద నృత్యం. అలా ఆడుతున్న వాళ్ళలో ఒకళ్ళకి శివమెత్తి పూనకం మోస్తుంది. ఆ పూనకం వచ్చినప్పుడు సాంబ్రాణిపొగ వేస్తారు హారతి కర్పూరం ముద్ద వెలిగించి ఇస్తే నోట్లో వేసుకుని మింగేస్తాడు. ఆ పూనకం వచ్చినప్పుడు కోడిపిల్లను చేతికందిస్తే మెడ ఇవతలి పక్కకూ, మొండెం అవతలిపక్కకూ గిల్లి పారేస్తాడు. ఇది ఏటా జరిగేసంబరం. ఆ సంబరం చూట్టానికి జనం చుట్టూ మూగుతారు.

ఆ సంబరం చూడ్డానికే నాగమ్మ గంగనూ, చిన్నాను తీసుకుని అటు బయలేరింది. గరగాట మంచి రసపట్టులో ఉంది. అమ్మవారి ఆలయంముందు అమ్మవారికి ఎదురుగా ఆట జరుగుతోంది. డప్పులవాళ్లు, గరగాటవాళ్లు, ఎవరి విద్యను వాళ్లు ప్రదర్శించడానికి తాపత్రయపడుతున్నారు. గంగవాళ్ళకు కాస్త ఎడంగా శివ, అతని స్నేహితులు ఉన్నారు. శివ కళ్లు గంగ కోసం, గంగ కళ్లు శివ కోసం వెతుకుతున్నాయి. చూపులు కలిశాక నవ్వుకున్నారు. స్నేహితుల్ని తప్పించుకుని శివా గంగకు చేరువ కావాలని ప్రయత్నిస్తున్నాడు.

ఇంతలో అల్లంత దూరాన డప్పుల చప్పుడు వినపడింది. అరుపులూ కేకలూ వినపడ్డాయి. అందరూ అటు తిరిగారు. ఎనుబోతు మొఖానికి పసుపురాసి బొట్లు పెట్టి, మెడలో వేపాకు దండలు, బంతి పూలదండలు వేసి ఇద్దరు బలమైనవాళ్లు ఎనుబోతు ముక్కుకు పోసిన తాళ్ళను పట్టుకుని అమ్మవారి ముందుకు నడిపించుకొస్తున్నారు. మూడేళ్ళకోసారి ఆ తీర్థంలో నూకాలమ్మకు ఎనుబోతును బలివ్వడం తరతరాలుగా వస్తున్న ఆచారం. ఈ ఏడాది ఆ గ్రామపెద్ద, ఆ ఆలయ ధర్మకర్త అయిన వీరస్వామి గారమ్మాయి ఆటమ్మ వచ్చి తగ్గిన కారణంగా ఆయన ఇంటబుట్టిన ఎనుబోతునే బలిస్తున్నారు.

ఎనుబోతు ముందుకు రావటంతో గరగాట ఆగిపోయింది. గరగాట దగ్గరున్న డప్పులుకూడా ఎనుబోతుముందుకు వెళ్లాయి. ఎనుబోతును నరకడానికి సిద్ధంగావున్న ఇద్దరు బలిష్టులు కసాయి కత్తులుభుజంమీద పెట్టుకుని ఎనుబోతుతో పాటు గుడిచుట్టూ ప్రదక్షిణం చేస్తున్నారు. మూడోసారి ప్రదక్షిణ అయిపోయిన తర్వాత ఎనుబోతును అమ్మవారు కెదురుగా బండరాయి దగ్గర నిలబెట్టారు.

జనమంతా ఎనుబోతును నరకడం చూడ్డానికి కుతూహలంగా ఎదురుచూస్తున్నారు. డప్పులమోత పెరిగింది. రెండు చేతుల్లోనూ కత్తులు పైకెత్తారు. గంగా,

 

చిన్నా, చూడలేనివారు మరికొంత మంది కళ్లు మూసుకున్నారు.

ఇంతలో గాలిలోకి తుపాకి పేలింది

"ఆగండి" అన్న గర్జన వినపడింది. డప్పులు నిశ్శబ్దమైపోయాయి. చీమ చిటుక్కుమంటే వినిపించే నిశ్శబ్దంలో సబ్ఇన్స్పెక్టర్ ముందుకొచ్చాడు.

"ఎనుబోతును బలివ్వడానికి వీల్లేదు పీరస్వామిగారూ" అన్నాడు ఎస్సయ్!

"తరతరాలనుంచి వస్తున్న ఆచారం... మీరొచ్చి కాదంటే ఆగిపోతుందా" అన్నాడు పీరస్వామి.

"కావచ్చు...ఇది మూఢాచారం. ఈ దారుణ హింస ఇకమీదట జరగడానికి వీల్లేదు"

"ఎందుకు వీల్లేదు? అమ్మవారే దున్నపోతు రూపంలోవున్న మహిషాసురుణ్ణి వధించింది. మనమొక దున్నపోతును అమ్మవారికోసం నరికితే తప్పేమిటి? అది కాకపోయినా ఎవరి నమ్మకాలువారివి. ప్రజల నమ్మకాలతోటి, మతాచారాలతోటి అధికారులు అడుకోవడం మొదలెడితే జనం వూరుకోరు...దేవుడూ వూర్కోడు" అన్నాడు పీరస్వామి.

"ఈ ఎనుబోతును బలివ్వడం అపు చేస్తే అమ్మవారు ఊరుకోదంటారా?" అన్నాడు ఎస్సయ్!

"ఊర్కోదు సరిగదా తగిన శాస్తి కూడా జరిగి తీరుతుంది"

"సరే...ఎనుబోతును మీరు వది లెయండి. దాన్ని ఓ దెబ్బకొడతా. అది పారిపోకుండా ఇక్కడేవుంటే నరికేయండి. ఒకవేళ పారిపోయినా మనం ఎవ్వరం ఇక్కడనుంచి కదలొద్దు. అమ్మవారి దగ్గర శక్తుంటే ఆ ఎనుబోతును తిరిగి గంటలోపల రప్పించుకోవాలి. అలా తిరిగొస్తే నరికేయండి. అంతేగానీ ఇలా బలితీయించి నరకడం నేనొప్పుకోను" అంటూ పీరస్వామి సమాధానంకోసం ఎదురుచూడకుండానే ఎస్సయ్ఎనుబోతును చేతిలో బెత్తంతో గట్టిగా కొట్టాడు. అదే సమయంతో ఎనుబోతును పట్టుకున్న వాళ్లు తాళ్ళను వదిలేసారు. దెబ్బ వంటిమీద పడగానే ఎనుబోతు రంకెలేస్తూ అరుస్తూ రెచ్చిపోయి జనంలోంచి పారిపోవడానికి దారి వెతుక్కుంటూ గంగా, నాగమ్మ, చిన్నా వున్న వైపు పరుగెత్తింది.

ఒక్క పరుగులో శివా వెళ్ళి ముస లమ్మను పక్కకునెట్టి గంగా, చిన్నాను తన సందిట్లోకి తీసుకుని ఎనుబోతు తాకిడినుంచి తప్పించాడు. అయినా శివా వీపుకు ఎనుబోతు కొమ్ము గీసుకుని గాయం అయింది. ఎనుబోతు పారిపోయింది.

ఆ అనుకోని సంఘటనకు అందరూ చెదిరిపోయారు.

"చూసిన తీర్థం చాల్లే తల్లీ! బిడ్డ దేవుడిలా వచ్చి కాపాడాడు. బండి దగ్గరకు పోదాం పద" అంది నాగమ్మ. గంగ వెనక్కి తిరిగి తిరిగి శివాను చూస్తూ చిన్నా చేయి పట్టుకుని బామ్మ వెంట తమ బండివైపు నడిచింది.

అమ్మవారి ఆలయం ముందువున్న బలిపీఠం చుట్టూ ఎనుబోతును బలిస్తే చూడాలని చేరిన జనం ఇంకా అక్కడే వున్నారు. కొంతమంది ఎనుబోతును తిరిగి అమ్మవారు రప్పించుకుంటుందని, కొంతమంది ఆ ఎనుబోతు రాదని తర్జన భర్జనలు చేసుకుంటున్నారు. తమ తమ నమ్మకాల్నిబట్టి పై పందాలుకూడా కాసుకుంటున్నారు. అర్ధరాత్రి దాటడంతో తీర్థం కొంతవరకు సద్దుమణిగింది. అలసి

పోయిన పిల్లలు నిద్రకొచ్చారు.

శివ తన స్నేహితుల్ని నెమ్మదిగా తప్పించుకుని గంగ వున్న బండివైపు నడిచాడు. బండిలో నాగమ్మ, చిన్నా నిద్రపోతున్నారు. గంగకు నిద్రరావడం లేదు. తొట్టిలోని గడ్డి నేలమీద పరుచుకుని కాస్తదూరంలో పాలేరు కొండ పడుకున్నాడు.

గంగ నిద్రరాక ఇటూ అటూ కాసేపు ఒత్తిగిలి చివరకు నెమ్మదిగా బండి దిగి తీర్థంవైపునడిచింది.

అప్పటికే శివ అటు వచ్చేసాడు. ఇద్దరూ తీర్థానికి కాస్త ఎడంగా కలుసుకున్నారు.

"ఎక్కడకు బయల్దేరారు చిన్నమ్మాయిగారూ?"నెమ్మదిగాఅడిగాడు శివ.

"నీ కోసమే" అనబోయి, తమాయించుకుని, "నువ్వెక్కడకు బయల్దేరావు?" అంది గంగ.

"ఎందుకో మిమ్మల్ని చూడాలనిపించింది. వెతుక్కుంటూ బయలేరాను" అన్నాడు శివ.

"నీ ప్రాణాలకు తెగించి మమ్మల్ని కాపాడావు. నీకేదో చెప్పాలని, ఏదో చేయాలని మనస్సులోవుంది. కానీ ఎలాగో ఏంటో తెలియడంలేదు"

శివ నవ్వాడు గంగ మాటలకు.

"అలా తీర్థంలోకి వెళ్దాం రండి" అన్నాడు శివ.

"అటొద్దు. ఇలా పొలాలవైపు వెళ్దాం" అంటూ గంగ ముందుకు నడిచింది. శివా వెనక నడిచాడు. ఏకాంతంగా ఆ చల్లని వెన్నెల రాత్రిలో ఆతోటలమధ్య తిరగడం వాళ్ళిద్దరికి ఒక అపురూపమైన అనుభూతి. ఇవతలి గట్టునుంచి అవతలి గట్టుకు నడుము పట్టుకుని ఎత్తి దాటిచ్చాడు శివ. అప్పుడే అతని వీపుకు తగిలిన గాయం చూసింది గంగ.

"ఏమిటిది?" అంది ఉలిక్కిపడుతూ.

"దున్నపోతు చేసిన గాయం" అన్నాడు శివా నవ్వుతూ.

"అయ్యబాబోయ్...ఎంత గాయమో! పొడుగ్గా చీరుకుపోయింది" అని వగచింది గంగ. చేతితో మృదువుగా వీపుమీది గాయాన్ని పామింది. మందే గాయానికి నవనీతపు స్పర్శలా హాయిగా ఫీలయ్యాడు శివ. అలా అన్నీ మరచి వాళ్ళు ఊసులు చెప్పుకుంటుండగానే ఎక్కడో దూరాన కోడి కూత వినిపించింది. పక్షుల కిలకిలలు వినిపించాయి.

"ఈ రేయికి పగలనేది లేకపోతే ఎంత హాయిగా ఉండేది చిన్నమ్మాయిగారూ!" అన్నాడు శివ.

"అలాకాదు శివా...అసలు ఈ రాత్రే మన జీవితకాలమైతే ఎలా ఉండేది" అంది గంగ మత్తుగా. శివ ఆమె కళ్ళలోకే చూస్తూ "అమ్మాయిగారూ" అన్నాడు.

"ఏం ... మన జీవితం ఒక్కరాత్రే అనుకుంటే భయమేస్తుందా"

"లేదమ్మాయిగారూ" అంటూనే ఆమెను సందిట్లోకి తీసుకుని ముద్దుల్తో తడిపేశాడు శివ.

* * *

తీర్థానికి వెళ్ళివచ్చిన జనానికి బడలిక తగ్గడానికి రెండు రోజులు పట్టింది. గంగకు ఆనాటి తీయని అనుభూతులూ, ఆ రాత్రీ తలుచుకున్నకొద్దీ మళ్ళీ మరీ తలుచుకోవాలనిపిస్తోంది. శివాకు కన్ను మూసినా కన్ను తెరిచినా గంగతో గడిపిన ఆ రేయే కళ్ళముందు కదులుతోంది...

మిషన్ మీద కూర్చుని బట్టలు కుడు





తున్నాడే తప్ప అతని కళ్లు ఎదురింటి వరండాలో గంగ కనపడుతుందేమోననే వెతుకుతూన్నాయి. ఆమె కనబడితే ఎక్కడలేని ఆనందంతో మనసు నిండి పోతోంది. ఆమె కనుమరుగైతే మనిషి నిరీక్షణతో అలిసిపోతున్నాడు.

ఆరోజు సాయంకాలం గంగ చక్కగా అలంకరించుకుని జడనిండా మల్లెపూలు పెట్టుకుని వరండాలో ముక్కాలి పీటమీద కూర్చుంది. మోచేతిని కాలిమీద ఆన్చి, అరచేతిలో గెడ్డాన్ని పెట్టుకుని మిషన్ కుడుతున్న శివానే చూస్తోంది.

శివ ఆ అందాల బొమ్మని చూసి, అనుకోకుండా తీర్థంనాటి రాత్రి పాడిన పాట అందుకున్నాడు.

గంగ తుళ్ళిపడి ఈ లోకంలోకి వచ్చింది. ఆమె ముఖం సూర్యరశ్మి సోకిన తామర పూవులా వికసించింది. అలా మిషన్ తొక్కుతూ పాడుతూ శివా చొక్కా, బనీను, రవిక, లంగా కలిపి వరుసగా గొలుసుకింద కుట్టేశాడు. పక్క అరుగుమీద కూర్చున్న మిత్రులు నోరు తెరుచుకుని చూస్తుండిపోయారు.

పాట వినపడని నాగమ్మ మనమరాలి ముందు కూర్చుంటూ కొబ్బరినూనె సీసాను మనమరాలికిచ్చి "తల క్కాస్తంత నూనె రాయమ్మా! తల దిమ్ముగా ఉంది" అంది.

గంగ పరధ్యానంగానే నూనె సీసాను అందుకుని తనముందు తల విరబోసుకుని కూర్చున్న నాయనమ్మ తలమీద ఆప కుండా పోసేసింది.

నూనె చెంపలమ్మటా, ముఖాన కారుతూ ఉంటే, "ఇదేం యిడ్డూరమే పిల్లా! నూనె రాయమంటే నూనెతో తానమే సేయిం చేశావ్'' అంటూ గంగ ముందునుంచి లేచిపోయింది నాగమ్మ.

"పొరపాటు అయిపోయింది బామ్మా" అంది గంగ నాలిక కొరుక్కుని.

"కొత్తగా పెళ్ళయిన రోజుల్లో మొగుడు వత్తాడన్న రోజుకి రాకపోతే ఆ మర్నాడు ఇలా పరధ్యానంగా ఉండే వాళ్లం మా సిన్నతనంలో. ఇదెక్కడి యిడ్డూరమోగానీ...ఈ పిల్ల పెళ్లి కాకుం డానే పరధ్యానంలో ఉండిపోతావుంది'' అంది నాగమ్మ.

"ఛీ...పో బామ్మా" అంటూ లోపలకు పారిపోయింది గంగ.

గంగ అలా మాయమవగానే శివ తను కుట్టిన గొలుసు కుట్టును చూసి శివ నాలుక కొరుక్కున్నాడు. దేనికది విడ దీయడంలో పడిన శివాను నలుగురు స్నేహితులూ ఆట పట్టించారు.

బయట నవ్వులు విని లోపలినుంచి శాంతమ్మ వచ్చింది.

''ఏమిట్రా...పనీ పాటా లేకుండా అల్లరి" అని మందలించింది వాళ్ళని.

నలుగురు స్నేహితులూ కిక్కురు మనకుండా వెళ్ళి అవతలి అరుగుమీద ఈతాకు చాపమీదకెళ్ళి కూర్చున్నారు.

శివా సీరియస్‌గా మిషన్ తొక్కడం మొదలుపెట్టాడు. శాంతమ్మ నవ్వుకుని లోపలకెళ్ళిపోయింది.

* * *

చుక్క ఉతికిన బట్టల మూట విప్పి తుంగ చాపమీద వేటికవి వేరు చేస్తూ పరుస్తోంది.

గంగ పద్దు పుస్తకం పట్టుకుని "ఆరు దుప్పట్లు'' అంది.

చుక్క ఆరు దుప్పట్లూ లెక్కపెట్టి పక్కన పెట్టింది.

"అమ్మాయిగారూ... మీతో ఓమాట

సెప్పాలండీ" అంది చుక్క.

"చెప్పవే" అంది గంగ.

"నేను అర్జంటుగా పెళ్ళి చేసేసుకోవాలండీ"

"ఏమిటే... అంత అర్జంటు?"

"మా అయ్య సచ్చినోడు లేడండీ..."

"లేకేం... వున్నాడుగా"

"ఉన్నాడులెండి. నిన్నటిదాకా నేనూ ఉన్నాడనే అనుకున్నాను. నేను ఎవర్నో ఒకణ్ని కట్టుకుని ఎల్లిపోతే ఆడికి గంజి నీళ్లు ఎలా వత్తాయని ఆలోసించే ఆడి కోసం ఇలా గడక్ర్రలా ఉండిపోయాను. కానీ నిన్నటితో ఆడు సచ్చాడండమ్మాయి గోరూ" చుక్క ఏడుస్తూ ముక్కు చీదింది.

"అయ్యో పాపం! మీ అయ్య అప్పుడే చచ్చిపోయాడా!" అంది గంగ జాలిగా.

"చచ్చినోడితోనే జమండి అమ్మాయి గోరూ! అర వైవేళ్లు దాటాక మళ్ళీ మనువాడి ఎవత్తినో ఇంటికి తెచ్చి నా



నెత్తినెక్కిత్తే సచ్చినోడుగాక, బతికినోడి కిందలెక్కా? అడి సుఖం ఆడు సూసుకున్నాక నా సుఖం నేను సూసుకోడం తప్పంటారా అమ్మాయిగోరూ?" ఉడుకుమోత్తనంగా ఏడుస్తూ అంది చుక్క.

'తన తండ్రి ఎంత మంచివాడో' అనుకుని ఆలోచనలో ఉండిపోయింది గంగ.

"ఏటండమ్మాయిగోరూ మాటాడరు?"

"తప్పులేదే!"

''మరైతే నాకో మంచి సంబంధం సూడండి.. పెళ్లాడేత్తాను'' అంది చుక్క.

"ఏమిటే..నీకు పిచ్చిపట్టిందా!నేనేమైనా పెళ్ళిళ్ళ పేరయ్యననుకుంటున్నావా! నేనెక్కడ చూడనే సంబంధం నీకు" అంది గంగ నవ్వుతూ.

చుక్క సిగ్గుపడుతూ,"మీరేమీ అనుకోనంటే నాకో సిన్న సాయం సెయ్యాలమ్మాయిగోరూ" అంది.

''ఏమిటే అది?"

"మీ మావయ్యగారివెంట ఇద్దరొచ్చారు కదండీ! ఆళ్ళలో ఆ తుమ్మదుంగలా ఉన్న దుక్కోడి సంగతి కాతంత ఈపాలి మా వ య్య గా రి ఇంటికెళ్ళినప్పుడు కనుక్కోండి నా కోసం'' అంది చుక్క సిగ్గుపడిపోతూ.

''అసలు వాడెవడో, వాడికి పెళ్ళి అయిందోలేదో ఏమీ తెలుసుకోకుండానే ప్రేమించేశావేమిటే వాణ్ని?"అంది గంగ నవ్వుతూ.

"నాకదంతా తెల్దు అమ్మాయిగోరూ! సూపులు కలిసాయి. మనసులో ఉన్న మాట తమరికి సెప్పాను. అన్నీ కుదిరితేనే గదండీ...ఏదైనా జరిగేది! ఏవయినా మా అయ్య సచ్చినోడికి అరవయ్యోపడిలో పెళ్ళికి అర్థంలైనప్పుడుఇరవై యేళ్ళదాన్ని నాకు కాదా? మీరు నాకోసం ఈ యిసయం తేల్చి నన్నో ఇంటిదాన్ని సేసెయ్యాలమ్మాయిగోరూ" అంది చుక్క గారాబంగా.

"సరేలే .... పద్దు చూడు. నాలుగు లంగాలు" చదివింది గంగ.

పద్దుచూసి బట్టలు వప్పచెప్పి వెళ్ళిపోయింది చుక్క.



# 4

గంగ జాకెట్టుగుడ్డ, ఆది జాకెట్టు మూటకిందకట్టి చిన్నా చేతికిచ్చి ''శివాకి ఇచ్చేసిరా" అంది.

కాని చిన్నా కదలకుండా అక్కడే జల్లమీద కూర్చుండిపోయాడు.

''వెళ్ళి ఇచ్చేసి రమ్మంటే అలాగే కూర్చున్నావేరా?" అంది గంగ.

''నువ్వాలోచించుకో బాగా" చిన్నా అన్నాడు.

"ఆలోచించుకోవడం దేనికి?''

"ఆ తర్వాత మళ్ళీ అయ్యో నేచెప్పడం మరిచిపోయానురా! నడుముకాస పొడుగు పెట్టమని చెప్పడం అనో, చేయి కాస వదులు పెట్టమని చెప్పడం అనో అంటావు. అంచేతనే చెప్పాల్సినవి ఇంకా ఏమైనా ఉంటే అవన్నీ కూడా ఇపుడే ఆలోచించుకుని చెప్పు...ఆ తర్వాతే వెడతాను" అన్నాడు చిన్నా.

"ఏమీ అక్కర్లేదు! ఆది జాకెట్టు

అందులో పెట్టానులే" అంది గంగ.

"పట్టీ ఆది జాకెట్టు, జాకెట్టుగుడ్డే ఇంత పొట్లం అయిందా?" చిన్నా ప్రశ్నించాడు.

"రెండు జాకెట్టు గుడ్డలేవోయ్...వెళ్ళి ఇచ్చిరా"

"చిరాకుపడితే పనులు జరుగుతాయేంటి? శాంతమే భూషణం అంటుంది బామ్మ. లోపల గట్టిగా ఉందేమిటి?" పొట్లం నొక్కుతూ అడిగాడు చిన్నా.

గంగకు ఇక గతిలేక, "నా బంగారు తండ్రివికదూ! ఈ లడ్డూతీసుకో. తింటూ వెళ్లి ఇచ్చేసిరారా నాన్నా" అంటూ ముద్దాడింది చిన్నాను.

"అదీ..అలా మంచిగా చెబితే మంచిగా ఇచ్చేసి వస్తా" అంటూ చిన్నా లేచి పరుగెత్తాడు.

పరుగు పరుగున వస్తోన్న చిన్నాను చూసి శివా, అరుగుమీద కూర్చున్న నలుగురు మిత్రులు లేచారు. చిన్నా వగరుస్తూ తన చేతిలోని పేకెట్టు శివా చేతిలో పెట్టాడు. నలుగురు మిత్రులూ చుట్టూ మూగారు.

"పొండ్రా అవతలికి" అని చిరాకు పడ్డాడు శివా.

"ఏం చెప్పారుబాబూ" అన్నాడు చిన్నాతో.

"ఏమీ చెప్పలేదు. మా అక్క ఈ పాకెట్టు నీకిచ్చేసి రమ్మంది"

"సర్లేబాబూ.... కుట్టి పట్టుకొస్తాను" అన్నాడు శివ.

"నువ్వు జాకెట్లు తప్ప ఇంకేం కుట్టలేవా?"

"అదేంటిబాబూ...ఎందుకుకుట్టలేను?"

"నా బట్టలు ఎప్పుడూ కుట్టలేదేం మరి?"

"నీ బట్టలు కుట్టమని ఇస్తేగా... నేను కుట్టేది" అన్నాడు శివ నవ్వుతూ .

"అదీ రైటేలే. రేపే ఇస్తానుండు. నా బట్టలెలా కుడతావో చూస్తాను" అంటూ వెళ్ళిపోయాడు చిన్నా.

"ఆ పాకెట్టు విప్పు మిత్రమా" అంటూ సుబ్బారావూ, అతని వెనకే మిగిలిన ముగ్గురూ శివా దగ్గరకు చేరారు.

శివాకు వళ్లు మండి, "ఎందుకు విప్పాలిరా పేకెట్టు" అన్నాడు.

"మా దగ్గరకూడా నీకు రహస్యమా మిత్రమా!"

"అందే నాకు రహస్యమే ఉండకూడదంటారా మీరు?" అన్నాడు శివ.

"ఇటువంటి విషయాల్లో నీకు మా దగ్గర రహస్యం ఉండనేకూడదు నాయనా! నీవు చిన్నవాడివి. అందులోనూ తొలి ప్రేమలో తొలి మెట్టు పైనున్నవాడివి. అంచేత నీ క్షేమం కోరే వ్యక్తులుగా అన్నీ తెలుసుకోవలసిన బాధ్యత మాకుంది. అంచేత ఆ పేకట్టు విప్పు" అన్నాడు సుబ్బారావు.

"పెద్ద ప్రేమలో తల నెరిసిపోయిన వాళ్ళలా మాట్లాడుతున్నారామీరు! నాకు మీ సలహా కావల్సినప్పుడు అడుగుతా కానీ నన్ను అనవసరంగా వేధించకండి... పొండి"అంటూనే పొట్లం విప్పాడు శివా.

జీడిపప్పు మిఠాయి! నోరూరింది శివాకి. ఓ పలుకుతీసి నోట్లో వేసుకున్నాడు. మిగిలింది నలుగురు స్నేహితులకి విసిరాడు. వాళ్లు అది పంచుకుని తినడంలో పడ్డారు.

ఓ ఉత్తరం విప్పాడు. లోపల యాభై రూపాయిల నోటు.

"శివా... జాకెట్లు బాగా కుట్టావు. ఈ యాభై తీసుకో. నేను ఎల్లుండి మా

మావయ్యగారింటికి వెళ్తున్నాను. ఎల్లుండి పొద్దునకి ఈ జాకెట్టు కుట్టివ్వాలి''

శివ ఉత్తరం చదివాక ముద్దు పెట్టుకున్నాడు యాభై రూపాయల నోటు జేబులో పెట్టుకున్నాడు.

తను ఆమెకు కుట్టినవి నాలుగు జాకెట్లకంటే ఎక్కువ లేవు. ఇరవై రూపాయలు కావచ్చు కుట్టుకూలి! యాభై రూపాయలు పంపించింది చిన్నమ్మాయి గారు!

'డబ్బుగల వాళ్లుగదా... డబ్బు లెక్క ఉండదు! మరయితే ఆవిడగారికి లెక్కలేని డబ్బు తనకు మాత్రం లెక్కా! ఇదివరలో కూలికే కుట్టాడు బట్టలు తను. ఈమధ్య చిన్నమ్మాయిగారికి కుట్టిన బట్టలు కూలికోసమా తను కుట్టింది! ఎంత మనసుపెట్టి, ఎంత ప్రేమతో కుట్టాడు తను. అమ్మాయిగారు బాగుంది అనాలి. అమ్మాయిగారు తొడుక్కున్న జాకెట్టులా కుట్టిపెట్టాలని చూసినవాళ్లు అడగాలన్న పట్టుదలతో తను కుట్టాడు. దానికి కూలి యాభై రూపాయలా! అసలు అవి కూలికి కుట్టినవా' ఆలోచనలో పడ్డాడు శివ.

ఇంతలో మళ్లీ పరుగుపరుగున వచ్చాడు చిన్నా- మరో పాకెట్టు పట్టుకుని శివా మిషన్ దగ్గరకు.

"మళ్ళీ వచ్చావేం బాబూ?" అన్నాడు శివ.

"నీ మిషన్‌కి అంత గిరాకీ పెరిగిపోతోంది మరి" అంటూ తన చేతిలో వున్న పేకెట్టు శివాకిచ్చాడు.

"నాకో పైజామా, లాల్చీ కుట్టాలి... అక్క చెప్పింది''

"కొలతలియ్యి మరి" అంటూ చిన్నా కొలతలు తీసుకున్నాడు శివ.

"రేపటికిస్తావా?" చిన్నా అడిగాడు.

"ఇవ్వనంటే ఊరుకుంటావా నువ్వు!" అన్నాడు శివ నవ్వుతూ.

"అమాత్రం భయం వుంటే చాల్లే" అని చిన్నా వెళ్ళిపోయాడు.

శివా పేకెట్టు విప్పాడు.

అందులో చీటి-

"నువ్వు కూడా పైజామా, లాల్చీ ఫాషన్‌గా కుట్టుకో. చిన్నాకు కూడా అలాగే కుట్టాలి...కాదనకూడదు"

శివ వుత్తరం చదువుకుని నవ్వుకున్నాడు. ఆ ఆనందంలో హమ్ చేస్తూ జోరుగా కుట్టడం మొదలుపెట్టాడు శివా.

* * *

గంగ పెట్టె సర్దుకుంటోంది.

"చిన్నాను కూడా తీసుకెళ్లనా బామ్మా?" అంది గంగ పెట్టె మూస్తూ.

"అన్నికూడా నువ్వు వెంట లీసుకుపోతే నాకు తోచదే. నువ్వు వెళ్ళిరా ఈ సారికి. మళ్ళీసారెళ్లినపుడు తీసుకెడుదువు గాని వాణ్ని" అంది నాగమ్మ.

"ఈ చిన్నా ఎక్కడున్నాడో ఏమో. ఆ శివా ఇంతవరకు బట్టలు తేలేదు" తనలో తానే అనుకుంటూ, "చిన్నా" అని పిలిచింది గంగ.

"వస్తున్నా" బయట నుంచి అరిచాడు చిన్నా బొంగరం ఆట ఆడుతూ.

"రావద్దుగానీ మిషన్ దగ్గరకెళ్ళి బట్టలు తయారయ్యాయేమో పట్టుకురా'' అంది గంగ.

"అలాగే'' అన్నాడు చిన్నా.

గంగ పెరటిలోకి వెళ్ళి మిషన్‌వైపు చూసింది. మిషన్‌మీద శివ కనిపించలేదు.

"శివ వచ్చాడక్కా'' అన్నాడు చిన్నా శివ చేయిపట్టుకుని లోపలకు వస్తూ.

గంగ వెనక్కి తిరిగి చూసింది.

శివాను చూడగానే విరిసిన గులాబిలా వికసించింది గంగ మొఖం.

శివ కొత్త పైజామా, లాల్చీ కుట్టుకున్నాడు. ఆ బట్ట గంగ పంపించిందే. ఆ సంగతి గంగకు, శివాకే తెలుసు.

''బాగుంది డ్రస్సు'' అన్నట్టు గంగ కింద నుంచి పైదాకా చూసి కళ్ళతోటే మాట్లాడింది.

శివా కళ్ళతోటే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

"పైజామా, లాల్చీ నాకు కుట్టమంటే నువ్వు కుట్టేసుకున్నావా? ఇది నా గుడ్డలాగే వుందిగా" అన్నాడు చిన్నా.

"నీ గుడ్డ అతనికెలా సరిపోతుందిరా అతను నీకంటే పెద్దాడుగా" అంది గంగ.

''లేదు బాబూ...నీది కుట్టి తెచ్చాను. వేసుకు చూడు" అంటూ తన చేతిలోని పేకెట్టు చిన్నాకు అందించాడు శివ.

చిన్నా ఆ పేకెట్టు పట్టుకుని లోపలికి వెళ్ళిపోయాడు.

గంగ, శివ మిగిలిపోయారు.

"మీ జాకెట్టు జాగ్రత్తగా విప్పి చూసుకుని తొడుక్కోండె" అన్నాడు శివ.

"ముళ్ళుంటాయా?" అంది గంగ నవ్వుతూ.

''ముళ్ళే ఉంటాయో, పువ్వులే ఉంటాయో" అన్నాడు శివా నవ్వుతూ. తర్వాత నిలబడకుండా వెళ్ళిపోతుంటే-

''ఈరోజే నే వెడుతున్నా'' అంది గంగ.

వెనక్కితిరిగి ఓసారి చూసి వెళ్ళిపోయాడు.

'కోపం వచ్చిందా?' అనుకుంది తనలోతనే. పొట్లం జాగ్రత్తగా విప్పింది. తను పంపించిన యాభైరూపాయిలనోటు కనిపించింది. నోటుతీసి విప్పింది. అందులో ఉత్తరం. విప్పి చదివింది.

"మీరు డబ్బుగలవారు. అన్నీ డబ్బుతో కొనెయ్యొచ్చనుకోకండి. నేను మీ జాకెట్టు కుట్టింది మామూలు దారంతో కాదు. నా గుండెను దారంగా వడికి కుట్టాను"

'ఛీ...అనవసరంగా డబ్బు పంపించి నొప్పించాను. తెలివితక్కువదాన్ని' అనుకుంటూ కొత్త జాకెట్టు విప్పింది. ఎప్పట్లాగే సంపెంగ పువ్వు జారిపడింది. తీసుకుని తృప్తిగా ఆఘ్రాణించి చెంపల మీద రాసుకుంటూ పెదవులదాకా తెచ్చి ముద్దుపెట్టుకుంది మృదువుగా.

* * *

నరెడ్ల సవారీబండి ఓ పెద్ద మండువా లోగిలిముందు ఆగేసరికి బండోడు కాళ్ళ పడుతున్నాడు భూషణానికి. దుక్కోడు తాడు పేనుతున్నాడు. "ఒరేయ్...గంగ వచ్చింది. ముక్కాలిపీట పట్టుకొచ్చివేయ్" అన్నాడు భూషణం.

దుక్కోడు చటుక్కున చేతిలోపని అలా వదిలేసి లోపలకు వెళ్ళి ముక్కాలు పీట తెచ్చి బండిముందు వేశాడు.

గంగ తెర వత్తిగించి ముక్కాలిపీట మీద అడుగువేసింది.

దుక్కోడు చేతులుకట్టుకుని ముక్కాలు పీటకు కాస్త ఎడంగా నిలబడ్డాడు. గంగ రెండవ కాలు కూడా ముక్కాలు పీటమీద వేసి కిందికి దిగి ఇంట్లోకి నడిచింది.

''ఏమ్మా ... చిన్నాను తీసుకు రాలేదా?'' అన్నాడు భూషణం.

సింహద్వారం దాటబోతుండగా గంగ ఆగి, "వాణ్ని బొమ్మ తనకు తోడుకావాలనిఉంచేసుకుంది మావయ్యా" అంది.

"పట్టుమని పదేళ్ళయినా నిండని కుర్రకుంక అరవైఏళ్ళ ముసలావిడకు తోడేవిటమ్మా'' అన్నాడు భూషణం నవ్వుతూ.

"చిన్నాకదేంలేదు మావయ్యా...తన ఈడు వాళ్ళదగ్గరనుంచి తలనెరసిన వాళ్లదాకా జతచేస్తాడు'' అంది గంగ.

ఇంతలో లోపలనుంచి భూషణం భార్య పూలరథంలా గుమ్మంలోకి వచ్చింది.

"కోడల్ని గుమ్మంలో నిలబెట్టే మాట్లాడిస్తున్నా రేమిటి?" అంది నవ్వుతూ.

''లోపలకి ఆహ్వానించడానికి అత్తగారు రావడం ఆలస్యం చేసిందని" అని చురకవేశాడు భూషణం.

"మా మావయ్య సమితి ప్రెసిడెంట్. మాటల్లో మా మావయ్యను ఓడించ లేవత్తయ్యా నువ్వు" అంది గంగ.

''నిజమేనమ్మా...మాటల్తోనే ఓట్లు సంపాదించుకునేవాణ్ని మాటల్తో ఎవరు గెలవగలరు? సరేగానీ నువ్వు లోపలకురా" గంగను వెంటబెట్టుకుని లోపలకు తీసుకెళ్ళింది.

వాళ్ల వెనకే దుక్కోడు బండిలో ఉన్న గంగ సూట్‌కేస్, ఇతర సామాన్లు లోపలకు మోసుకెళ్లాడు.

వీధివాకిట్లో కొండ బండిదిగి కాడి కిందున్న ఎడ్లను విప్పేసి కాడి దించి పగ్గాలు ఉసికర్రకు కట్టాడు. తొట్టెలో ఉన్న గడ్డి ఎడ్లముందు వేశాడు.

''అలా పెరటివైపు వెళ్లి కాళ్లు చేతులు కడుక్కోరా కొండా! అమ్మగారు భోజనం వడ్డిస్తారు" అన్నాడు భూషణం.

"చిత్తం బాబు" అని కొండ పెరటి గుమ్మంలోంచి లోపలికెళ్లాడు.

గంగ, ధనమ్మ గదిలో పందిరి పట్టె మంచంమీద కూర్చున్నారు.

''ఇంత అందమైన కోడల్ని పరాయి ఇంటికోడలుగా చేయడానికి మనసొప్పడం లేదు" అంది ధనమ్మ.

"నా కోసం ఒక్క బావను కంటా వేమోనని పదహారేళ్లబట్టి వెయ్యికళ్ళతో ఎదురుచూస్తున్నాను. పాపం...నీకు చేత కాలేదు" అంది గంగ నవ్వుతూ.

"నాకు చేతకాలేదనకపోతే మీ మావయ్యకు చేతకాలేదని అనొచ్చుగా" అంది కొంటెగా ధనమ్మ.

"ఏమిటీ...మా మావయ్య చేతకాని వాడంటావా! ఉండు చెప్తాను... మావయ్యా..." అని అరవబోయింది గంగ.

ధనమ్మ గంగ పిలుపు బయటకు వినబడకుండా నోరు మూసేసింది.

"నా తల్లి వికదూ...నేనన్న మాటలు ఆయనతో అనకు. చేతనవునో చేతకాదో ఇప్పుడే చూపిస్తానని మరొక రైను కట్టుకుని నాకు సవతిపోరు తెచ్చి నెత్తిన పెట్టగలరు మీ మావయ్య" అంది ధనమ్మ.

"అలారా దారికి" అంది గంగ నవ్వుతూ.

ఇంతలో గది గుమ్మం దగ్గర నిలబడి, "అమ్మాయిగారి పెట్టె ఏ గదిలో పెట్టను అమ్మగారూ" అని అడిగాడు దుక్కోడు.

ధనమ్మ బదులుచెప్పే లోపలే గంగ దుక్కోణ్ని లోపలకు పిలిచింది. పెట్టెతో సహా దుక్కోడు లోపలకొచ్చి నిలబడ్డాడు.

''ఏరా... నువ్వు మా ఊరు వచ్చి నప్పుడు ఏం చేశావు?" గంగ అడిగింది కాస్త కోపంగా.

''నేనేం చేశానంటే! నేనేం చేయలేదం డమ్మగారూ" అన్నాడు భయపడుతూ దుక్కోడు.





"ఏం చేయలేదా?''

''చేయలేదండి...!"

"ఫోంచేయలేదూ...''

"చేశానండీ...!''

"బట్టలమూట నెత్తినపెట్టుకొస్తున్న మా చుక్కని చూడలేదూ!"

"చూసానండీ''

"దాన్ని చూస్తూ మీసాలు మెలిపెడుతూ నవ్వలేదూ...?''

"అయ్యబాబోయ్ అంతదూరం వెళ్ళలేదండి" అన్నాడు దుక్కోడుభయంగా.

"ఆగు... నీ సంగతి మా మావయ్యకు చెప్తాను" అని భయపెట్టింది గంగ.

"వద్దండమ్మాయిగారూ! మీకు దణ్ణమెడతాను. మావయ్యగోరితో చెప్తే తోలువలిచేత్తారు. ఈఒక్కతప్పుకాయండి" అంటూ బతిమాలాడు దుక్కోడు.

"నీకు పెళ్ళయిందా ?" గంగ అడిగింది.

"అయిందండీ" అన్నాడు.

"పెళ్ళయినవాడికివేం బుద్ధులు!"

"అవ్వలేదండి. అత్తయ్యగార్ని అడగండి కావాలంటే"

"వీడికి పిల్లనెవరిస్తారమ్మాయి!ఆయన చుట్టూ తిరగడం తప్ప ఈ వెధవకి పనాపాటా" అంది ధనమ్మ.

"మరయితే మా చుక్కని చేసుకుంటావా?" అంది గంగ.

'చేసుకుంటానంటే ఏం గొడవో, చేసుకోనంటే ఏం గొడవో' తనలోనే గొణుక్కున్నాడు దుక్కోడు.

"ఏం... మాట్లాడవేం?" గంగ రెట్టించింది.

"తమరిష్టమండీ"

"పెళ్ళాడేది నేనా నువ్వా?"

''ఆఁఆఁ... నేనేనండి!''

''మరి"

"మీరు చేసుకోమంటే చేసుకుంటానండి... వద్దంటే మానేతానండి''

"కట్నాలు కానుకలేమైనాకావాలా?"

''ఏవీ వద్దండి ! ఈ యిషయాలన్నీ అయ్యగారి చెవినేయకండి"

''సరే...వెళ్ళు''

దుక్కోడు బయటికెళ్ళిపోయాడు.

"అన్నీ మేనమామ పోలికలే కోడలా నీవి! ఆయనా నీలాగే పనివాళ్ళని అదమాయిస్తాడు" అంటూ ధనమ్మ గంగ బుగ్గ గిల్లింది ముద్దుగా.

"అత్తయ్యా అత్తయ్యా... నేను మావయ్యనుకాదు గంగను'' అంది నవ్వుతూ.

* * *

భూషణం, ధనమ్మ కూడా గంగను ఎంతో అల్లారుముద్దుగా చూసుకుంటున్నారు. వారికి పిల్లలు లేకపోవటం చేత గంగను, చిన్నాను తమ పిల్లలుగానే భావిస్తారు. పైగా ఇద్దరూ స్వంత అక్కబిడ్డలే కావడంచేతా, అన్నిటికీమించి గంగ కలుపుగోలుతనంవల్లా, చిన్నా కూడా తన తెలివైన మాటల్తో మనుషుల్నే కాకుండా మనసుల్ని కూడా ఆకట్టుకోవడంచేతా, ఆ ఇంట్లో గంగ, చిన్నా పరాయివాళ్ళుగా అనిపించరు.

ధనమ్మ గంగ, చిన్నా ఎప్పుడూ తమ ఇంట్లోనే ఉండిపోతే బాగుండును అనుకుంటుంది. ఆ విషయం ఒకటిరెండుసార్లు భర్తతో కూడా చర్చించింది.

"నీకు మతిగానీ పోయిందా! అక్కపోయింతర్వాత బావగారు బతుకుతున్నదే వాళ్ళిద్దర్నీ చూసుకుని. నీదగ్గర ఉంచుకుంటానంటేఆయనొప్పుకోవద్దూ?" అన్నాడు భూషణం.



"నాకూ కాస్త తోడుగా ఉంటారని అన్నాను" అంది ధనమ్మ.

"సరేలే...వస్తూపోతూవుంటారు ఇద్దరు పిల్లలూనూ. నీకెప్పటికీ తోడుగా ఉండాలంటే ఒక కుక్కపిల్లనో, పిట్టనో పెంచుకో" అన్నాడు భూషణం.

భూషణం, ధనమ్మ ఆ పిల్లలిద్దరి గురించి చాలాసార్లు చర్చించుకున్నారు. వాళ్ళిద్దరు తల్లిలేని పిల్లలనేలోటువాళ్ళకు కనబడనీయకుండా చూసుకోవాలనివారి తాపత్రయం.

గంగ ధనమ్మను 'అత్తయ్య' అని

పిలిచినా, ధనమ్మ గంగపట్ల తల్లిలాగే ప్రవర్తిస్తుంది. తల్లి చూపే ప్రేమని చూపుతుంది. మేనమామ భార్య చూపవల్సిన స్నేహాన్ని, చనువుని కూడా గంగకు అందజేస్తుంది. ఈసారి చిన్నా రాలేదని చాలాసార్లు అనుకున్నారుకూడా! గంగ వచ్చిననాటినుంచి ధనమ్మ గంగకు నచ్చిన పిండివంటలు చేసి పెడుతూనే



ఉంది. ఇంక రెండుమూడు రోజుల్లో వెళ్ళిపోతుందనగా పక్కటౌన్‌కు తీసుకెళ్ళి గంగకు రకరకాల లంగా బట్టలు, ఓణీలు జాకెట్టు బట్టలు కొనిపెట్టింది ధనమ్మ.

టౌన్‌నుంచి తిరిగి వచ్చిం తర్వాత "టైలర్‌ను పిలిపిస్తాను. ఇక్కడే కుట్టించేసుకో" అంది ధనమ్మ గంగతో.

టైలర్ పేరు ఎత్తగానే గంగ మనస్సు రెక్కలు విప్పుకుని శివ దగ్గరకు ఎగిరి పోయింది. శివ ధ్యానంలో గంగ కొద్ది క్షణాలపాటు తనను తానే మరిచిపోయింది.

"ఏవిటి ... మాట్లాడవేం అమ్మాయి! టైలర్ని పిలిపించనా వద్దా?'' అంటూ పరధ్యానంలో ఉన్న గంగను భుజంమీద తట్టి అడిగింది ధనమ్మ.

గంగ మొఖంలో సిగ్గులు తొణికిసలాడాయి.

"ఇక్కడొద్దులే అత్తా.... మా వూళ్లో కుట్టించుకుంటాను" అంది గంగ.

"మీది మరీ పల్లెటూరు కదమ్మా! అక్కడంత మంచి టైలర్స్ ఉన్నారా?" అంది ధనమ్మ.

"మా టైలర్ బాగా కుడతాడు. మా ఊళ్లో కుట్టించుకుంటాను" అంది గంగ.

ఆ సాయంత్రం ధనమ్మ, గంగ వేణుగోపాలస్వామి ఆలయానికి వెళ్లారు. ఆలయ పూజారి రామాచారి ధనమ్మను, గంగను సాదరంగా ఆలయంలోకి ఆహ్వానించాడు. ఆ ఊరి పురోహితుడు కూడా అతడే. అందుకే భూషణంగారి యోగ క్షేమాలడిగిన తర్వాత ''చిన్నా రాలేదామ్మా?" అంటూ చిన్నా గురించి కూడా అడిగాడు.

"లేదండీ" అంది గంగ. ''గంగ పేరుమీద, చిన్నా పేరుమీద అర్చన





చేయించాలని వచ్చాం రామాచారిగారూ'' అంది ధనమ్మ.

''అలాగేనమ్మా" అన్నాడు రామాచారి.

"వేణుగోపాలస్వామికే కాకుండా రుక్మిణీదేవికూడా మా గంగ పేరుమీద అర్చన చేయించాలి రామాచారిగారూ" అంది ధనమ్మ.

"తప్పకుండానమ్మా! పెళ్ళీడుకొచ్చిన కన్నె పిల్లలు తప్పకుండా రుక్మిణీదేవికి అర్చన చేయించాలి. అలా చేయిస్తే తగినవాడు, మనసుకు నచ్చినవాడు భర్త అవుతాడని స్థల పురాణం చాటుతోంది'' అన్నాడు రామాచారి.

"నిజంగానాండీ?" అంది గంగ ఎంతో ఆత్రంగా.

"ఏమ్మా ... మనసుకు నచ్చినవాళ్లెవరైనా దొరికారా?" అన్నాడు రామాచారి.

"ఛీ .... పొండి తాతయ్యగారూ'' అంది సిగ్గుపడుతూ గంగ.

"ఎందుకమ్మా అంత సిగ్గు. రుక్మిణీదేవి చూడు - నచ్చినవాడికి కబురంపి పిలిపించుకుని వెంట వెళ్ళిపోయింది" అంది ధనమ్మ.

''వారు దైవాలమ్మా! ఏంచేసినా అది లోక కల్యాణం కోసమే" అని రామాచారి అర్చన ప్రారంభించాడు.

ఆలయంనుంచి అర్చన పూర్తిచేసుకుని గంగ, ధనమ్మ ఇంటికొచ్చేశారు. ఆ మర్నాడే గంగ ప్రయాణం. కొత్త బట్టలు కొనుక్కున్న తర్వాత ఎప్పుడు తన ఊరు వెళ్ళి ఒకసారి శివాను కళ్లారా చూసి, శివా పాటలు చెవులారా విని ఆ కొత్త బట్టలు శివా మిషన్ దగ్గరకు చిన్నా చేత పంపించాలా అని గంగ తహతహలాడుతోంది. ధనమ్మ ఇంత తొందరగా వెళ్ళకుండా గంగ ఇంకో పదిరోజులుంటే

బాగుండును అని అనుకుంది.

దుక్కోడు, గంగ త్వరగా వెళ్ళి చుక్కతో తన పెళ్ళి నిర్ధారణ చేసేస్తే బాగుండును అని గంగ కనిపించినప్పుడల్లా అనుకుంటూనే ఉన్నాడు.

చివరికి గంగను తీసుకువెళ్ళి ఊళ్లో దిగబెట్టవలసిన బాధ్యత దుక్కోడిమీదే పడింది. వాడు బండి తోలుతున్నంతసేపూ గంగతో చుక్క పట్ల తను పెంచుకున్న ప్రేమను ఎలా చెప్పాలో తెలియక తికమకపడుతూనే ఉన్నాడు. ఇంతలో ఏదో గుర్తుకు వచ్చి ఫక్కున నవ్వింది గంగ.

గంగ ఎందుకు నవ్విందో అర్థంగాక అసలది గంగ నవ్వు అవునోకాదో అనుకుని దుక్కోడు భయపడ్డాడు.

"భయమేత్తే ఆంజనేయ దండకం సదువుకోండమ్మాయిగోరూ'' అన్నాడు వాడు.

''నాకేం భయంలేదు. కావలిస్తే నువ్వు చదువుకో" అంది గంగ.

''నాకు భయమేత్తుందండీ...కానీ ఆ దండకం నాకు రాదండీ. మీరు చదివి పెట్టండమ్మాయిగోరూ..." బతిమాలుతున్నట్టు అడిగాడు దుక్కోడు.

''ఒరే! నువ్వింత పిరికివాడవని తెలిస్తే నువ్వు కాకులపేరు పెడ్తానన్నా మా చుక్క నిన్ను కన్నెత్తి కూడా చూడదు" అంది గంగ కొంటెగా.

''నాకేం భయమండి అమ్మాయిగోరూ! దయ్యాలంటే నాకసలు భయంలేదండీ. ఆటి పని అయి చేసుకుంటాయి మన పని మనం చేసుకుంటామండి. మనం ఆటికి దొరుకుతామేటండీ?" అంటూ ఎడ్లను అదిలించి పరుగెత్తించాడు దుక్కోడు.

చీకటి పడుతూన్నవేళకు గంగ ఇల్లు చేరింది. ఇంట్లోకి రావడంతోటే బామ్మ ఏవో ప్రశ్నలు వేస్తున్నా పొడి మాటల్లో సమాధానం చెప్తూ పెరటివైపు వరండాలోకి వచ్చి కాళ్లు కడుక్కుంది.

ఎదురింటి అరుగుమీద శివ ఉన్నాడేమోనని కళ్లు అలిసిపోయేదాకా వెతికింది. ఎవరూలేరు. "చీకటి పడింటిగా మిషన్ కట్టేసాడేమో'' అనుకుంది గంగ.



## 5

గంగ మేనమామగారి ఇల్లు చేరిన మరుసటి రోజున శివ తన మిషన్‌మీద కూర్చుని ఏవో తీయని స్మృతులలో తేలిపోతున్నాడు. గంగతో గడిపిన తీయని క్షణాలను పదే పదే జ్ఞాపకం తెచ్చుకుంటూ తన లోకంలో తను విహరిస్తున్నాడు. తనలో తనే నవ్వుకుంటూ తనకే వినిపించేలా పాడుకున్నాడు. గంగతో మాట్లాడుతున్నట్లే తన గుండెలో గూడు కట్టుకున్న గంగతో ఊసులాడాడు. పక్కనే అరుగుమీద వున్న స్నేహితుల సంగతి, వాళ్ళ ఉనికి కూడాపట్టలేదు.

సుబ్బారావు, కిట్టప్ప పాడమనేవారు. శివ నవ్వి ఊరుకునేవాడు. సుబ్బారావు హార్మోనియంమీద ఒక పద్యం అనడానికి పీలుగా అందించేవాడు. శివ హమ్ చేసి తనలో తానే నవ్వుకుని మిషన్ తొక్కడంలో నిమగ్నుడయ్యేవాడు.

ఒకటి రెండు రోజులు అలా గడిచాక

తెల్లవారి లేచి మిషన్‌మీద కూర్చునేసరికి ఎదురింటి వరండాలో గంగ సుందర రూపం కనిపించకపోవడంతో వంటరి తనాన్ని అనుభవిస్తూ దిగులుపడిపోయే వాడు. మండుటెండలో నీటికి నోచుకోని మొక్కలా వాడిపోసాగాడు.

అలా గంగ నిరీక్షణలో తన చుట్టూ ఉన్న పరిసరాలను కూడా మర్చిపోయే టంతటి తపస్విగా మారిపోయాడు శివా. ఆ మూగ ఆరాధనలో, వంటరి ఆవేదనలో గంగ తనలోనే ఉన్నట్లనిపించేది శివకు. చేతికి అందక కంటిముందు కనిపించక కన్నుమూస్తే కనిపించి, కన్ను తెరిస్తే కరిగిపోయే గంగ రూపాన్ని కళ్ళ ముందు ప్రత్యక్షంగా సాక్షాత్కరింప చేసుకోవాలన్న ఆరాటం శివ మనస్సును ఆవహించింది. ఆమె రాకకోసం వేయి కళ్ళతో ఎదురుచూసాడు. ఎక్కడ సవారీ బండి అగుపించినా, ఎడ్ల మువ్వల సవ్వడి వినిపించినా గంగ వచ్చేసిందని ఎగిరి గంతేసేవాడు. వచ్చింది గంగ కాదని తెలిసాక కుంగిపోయేవాడు.

కొన్ని రోజులు గడిచాక బండి రాక పోయినా, నిజంగా మువ్వల చప్పుడు లేక పోయినా శివాకు ఆ శబ్దాలే వినిపించేవి. ఎగిరి గంతేసేవాడు. మళ్ళీ ఆ ఊహ లోంచి జారిపడి వాస్తవం తగిలేసరికి కల కరిగిపోయి విలవిల్లాడేవాడు.

గంగ అతని గుండెలపై, అతనిలోని అణువణువున ఏదో చిత్రమైన ముద్ర వేసింది. అది ప్రేమో, భక్తో, నిరీక్షణో, తపస్సో, ధ్యానమో, తన్మయత్వమో, తాదాత్మ్యమో అతనికి తెలియదు. అతని ఆలోచనలు, జ్ఞాపకాలు అన్నీ గంగ చుట్టూనే.

నెలరోజుల వంటరితనం శివాను వాడిన తోటకూర కాడలా చేసింది. ఇంక ఉండబట్టలేక గంగ వున్న ఊరికి బయల్దేరాలని అనుకున్నాడు.

శివ అలా అయిపోవడం చూసి తల్లి శాంతమ్మ భోంచేసేటప్పుడు, ఫలహారం తినేటప్పుడు, పడుకోబోయేముందు "ఏం బాబూ...అలా ఉంటున్నావ్"అని గుచ్చి గుచ్చి అడిగేది. శివ నవ్వి, ''ఏంలేదమ్మా'' అని బదులు చెప్పి వత్తిగిలిపడుకునే వాడు.

ఒక నిమిషం పక్కలో కూర్చుని తలా, వొళ్లు నిమిరి" రేపు రక్షరేకయినా కట్టిస్తాను'' అనేది శాంతమ్మ.

తాను గంగవున్న ఊరికి బయల్దేర్దాం అనుకున్న రోజున ఉదయాన్నే లేచాడు శివ. పట్నం వెళ్ళి దారబ్బంతులు, ఇతర వస్తువులు కొనుక్కురావాలని తల్లితో చెప్పాడు.

''పరగడుపున ప్రయాణం చేయ కూడదు బాబూ! రెండు ముద్దలు తిని బయల్దేరు. పొద్దున్నే వంట చేసేస్తాను" అంది శాంతమ్మ.

'సరేనన్నాడు' శివ.

తల్లి వంటపూర్తయ్యేలోపున ఒకసారి అరుగుమీద కొచ్చాడు శివ. అనుకోకుండా ఎదురింటి పెరటి వరండావైపు చూశాడు. తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు.

ఎదురుగా గంగ.

కాలివేళ్ళమీద లేచి తనకోసం వేయి కళ్ళతో వెతుకుతోంది.

గంగ కనిపించగానే శివ గంగ చూపుల వరదలో తడిసి తబ్బిబ్బయ్యాడు.

శివాను చూసిన గంగ వుప్పొంగి శివుడి నెత్తిన దూకబోయేటంత వుత్సా




హంతో నవ్వుతూ ఎవరైనా చూస్తారన్న భయంకూడా లేకుండా చేయి వూపింది.

బదులుగా శివా కూడా చేయివూపాడు.

వాళ్ళిద్దరికీ మధ్య ఒక వీధి, వీధిలోని ఇళ్లు, ఇళ్ళల్లో జనం, వాళ్లింటి గోడలు అన్నింటికీమించి అంతస్థుల అడ్డుగోడలు వున్నాయిగానీ, అవే లేకపోతే ఆవేశంతో ఇద్దరూ ఎదురెదురుగా పరుగెత్తుకొచ్చి ఏకమైపోయేవారే!

"అమ్మా...నేను పట్నానికి పోవడం లేదు" అని ఇంట్లో వున్న తల్లికి వినిపించేలా అరిచాడు శివ.

ఆ అరుపు గంగ చెవిన కూడా పడి మనసారా నవ్వుకుంది.

శివ మరబొమ్మలా లోపలనుంచి మిషన్ తెచ్చి అరుగుమీద పెట్టాడు. మిగిలిన సామాగ్రిని కూడా లోపలనుంచి తెచ్చుకుని మిషన్‌మీద కూర్చున్నాడు. వేసవి వడగాల్పులలో వసివాడిన తర్వాత తొలిజల్లులు అనుభవిస్తున్న మల్లెపందిరిలా శివ మిషన్ తొక్కుతూ పాట మొదలెట్టాడు.

ఎదురింటి వరండాలో గంగ బొమ్మలా నిలబడిపోయింది. వెనక వీధి గుమ్మంలో శివ వెనక శాంతమ్మ శివుడి ఆనందాన్ని చూస్తూ, ఎదురింటి వరండాలో గంగని చూస్తూ భయంభయంగా వుండిపోయింది.

* * *

"ఎప్పుడొచ్చారండి అమ్మాయిగారూ" అంటూ చుక్క గంగను పలకరించింది ఇంట్లోకి వచ్చి.

"నిన్న రాత్రి వచ్చానే" అంది గంగ నవ్వుతూ.

"అయ్యబాబోయ్! మీరెళ్ళిన వారం తర్వాతనుంచి చిన్నమ్మాయిగారు ఎప్పుడొస్తారండీ అని రోజూ వచ్చి నాయనమ్మగార్ని అడుగుతూనే వున్నాను. ఆవిడ గోరికి వినబడి వినబడక ఏదో చెప్పేవారు. ఇల్లంతా ఎతుక్కుని వీధిలో చినబాబు అగపడితే పలకరించి వెళ్ళిపోయేదాన్ని. ఈయాలపొద్దున్న ఎడమకన్ను అదిరింది. కాకి అరిచింది. మీరొత్తారనుకున్నాను... వచ్చేసారు" అంది చుక్క.

చుక్క గంగ రాక కోసమే వేయి కళ్లతో ఎదురుచూస్తోంది. అది దుక్కోడి వివరాలు తెస్తుంది అని చుక్క ఆశ. అందుకే ఆమె రాకకోసం వెన్నెలకోసం ఎదురుచూసే చకోరంలా నిరీక్షిస్తోంది చుక్క. గంగ నోటినుంచి తాను ఎదురుచూసే వార్త వినాలని చుక్క ఆరాటం.

"ఓసి పిచ్చి మొహమా! వచ్చేదానవు కాస్త పెందలాడే వస్తే వాణ్ని చూసుకుని వెళ్ళేదానవుగా" అంది గంగ చుక్కను పూరిస్తూ.

"ఎవర్నండి అమ్మాయిగోరూ?" అంది చుక్క ఒంటినిండా చెవులు చేసుకుని.

"అదేనే...మా మావయ్యగారి ఊరు నుంచి ఆ దుక్కోడేగదా నన్ను బండిమీద ఇక్కడకు తీసుకొచ్చింది" అంది గంగ.

"వచ్చాడాండీ"

"ఆఁ! గంట క్రితమే బండి తోలుకెళ్లాడు. అన్నీ అడిగా...పెళ్ళి కాలేదట. నువ్వు అంటే..."

గంగ మాట పూర్తికాకుండానే, "ఇట్టమేనాండీ" అంది చుక్క పట్టరాని ఉత్సాహంతో.

గంగ తల వూపింది.

"బండి ఇంకా పొలిమేరదాటి వుండదండి" అంటూ లేచి పరుగెత్తింది చుక్క.

* * *

చిన్నా కొత్త బట్టల మూటను చంక నెట్టుకుని ఒక్క పరుగులో శివ మిషన్ ముందుకొచ్చి నిలబడ్డాడు. ఆయాస పడుతూ ఆ మూట శివా ముందు పెట్టాడు.

"ఏమిటి బాబూ... ఇంత మూట తెచ్చావ్!" అన్నాడు శివ మూటను తీసి పక్కనవున్న పెట్టె మీద పెడుతూ.

"అలా పక్కన పెట్టేస్తావేంటి? అవన్నీ కొత్తబట్టలు. మా అక్క మా మామయ్యగారింటికెళ్ళొచ్చిందిగా! మా అత్తయ్య కొని పెట్టింది. అలా ఏదో మూల పడేస్తే ఎలుకలు కొట్టేస్తాయి" అన్నాడు చిన్నా.

"ఇప్పుడిది విప్పితే ఈగలు మూగుతాయి చిన్నా" అన్నాడు శివ-పక్క అరుగుమీదున్న స్నేహితుల్ని ఉద్దేశించి.

"ఈగలు మూగితే ఫరవాలేదు. తోలేస్తే పోతాయి. ఎలుకలు కొట్టేస్తే మరి బట్ట కన్నాలు పడిపోతుంది. పనికిరాదు" అన్నాడు చిన్నా.

"నేచూసుకుంటాలే చిన్నా"

"ఏం చూసుకుంటావో ఏమో... నాలుగు లంగాలు, నాలుగు జాకెట్లూను. ఎలా కావాలో ఏమిటో రాసి పెట్టి వుంది"

"సరేలే చిన్నా" అన్నాడు శివ.

చిన్నా వెళ్ళిపోయాడు. నెమ్మదిగా శివ దగ్గరకొచ్చాడు కిట్టప్ప.

"ఆ రాసిపెట్టిందేమిటో మూట విప్పి చూడరాదూ" అన్నాడు

"ఒరేయ్... నాకు తిక్క రేగితే మంచోణ్ణికాదు. వెళ్ళి కూర్చో అరుగు మీద" చిరాకుపడ్డాడు శివ.

"ఏమి రాసిందో చూడాలని కాదురా, ఏదో కుతూహలం! స్వీట్లు, హాట్లు ఏమైనా వున్నాయేమోనని" అన్నాడు సుబ్బారావు నవ్వుతూ.

"సర్లే ఆ మూట సంగతి మరచిపోయి మీ పని మీద మీరుండండి"

"మాకేం పన్లేదుగా"

"పనిలేకపోతే పని చూసుకునేందుకు వెళ్ళండి. హాట్లు, స్వీట్లు అంటే హాట్ హాట్‌గా ఒక్కొక్కటి ఇవ్వాల్సి వస్తుంది" అని అంటూ మూట లోపలికి పట్టుకుపోయాడు శివ.

అప్పటిదాకా నిశ్శబ్దంగా కూర్చున్న అబద్ధం, "ఛ... ఒక్క గరల్ ఫ్రెండ్ తగలగానే నలుగురు బాయ్ ఫ్రెండ్స్‌మీ ఎంత చులకనయిపోయామురా" అన్నాడు.

"అది వయసు నైజమురా నాయనా!" అని సుబ్బారావ్ హార్మోనియం మీద ఏదో పద్యం వెతుక్కోబోయాడు. అదే సమయానికిఆ వీధిన విరిగిపోయిన చేతిని ఊపుకుంటూ పోలిగాడు వచ్చాడు. వాడటు వెళ్ళగానే ఎదురునించి దొరయ్య ఎక్కిన గుర్రం వచ్చింది. దాంతో హార్మోనియం, ఆ నలుగురి నోళ్లు కూడా మూతపడిపోయాయి. గుర్రపుడెక్కల చప్పుడు దూరమయిపోయేదాకా వాళ్ల నోరు తెరవనేలేదు.

లోపలికి వెళ్ళిన శివ మూట విప్పాడు. పైన ఒక వుత్తరం వుంది.

"శివా... నిన్ను చూసి నెలరోజులైంది. మామయ్యగారింటినుంచి తెచ్చిన పూతరేకులు, కజ్జికాయలు, సున్నుండలు నీ కోసం పంపుతున్నాను. త్వరలోనే కలవాలని ఎదురుచూస్తూ"-గంగ.

ఒక్కసారి వుత్తరాన్ని ముద్దుపెట్టుకుని పక్కన పెట్టి తల్లిని పిల్చి స్వీట్స్




ఇచ్చాడు.

"ఎక్కడివిరా?" అంది శాంతమ్మ.

"పెద్దింటినుంచి వచ్చాయి"

"ఎవరు తెచ్చారు!"

"చిన్నా...!"

"వాళ్ళ పెద్దవాళ్లకు తెలుసా?"

"పెద్దవాళ్లే పంపారట. పెద్దవాళ్లు పంపకుండా చిన్నా ఇన్ని స్వీట్స్ ఎలా తేగలడు" అన్నాడు తల్లి వంక చూస్తూ శివ.

తర్వాత ఆ స్వీట్స్‌లోంచి నాలుగు స్వీట్స్ తెచ్చి స్నేహితులకిచ్చాడు.

"నే చెప్పలే... శివ మంచివాడు" అన్నాడు సుబ్బారావ్.

"ఉపన్యాసాలు మానేసి త్వరగా తినేసి వెళ్లిపొండి" అన్నాడు శివ.

"ఏదైనా ప్రోగ్రాం వుందా బ్రదర్?" అడిగాడు కిట్టప్ప

శివ సీరియస్‌గా చూశాడు కిట్టప్పని.

సుబ్బారావ్ సున్నుండలో సగం ముక్క కిట్టప్ప నోట్లో కుక్కేసి-

"ప్రశ్నలు వేయకుండా నమిలి మింగేయి" అన్నాడు.

మరి కాసేపట్లో స్నేహితులు వెళ్ళిపోయారు. మిషన్ కట్టేసుకున్నాడు శివ. లోపల శాంతమ్మ ఇల్లు ఊడుస్తోంది. ఓపిరికి గంగ పంపిన ఉత్తరం తగిలింది. శాంతమ్మ తీసుకుంది. అది చిత్తుకాగితమో గుడ్డముక్కో అయితే శాంతమ్మ పట్టించుకునేది కాదు.

అది అందమైన తెల్లకాగితం కావడం చేత చేతిలోకి తీసుకుంది. బయటకు పట్టుకెళ్ళి దీపం దగ్గర విప్పి చదివింది. చదువుతోంటేనే ఆమె చేతులు వణికాయి. "శివా" అని గట్టిగా అరవాలనుకుంది. అరవలేక వణుకుతున్న పెదవులను దగ్గరకు చేర్చి నోరు మూసుకుని కన్నీరు కార్చింది. నిశ్శబ్దంగా ఏడ్చింది. మౌనంగా బాధపడింది.

"అమ్మా...అన్నం పెట్టు" అంటూ లోపలకొచ్చాడు శివా.

నీళ్ళు నిండిన కళ్లతో నిప్పులు కురిపిస్తూ శివా వైపు తిరిగింది శాంతమ్మ. ఏ చేతితో తన కన్నకొడుక్కి గోరుముద్దలు తినిపించిందో ఆ చేతితోనే చెంప చెళ్ళుమనిపించింది.

"అమ్మా" అన్నాడు శివ.

శాంతమ్మ ఆగలేదు. తన కోపాన్ని, దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. కన్న కడుపు తీపిని చంపుకోలేకపోయింది.

"నేను అమ్మనేరా...నీ అమ్మనేరా" అంటూ నాలుగైదు దెబ్బలుకొట్టింది. "అందుకే నిన్ను ఏ చేతుల్తో పెంచి పెద్ద చేశానో, ఏ చేతుల్తో నీ ఒళ్ళంతా నిమిరి ముద్దాడి మురిసిపోయానో, ఏ చేతులు నీ నెత్తిన పెట్టి నువ్వు నూరేళ్ళూ చల్లగా ఉండాలని దీవించానో, మీ నాన్న పోయిన తర్వాత ఈ చేతికి నువ్వు అందొచ్చి, ఆసరాగా ఉండాలని ఆశ పడ్డానో, ఆ చేతుల్తోనే నా శక్తినంతా కూడదీసుకుని, నా గుండెను రాయి చేసుకుని కొట్టానురా... ఇది నా బాధ్యతరా" అంది ఏడుస్తూ!

"అమ్మా! ఏమిటమ్మా...ఏమయింది! ఎప్పుడులేంది ఎందుకిలా కొట్టావున్నన్ను?" అన్నాడు శివ.

"ఈ ఉత్తరమేమిటిరా...?" సూటిగా శివా కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించింది శాంతమ్మ.

"గంగ రాసిందమ్మా" చాలా అమాయకంగా చెప్పాడు శివ సమాధానం.

"నాకెప్పుడూ ఈ విషయమెందుకు

చెప్పలేదు? నా దగ్గర కూడా నీకు రహస్యమేనట్రా'' అంది శాంతమ్మ.

"రహస్యమనుకుంటే ఈ ఉత్తరం నీకెందుకు దొరుకుతుందమ్మా! ఇది నీకు చెప్పాల్సినంత విషయ మనుకోలేదు'' అన్నాడు శివ.

"పిచ్చి నాయనా... నిప్పు కాలు



తుందని తెలియని పసితనంలోనే ఉన్నావురా ఇంకాను. నీకు ఎలా చెప్పాలో తెలియడంలేదు. పాము వెండిలా మెరుస్తోందికదాని మెడలో వేసుకుంటే కాటు వేస్తే పోయేది ఎవర్రా? మెడలో వేసు



కున్నవాడే కానీ పాము కాదురా పోయేది. ఒక్క పరమశివుడికేరా పాముని మెడలో వేసుకునే అర్హత! గంగ ఎక్కడ...నువ్వెక్కడ. నువ్వు నెత్తిన పెట్టుకుని ఊరేగుదామనుకున్నా అంతస్థులు అడ్డొస్తాయి నాన్నా. నువ్వు కన్నెత్తి ఆ పిల్లను చూసినట్టు తెలిస్తే ఆ దొరయ్య నిన్ను బతకనివ్వడురా నాన్నా! మీ నాన్న పోయిననాటినుంచి నిన్ను చూసుకునే బతికేనురా. భర్త లేని దాన్ని నన్ను కొడుకు కూడా లేని

దాన్నిగా చేయకురా! నువ్వు సుఖపడటం ఇష్టంలేక కాదురా నేనిలా చెప్పటం! నిన్ను దక్కించుకోవాలని తల్లి ప్రాణం పడే ఆవేదనరా ఇది'' అంటూ శివాను కౌగిలించుకుంది వెక్కి వెక్కి ఏడుస్తూ.

శివా ఆలోచనలో పడ్డాడు.

ప్రేమగా కొడుకు చెంపలు నిమిరింది శాంతమ్మ.



6

రెండు రోజుల్లో గంగ పంపించిన బట్టలు కుట్టేసాడు శివ. ఆ రెండు రోజులూ శివ ఎప్పటి శివాలా లేడు. పక్క అరుగుమీద ఉండే స్నేహితులు పలకరించినా పొడి మాటల్లో సమాధానం చెప్పేవాడు. గళం విప్పి పాడలేదు. మూర్తీభవించిన నిశ్శబ్దంలా, జీవంలేని మరలా తన పని తను చేసుకుపోయాడు. ఎదిరింటి వరండావైపు కన్నెత్తి చూడలేదు. గంగ కోసం వెతకలేదు. గంగ రూపం అప్పుడప్పుడూ మనసులో కదలాడుతున్నా ఆ బొమ్మపై అమ్మ కార్చిన కన్నీళ్లు చూసి చెరిగిపోతోంది. అటు గంగను ఇటు అమ్మ కన్నీటిని మరువలేక మరపురాక సతమతమవుతున్నాడు శివ. ఆ స్థితిలోనే యాంత్రికంగా గంగ బట్టలు కుట్టడం పూర్తి చేసాడు. నాలుగు లంగాలు, వాటిపై జాకెట్లు మడత పెట్టి మూటకట్టాడు. ఒక పేపర్‌లో చుట్టాడు. వంటపని చేసుకుంటున్న శాంతమ్మ దగ్గరకు వెళ్ళి "అమ్మా... బట్టలిచ్చేసి వస్తాను" అన్నాడు శివ.

"అలాగే...బాబూ" అంది శాంతమ్మ. వెంటనే, ''ఎవరి బట్టలవి?'' అంది మళ్ళీ.

"పెద్దింటివారిని" ముక్తసరిగా బదులు చెప్పాడు శివ.

"పెద్దింట్లోనే ఎవరివి అని?"

''చిన్నమ్మాయిగారివి'' అన్నాడు శివ తల వంచుకుని.

చేతిలోని పని అలా వదిలేసి కొంగుతో చెయ్యి తుడుచుకుని, ''ఆ బట్టలు నాకివ్వు.. నేనిచ్చేసి వస్తాను" అంటూ చేయి చాచింది శాంతమ్మ.

శివ తటపటాయించాడు.

''ఫర్వాలేదు...ఇయ్యి నాన్నా" అని అతని చేతిలోని పొట్లం తీసుకుంది శాంతమ్మ.

"ఏవయినా మార్పులు అవీ ఉంటే.." అని ఏదో చెప్పబోయాడు శివ.

"ఎక్కడ బిగువుగా ఉండాలో, ఎక్కడ కాస్త వదులుగా వుండాలో ఆడపిల్లలు ఆడవాళ్ళతో చెప్పినంత సులువుగా మగపిల్లలతో చెప్పలేరు. అమ్మాయి చెప్పిన మార్పులేవయినా ఉంటే నేనొచ్చి నీకు చెప్తాగా" అంటూ పెద్దింటికి బయల్దేరింది శాంతమ్మ.

తానే స్వయంగా వెళ్ళి గంగకు బట్టలు అప్పజెప్పనందుకు గంగ బాధపడుతుందని శివాకు తెలుసు. కానీ తానే స్వయంగా ఎందుకు వెళ్ళలేకపోయాడో గంగకు తెలియదు. తానలా వెళ్ళలేకపోయినందుకు ఎంతగా బాధపడుతున్నాడో కూడా ఆమెకు తెలియదు. తెలిస్తే ఏమీఅనుకోదు. అలాంటి ఆలోచనలలో శివా తన పని తను

చేసుకుంటున్నాడు.

శాంతమ్మ పెద్దింటికి వెళ్ళింది.

శాంతమ్మను చూసి "బాగున్నావా శాంతమ్మా?" అని నోరారా పలకరించింది నాగమ్మ. గంగకు శాంతమ్మను ఎలా పలకరించాలో, ఎలా గౌరవించాలో అర్థంకాలేదు. ఆమెపట్ల ఏదో అభిమానంతో గంగ మనసు నిండిపోయి ఉంది.

"కాస్త మజ్జిగ తాగత్తా...ఎండలో పడి వచ్చావు" అంటూ వంటింట్లోంచి తెచ్చిన మజ్జిగ గ్లాస్ శాంతమ్మకు అందించింది గంగ.

గంగ తనను 'అత్తా' అని పిలిచిన ఆ పిలుపు విని శాంతమ్మ గంగను ఆపాదమస్తకం పరిశీలనగా చూసింది.

"ఈ మొగలిరేకు నాకు కోడలవుతుందా...అంతటి అదృష్టం నాకుందా?" అనుకుంటూ తనతోతానే కుంగిపోయింది.

"ఏమమ్మా యిలా వచ్చావు? ఏదైనా పనిమీదొచ్చావా??" అంది నాగమ్మ.

"ఏం లేదమ్మా! చిన్నమ్మాయిగారి కొత్త బట్టలు ఇచ్చిరమ్మన్నాడు శివ. ఒకసారి మిమ్మల్ని చూసినట్టు ఉంటుంది, అమ్మాయిగారికి బట్టలు ఒప్పచెప్పినట్టు ఉంటుందని నేనే వచ్చాను" అంది శాంతమ్మ.

"నన్ను చిన్నమ్మాయిగారు అంటావేమిటి అత్తా! చిన్నమ్మాయి అనో, గంగ అనో అంటే చాలుగా" అంది గంగ.

"శాంతమ్మ, ఆమె కొడుక్కూడా మర్యాదస్తులమ్మా. మర్యాద ఇచ్చి పుచ్చుకోవడం వాళ్ళకి తెలుసు" అంది నాగమ్మ.

చిన్నా బయటినుంచి వచ్చాడు. బట్టల పేకెట్టు విప్పి చూసుకుంటోంది గంగ.

"శివా కుట్టిన బట్టలు మళ్ళీ చూసుకో నక్కరలేదు. ఎలా కుట్టినా బాగానే ఉంటాయి" అన్నాడు చిన్నా.

"పెద్ద నీకు తెలిసినట్టు" అంది గంగ.

"నువ్వేగా ఏం చక్కగా కుడుతాడు శివా అన్నావు"

"ఒకసారి బాగా కుడితే ఎప్పుడూ బాగానే కుడతాడా!"

"ఒకసారి బాగా కుడితే ఆ తర్వాత ప్రతిసారీ పాడుచెయ్యాలా?" అన్నాడు చిన్నా.

శాంతమ్మ నవ్వుకుంది.

"అంతా మొండివాదన" అంది గంగ తమ్ముడి పిర్రమీద కొడుతూ.

"నాతో వాదించలేక ఓడిపోయినప్పుడల్లా నా పిర్రమీద కొడుతుంది. ఎప్పుడయినా నేను ఓడిపోతే బుగ్గమీద ముద్దెట్టుకుంటుంది.అదీ ఈ చిన్నమ్మాయి వరస" అన్నాడు చిన్నా.

"నీ మాటలు వింటూవుంటుంటే ఆకలికూడా వేయదు" అంది శాంతమ్మ-చిన్నా బుగ్గలు ముద్దుపెట్టుకుంటూ.

"మా బామ్మా అలాగే అంటుంది. కానీ నాతోపాటే కంచం పెట్టుక్కూర్చుంటుంది" అన్నాడు చిన్నా.

"ఒరేయ్.. నన్నేమన్నా అన్నావంటే నిన్ను పేరెట్టి పిలిచేస్తాను" అంది నాగమ్మ నవ్వుతూ.

"అలా అంటావ్‌గానీ పిలవలేవ్లే! నా పేరు నీ మొగుడు పేరుగా" అన్నాడు నవ్వుతూ చిన్నా.

ముగ్గురూ నవ్వుకున్నారు.

"బాగా కుట్టాడామ్మా?" శాంతమ్మ అడిగింది గంగను.

"తొడుక్కు చూసుకుని ఏదైనా మార్పు అవసరం ఉంటే చిన్నాను పంపుతాను" అంటూ లేచి గదిలోకి వెళ్ళి

దబ్బుతెచ్చి శాంతమ్మకు ఇచ్చింది. డబ్బు పుచ్చుకోవాలో అక్కర్లేదో శాంతమ్మకు తెలియదు.

"శివా ఇంత అని నాకు చెప్ప లేదమ్మా'' అంది శాంతమ్మ.

"ఇది ఎంతో శివాక్కూడా చెప్పక్కర్లేదత్తా! నేనింకా చాలా ఇవ్వాలి" అంది గంగ.

ఒకరి కళ్ళలోకి ఒకరు క్షణంపాటు చూసుకున్నారు. మనసు విప్పి చెప్పుకోలేని మాటలవి, భాషలకందని ఆవేదనలవి.

శాంతమ్మ తిరిగి ఇంటికొచ్చేసింది. లోపలకు వెళ్తున్న శాంతమ్మతో 'ఏమన్నారు' అన్నాడు శివ.

"తొందుక్క చూసుకుని తర్వాత కబురు పంపుతానన్నారు" అంటూ లోపలకు వెళ్ళిపోయింది శాంతమ్మ.

అప్పుడు శివ ఒక్కసారి తలపైకెత్తి ఎదురింటి వరండావైపు చూశాడు. ఎదురుగా వరండాలో బుంగమూతి పెట్టుకుని అలిగిన గంగ కనిపించింది. కోపంగా పవిటి కొంగును విదిలించింది.

శివ ఎవరూ చూడకుండా గంగే చూసేలా లెంపలేసుకున్నాడు. గంగ ముఖం వికసించింది.

శివ మిషన్ వేగంగా తొక్కుతూ తాము కలిసిపాడుకున్న పాట హమ్ చేశాడు.

* * *

ఆ మర్నాడు ఎండవేళ శాంతమ్మ లోపల పడుకుంది. శివ మిషన్ మీదున్నాడు. అరుగుమీది స్నేహితులు భోజనాలకు వెళ్లారు.

చిన్నా ఒక్క పరుగులో వస్తున్నాడు మిషన్ దగ్గరకు. శివ పరుగెత్తుకొస్తున్న చిన్నాను చూశాడు. మిషన్ ముందునుంచి లేచి చిన్నాకెదురు వెళ్లాడు.

"నేను నీకోసం పరుగెత్తుకొస్తూంటే నువ్వు ఎవరికోసం వెళ్తున్నావ్?" అన్నాడు చిన్నా.

"నీకోసమే" అంటూ చిన్నా భుజమ్మీద చెయ్యివేసాడు శివ.

"ఎందుకూ?"

"ఎప్పుడూ నువ్వు నా మిషన్‌దగ్గర కొస్తావుగదా...ఈసారి నేనే నీ దగ్గర కొద్దామనీ"

"లేదులే. నేను నీ మిషన్ దగ్గరకొస్తే నేను ఏం తెచ్చానోననీ, ఏం మాట్లాడుతానోననీ వెయ్యి కళ్ళతోటి, వెయ్యి చెవులతోటి రడీగా ఉంటారు నీ స్నేహితులు. వాళ్ళనుంచి తప్పించుకోవడానికేగదా ఎదురొచ్చావ్''

"అదేంకాదులే బాబూ....వాళ్ళిప్పుడు అరుగుమీద లేరుగా''

''మరయితే పద..అక్కడకే వెళ్దాము" అని ఒక అడుగు ముందుకు వేశాడు చిన్నా.

"అక్కడకు వద్దులేచిన్నా! ఆ పాకెట్ నాకు ఇచ్చి అక్క ఏం చెప్పిందో చెప్పు'' అన్నాడు శివ, చిన్నా చేతుల్లోంచి పాకెట్ తీసుకుంటూ.

"ఏమేం చెయ్యాలో, ఎలా చెయ్యాలో జాకెట్టుమీదే మార్కు చేసుంది.జాగ్రత్తగా చూసుకుని అలాగే చేయమంది"అన్నాడు చిన్నా.

"జాకెట్టు అసలు కుదర్లేదటా చిన్నా!"

"నువ్వొస్తే గొడవలేకుండా ఉండేదా! నువ్వేమో మీ అమ్మను పంపించావు. మా అక్కేమో నన్ను పంపించింది. మీ ఇద్దరి మధ్యన నేను నలిగిపోతున్నాను''

చిన్నా మాటలకు శివా నవ్వాడు.




"ఇక నవ్వు ఆపుచేసి అవి సరిచేసి ఈసారి నువ్వే వెళ్ళి ఇవ్వు" అని పెద్ద మగాడిలా చెప్పి వెళ్ళిపోయాడు చిన్నా.

శివ మిషన్ దగ్గరకు వచ్చి తల్లి ఏం చేస్తోందోనని లోపలకు తొంగి చూశాడు. శాంతమ్మ మంచి నిద్దర్లో ఉంది. పాకెట్ విప్పాడు. నాలుగు జాకెట్లు విడివిడిగా విప్పాడు, దులిపాడు. ఎక్కడా ఉత్తరం లేదు. శివా అలా వెతుక్కోవడం ఎదురింటి వరండాలోంచి గంగ చూసింది, నవ్వింది. ఆ నవ్వులనాదం ఏ దూరానో జాలువారుతున్న జలపాత రవళిలా శివ చెవిని సోకింది.

శివ ముఖం ఎత్తి చూశాడు. 'జాకెట్టు మీదే రాసి ఉంది చూడు' అన్నట్టు గంగ సైగ చేసింది.

వీపువైపు లోపలి భాగానే గుడ్డపైనే గంగ రాసింది చూశాడు శివ.

"నేను ఏం తప్పుచేశానని నువ్వు రాకుండా అమ్మను పంపించావు. నెల రోజులపాటు మావయ్యగారింట్లో ఉండి పోయాననేగా కోపం. అందుకు ఇలాంటి శిక్ష విధించకు. ఈ రాత్రి నాన్న కుప్ప నూర్పిడి దగ్గరుంటాడు. బామ్మా, చిన్నా మంచి నిద్దట్లో ఉన్న వేళ నేను లాంతరు ఊపుతాను. పెరటి తోవన వచ్చేయ్. నీ కోపం తగ్గేలా ఏ శిక్ష విధిస్తావో విధించు. తప్పకుండా రావాలిసుమా"

శివ ఉత్తరం చదవడం పూర్తయ్యాక ఒక సముద్ర కెరటంలా ఎగిరాడు. ఆనందంతో అరవాలనుకుని సగం అరిచి, అమ్మ గుర్తొచ్చి ఆగిపోయాడు.

శాంతమ్మకు మెలుకువ వచ్చింది ఆ అరుపుతో.

"ఏమిటి శివా అది?" అంది లోపల నుంచే.

"ఏంలేదమ్మా! కాజాలుకుట్టే కుర్రాడు కత్తెరతో బట్టకత్తిరిస్తూ వుంటే కేక వేశాడు" అన్నాడు శివ.

కాజాలు కుట్టే కుర్రాడు తెల్లబోయి చూశాడు శివాను. 'ఏమీ లేదులే' అన్నట్టు వాడికి సైగచేసి మాంచిహుషారుగా మిషన్ తొక్కడం మొదలెట్టాడు శివ.

స్నేహితులు నలుగురూ ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు వచ్చిచేరారు.

"ఏం శివా... మాంచి ఉషారుగా ఉన్నట్టున్నావు. మిషన్ మెయిల్ స్పీడ్‌లో తొక్కేస్తున్నావ్! ఓ పద్యం అందుకుంటా వేంటి" అంటూ సుబ్బారావ్ హార్మోనియం పెట్టెమీద "జెండాపై కపిరాజు" అందు కున్నాడు.

"నీకు పుణ్యముంటుంది. కాసేపు పాటలు, పద్యాల విషయాలెత్తకు. త్వరగా పని పూర్తి చేసుకోనియ్యి. సినిమాకు పోవాలి నేను" అన్నాడు శివ.

"నేనూ అంటున్నావు.. మేము రాకూడదా నీతో"

"ఎవరైనా రావచ్చు" శివా మిషన్ తొక్కుతూనే ఉన్నాడు.

"శివా! అసలు నువ్వేమయినా కుడుతున్నావా లేక ఊరికెనే తొక్కుతున్నావా మిషన్?" అన్నాడు అబద్ధం.

"నువ్వు నోరు మూసుకుని కూర్చోరా అబద్ధం. నా పని నన్ను చేసుకోనియ్"

"పోనీ పనయిపోయాక పాడతావా ఓ పద్యం" సుబ్బారావ్ అడిగాడు.

"అలాగే"

ఇంతలో చుక్క వచ్చింది.

"ఏం శివయ్య బాబూ... జాకెట్టు కుట్టేవా?" అంది.

"ఇప్పుడే కుట్టాను... ఇస్తానుండు"

అంటూ పెట్టెలో వెతకసాగాడు.

"ఇప్పుడే పెనం మీంచి తీసిన పెసరట్టులా వేడివేడిగా ఉంటుంది. అప్పుడే వేసుకోకు... కాల్తుంది''అన్నాడు కిట్టప్ప చుక్కాను ఉద్దేశించి.

"ఇదిగో కిట్టప్పా ! నా నోరు చేయి మంచిది కాదని యిదివరకే చెప్పాను... నాతో సరసానికి దిగితే నీ చెంపే పెనం అనుకుని పెసరట్టు కాదు దిబ్బరొట్టె ఏసేత్తాను..." అంది చుక్క.

శివ పేకెట్టును చుక్కా చేతికిచ్చాడు.

"మెడ ఏ మెడ పెట్టావు శివయ్యా బాబూ?''

''నీ మెడే పెట్టాను. విప్పి చూసుకో" అన్నాడు శివా.

"జబ్బలమీద ఆ ముగ్గులెట్టావా?"

''పెట్టాను... చూసుకో'' అన్నాడు శివ.

చుక్కా పేకెట్టు విప్పింది. జాకెట్టు బాడీకి లాల్చీ చేతులు కుట్టి ఉన్నాయి. అరుగుమీద స్నేహితులు పకపకనవ్వారు.

"ఏమయ్యా! నీ కంటికి నేను సగం ఆడా మగలా కనపడుతున్నానా! ముచ్చటపడి జబ్బలమీద ముగ్గులెయ్యమంటే జాకెట్టుకు లాల్చీ చేతులు కుట్టి నా మొహాన కొడతావా!" అని రెచ్చిపోయింది చుక్క.

శివ నాలిక కొరుక్కుని, "పొరపాటయిపోయింది. నేను సరిచేసి ఇస్తా... పోయి రేపురా" అని బతిమాలి చుక్కాను పంపించేసాడు.

ఇంతలో ఓ బుగ్గమీసాల పెద్దమనిషి వచ్చి, "లాల్చీ అయిందిరా శివా... పొద్దున్నే గొర్ల బేరానికి సంతకెళ్లాలి'' అన్నాడు మిషన్ ముందు నిలబడి.

''అయిపోయింది బాబాయ్... ఒక్క క్షణం'' అంటూ పెట్టెలోంచి మడత పెట్టిన లాల్చీ తీసి ఆ పెద్దమనిషికిచ్చాడు.

"బాగా కుట్టావా?" అంటూ ఆ లాల్చీని పెద్దమనిషి విప్పాడు. చుక్కా జాకెట్టు చేతులు లాల్చీకి కుట్టి ఉన్నాయి.

అరుగుమీద స్నేహితులు మళ్ళీ నవ్వారు.

ఆ పెద్దమనిషి వాళ్ళవైపు ఉరిమినట్లు చూసాడు. వాళ్లు నవ్వడం మానేసారు. శివా వైపు చూస్తే శివా అక్కడ లేడు. మిషన్‌కింద ఉన్నాడు. చేతులు జోడించి, "పొరపాటు అయిపోయింది బాబాయ్! నీ చేతులు చుక్కా దగ్గరున్నాయి... తెచ్చి దీనికి కుట్టేస్తాను'' అన్నాడు భయపడుతూ శివ.

"ఏమిట్రా ఆ వాగుడు. నా చేతులు చుక్కా దగ్గరుండటమేమిటి?" అని గర్జించాడు అతను.

"అబ్బే... లాల్చీ చేతులు... చుక్కా చేతులు...నీ లాల్చీకి కుట్టాగా" అన్నాడు శివ.

"ఏదో తగలడు... ఓ గంటలో లాల్చీ సిద్ధంచేసి ఇంటికి పంపించు. ఇలాంటి తేడాలేమైనావస్తే గుండు చేయించేసాను... ఏమనుకుంటున్నావో" అని కేకలేసి వెళ్ళిపోయాడతను.

"ఏమిట్రా ఆ గొడవ?" అంటూ లోపల్నుంచి శాంతమ్మ బయటకు వచ్చింది.

"ఏం లేదమ్మా! సినిమాకెళ్లాలనే హడావిడిలో త్వరగా పని పూర్తి చేయబోయి..." అని శివా చెప్పబోయేలోపల ''చుక్కా చేతులు రుద్రయ్యకి, రుద్రయ్య చేతులు చుక్కకి కుట్టేసాడు" అన్నాడు కిట్టప్ప.





"అసలు చేతులు కావు పిన్నీ..లాల్చీ చేతులు జాకెట్టుకి జాకెట్టు చేతులు లాల్చీకి కుట్టేసాడు" అన్నాడు అబద్ధం.

శాంతమ్మ దవడలు నొక్కుకుని ఇంత మతిమరుపైతే ఎలా బతుకుతావురా శివా! చొక్కా కుట్టమని బట్టిస్తే లాగుకింద, లాగు కుట్టమని బట్టిస్తే జాకెట్టుకింద కుట్టేసి చివాట్లు తినేలా ఉన్నావు నీ వాలకం చూస్తావుంటే" చిరాకుపడి లోపలకు వెళ్లిపోయింది శాంతమ్మ.

"సరేలే...పదండ్రాపోదాం సినిమాకి" అంటూ లేచాడు శివా మిషన్ సర్దేసి.

"మరి పద్యం పాడతానన్నావు?" సుబ్బారావ్ గుర్తుచేశాడు.

"పాడతాలే...పద" అని శాంతమ్మని పిలిచాడు శివ.

"ఆఁ" అంటూ లోపలనుంచే బదులు పలికింది.

"ఓ మంచం, దుప్పటి అరుగుమీద పడేయ్...వచ్చి పడుకుంటాను"

"సరే" అంది శాంతమ్మ.

నలుగురు స్నేహితుల్తోటి శివ హుషారుగా పక్క ఊళ్లోని సినిమాహాలుకి బయల్దేరాడు.




శివ వచ్చి చడీచప్పుడు లేకుండా అరుగుమీదున్న మంచం వాల్చుకుని దుప్పటి పరుచుకుని పడుకున్నాడు.

మంచం వాల్చిన అలికిడికి శాంతమ్మ తలుపు తీసి "అన్నం తినవా శివా?" అని అడిగింది.

"సుబ్బారావ్ ఇంట్లో తిన్నానమ్మా! నువ్వు ఇక పడుకో" అన్నాడు శివ. శాంతమ్మ తలుపేసుకుని లోపలకు వెళ్ళిపోయింది.

శివ నిద్రపోలేదు. ఎదురింటి వరండా వైపే చూస్తూ ఎప్పుడు లాంతరు ఊగుతుందా అని ఎదురుచూస్తున్నాడు.

ఇంతలో కిట్టప్ప వచ్చి "మా ఇంట్లోవాళ్లు పెరట్లో పడుకున్నట్టు ఉన్నార్రా...ఎంత పిలిచినా తలుపు తీయటంలేదు" అంటూ శివా పక్కమీద చేరాడు.

శివ కిట్టప్పని తన వెనక పడుకోమన్నాడు. లాంతరు ఊగేలోపున కిట్టప్ప నిద్రపోవాలనే ఉద్దేశంతో "నాకు నిద్ర వస్తూంది" అంటూ శివ ఆవులించి పడుకున్నాడు. కిట్టప్ప వాగుడుకాయే అయినా వాగితే వినేవాడులేక నోరుమూసుకు పడుకున్నాడు.

మసకవెన్నెల పోయి చీకటి బాగా ముసురుకుంది. ఆకాశంలోని నక్షత్రాలు కాంతివంతంగా కనపడుతున్నాయి. ఇంటి ముందు కొబ్బరితోటలో పశువులు మేస్తూ ఉన్న అలికిడి,వాటి ఉచ్ఛ్వాస నిశ్వాసాలూ వినపడుతున్నాయి.

కొబ్బరితోట వెనక వరండాలోంచి లాంతరు కదిలింది.

శివ చప్పుడు చేయకుండా లేచి కూర్చున్నాడు.

లాంతరు అలా నాలుగైదుసార్లు కదిలి మాయమైంది.

శివ నెమ్మదిగా మంచం దిగి ఎదురుగా ఉన్న గోడ దూకి కొబ్బరి తోటలోకి దిగాడు.



కొబ్బరితోటలో వున్న పక్షులు మనిషి అలికిడి విని మోరలు ఎత్తిపెట్టి హూంకరించాయి. శివ అడుగులో అడుగు వేసుకుంటూ గంగ ఇంటి పెరటి గుమ్మం వైపు నడుస్తున్నాడు. తన అడుగుల చప్పుడు తనకు వినబడుతోంది. నాలు గడుగులు వేసి ఇంకో గోడ ఎక్కి దిగితే గంగ ఇంటి పెరటివైపు వరండాయే. నాలుగడుగులు వేసేసరికి అతని ముందు నుంచే జరజరా పాకుతూ ఓ పాము వెళ్ళిపోయింది.

శివ గుండె జల్లుమంది.

ఒక్క నిమిషంపాటు చలనంలేకుండా నిలబడిపోయాడు.

అతని గుండె కొట్టుకుంటున్న ధ్వని అతనికి వినబడుతోంది.

ధైర్యంగా మరో రెండడుగులువేసి గోడ ఎక్కి అవతలవైపుకి చూశాడు. ఎదురుగా వరండాలో తెల్లటి లంగా, ఓణీ కట్టుకుని వాలుజడలో మల్లెలు సింగారించుకుని, వెన్నెల బొమ్మలా నిలబడివుంది గంగ.

శివ గోడదూకగానే, "రా ఫర్వాలేదు" అంటూనే అతని దగ్గరకొచ్చింది.

అతని చేతిని తన చేతిలోకి తీసుకుని లోపలకు నడుస్తూ, "బామ్మా, చిన్నా ఆ వైపు పడుకున్నారు. బామ్మకు మన మాటలు వినపడవు. నాన్న రేపు పొద్దున కానీ రాడు. చిన్నాన్న తెల్లవారుజామున కానీరాడు" అంటూ తన గదిలోకి తీసుకెళ్ళింది.

ఎత్తయిన పందిరి పట్టెమంచం, ఎదురుగా నిలువుటద్దంగల బీరువా. చిన్నదయినా ముచ్చటగా ఉందా గది.

గదిలోకి వెళ్ళిన తర్వాత గంగ శివా ముందు నిలబడి–

"నామీద కోపం వచ్చిందా?" అంది సూటిగా చూస్తూ.

శివ ఆమె కళ్ళల్లోకి వాడిగా చూస్తూ ఆమె రెప్పవాల్చకపోవడంతో, గంగను తన బిగి కౌగిట్లో బంధించి, ముద్దాడి అలాగే ఎత్తుకుని మంచంమీదకు చేర్చాడు తనూ మంచం మీదకుచేరి ఆమె పాదాల మీద తన చెక్కిలి ఆన్చి మెల్లగా ముద్దాడాడు.

గంగ వొళ్ళు జివ్వుమంది.

తాము తొలిసారి కలిసినప్పుడు ఆలపించిన ప్రణయరాగం శివ పెదవులపై గుసగుసలాడితే, గంగ పెదవులు అందుకుని శృతి కలిపాయి.

పక్కవాటాలో పినతల్లి ఉందనికానీ, ఆవతలిపక్క బామ్మ, చిన్నా ఉన్నారని కానీ గంగకు గుర్తులేదు. ఈ ప్రపంచం మొత్తంలో వాళ్ళిద్దరే ఉన్నారనీ, మరో మనిషే లేదని వాళ్ళ విశ్వాసం.

ఆ ధైర్యంతో ఇద్దరూ మైమరచి స్వేచ్ఛగా ఆరేయి గడిపేస్తున్నారు– నవ్వులు, చెక్కిలిగింతలు, చిరుకాటుకి బదులుగా హంసధ్వనులు– అక్కడితో ఆగక ఆలాపనలు, పాటలు.

"ఈ పాటలేగా నన్ను నీదాన్ని చేసాయి" అంది గంగ.

"టేప్ చేయించి ఇచ్చేస్తాను దాచుకో" అలిగినట్టు అన్నాడు శివా.

"అమ్మో" అంటూ శివాను గట్టిగా అక్కున చేర్చుకుంది గంగ.

"గంగా..."

"ఊం..."

"నీ చూపులకి నేను కరిగిపోతాను"

"నీ తాకిడికి నేను కరిగిపోతాను"

"అలా ఇద్దరం కరిగిపోయి ఒకరిలో ఒకరం కల్సిపోయి మళ్ళీ గడ్డకట్టాక చూసుకుంటే..." శివా మాట పూర్తి కాకుండానే–

"ఇనుము చుట్టూ మైనం ఇలా అతుక్కుపోతుంది" అంటూ గంగ శివాను చుట్టేసుకుంది.

ఇద్దరూ నవ్వేసుకున్నారు.

"శివా... నిన్ను ఎంత దగ్గరకుచేర్చుకున్నా, నువ్వు నన్ను ఎంత పెనవేసుకున్నా నాకు తృప్తిగాలేదు" అంది గంగ.

"నీకు తృప్తిగా, సుఖంగా ఉండే చోటు చూపిస్తాను. అక్కడ ఉంటావా...?"

"నీలో అయితేనే"

"నాలోనే"

"ఎక్కడా?"

"నా నెత్తిమీద"

"ఛ... ఏం మాటలు అవి!"

"అంత కోపమెందుకు గంగా! గంగ స్థానం శివుడి శిరస్సేగదా!" అన్నాడు శివ.

"శివా...శివా....శివా" అంటూ గంగ శివుణ్ని ముఖంమీద, మెడమీద ముద్దా




డింది.

"మరీ అన్నిసార్లు శివా శివా అని పిలవకు"

"ఏం?"

"శివుడు మరీ సులువుగా ప్రత్యక్షం అవుతాడటగా! ఈ శివనామ స్మరణతో ఆ శివుడే ప్రత్యక్షమయి నువ్వే గంగను కుని తీసుకుపోతే నేనేమయిపోవాలి... చెప్పు"

"శివా...నాకు ఈ శివుడే కావాలి. ఈ శివుడినుంచి నన్ను ఆ శివుడు కూడా వేరు చేయలేడు''

* * *

వాళ్ళిద్దరూ అలా మాటల్లో వుండగానే బయట గుర్రపుడెక్కల చప్పుడు విన వచ్చింది.

కోడి కూసింది.

ఎక్కడో దూరంగా కాకులు అరిచాయి.

కాని, ఆ శబ్దాలేవీ వాళ్ళకు వినబడ లేదు.

గంగ, శివ వున్న గదిపక్కగదిలోకే వచ్చిదొరయ్యబట్టలుమార్చుకుంటున్నాడు. వర్ధనమ్మ నిద్ర మత్తు పూర్తిగా వదుల్చు కుని కొంగు నిండా కప్పుకుని మంచం పక్కన దొరయ్య ఆజ్ఞను శిరసావహించ డానికి దాసిలా నిలబడివుంది.

బనీను విప్పబోతున్న దొరయ్యకు పక్కగదిలోంచి కూనిరాగాలు వినబడ్డాయి.

"గంగ నిద్దట్లోగానీ పాడుతోందా?" అన్నాడు దొరయ్య.

వర్ధనమ్మ మాట్లాడలేదు.

"నీకు వినబడటంలేదూ?''

"ఆఁ...'' అంది వర్ధనమ్మ.

ఇంతలో నవ్వులు వినిపించాయి.

"ఆ రెండో నవ్వు ఎవరిది? చిన్నా నవ్వు అలా వుండదే?" అంటూ కిర్రు చెప్పులు వేసుకుని పెరటి గుమ్మంవైపు నుంచే గంగ ఇంట్లోకి వెళ్ళి సరాసరి బార్లా తెరిచివున్న పడక గదిలోకి తొంగి చూసాడు దొరయ్య.

శివ, గంగ అతన్ని చూడలేదు.

దొరయ్య ఒక్క అడుగులో లోపలకు వెళ్ళి మంచం మీదున్న శివాను జుట్టు పట్టుకుని కిందకు లాగాడు.

గంగ ఎదురుగా తన పినతండ్రి దొరయ్యను, నిప్పులు కక్కుతున్న అతని చూపులను చూసి భయపడింది. బరబర బయటకు లాక్కుపోతున్న శివాకు అడ్డం వెళ్ళబోయింది గంగ.

దొరయ్య ఎడమచేత్తో గంగ చెంప మీద కొట్టాడు. ఆ ఒక్క దెబ్బకే గంగ కళ్ళు తిరిగి పడిపోయింది. అక్కడే బయటకు శబ్దం రాకుండా శివా నోరు మూసి చెయ్యి మెలితిప్పి ఒక్క లాగు లాగాడు. రెక్క గూట్లో పటుక్కుమన్న శబ్దం వినిపించింది. అలాగే శివాను కింద పడేసి కాలుతో నోరుమూసి, శివా కాలును మెలిపెట్టి లాగాడు. మళ్ళీ అదే శబ్దం.

అప్పుడు శివా నోట్లో గుడ్డలు కుక్కి బయటకు తీసుకుపోయాడు దొరయ్య.

గంగకు స్పృహ వచ్చింది. ఈలోగా వర్ధనమ్మ నాగమ్మను లేపింది.

స్పృహ వచ్చిన గంగ, ఆమె వెనక నోరు తెరవలేని వర్ధనమ్మ, బొమ్మలా నిలబడిపోయిన నాగమ్మ శివాను గుర్రం మీద వేసుకుని వెళ్లిపోతున్న దొరయ్యను చూసారు.

దొరయ్య గుర్రం మైలుదూరంలో వున్న కాలువవైపుపరిగెడుతోంది. రోడ్డుకు అటూ ఇటూ చెట్లు. శివా కదిలితే దొరయ్య ఓ గుద్దు గుద్దుతున్నాడు. అక్కడ కాలువలో ఒక దొరబోటుని

ఇద్దరు సరంగులు లాగుతున్నారు. ఒక సరంగి గెడవేస్తున్నాడు. ప్రవాహానికి ఎదురు ప్రయాణం చేస్తున్న పడవ అది. శ్రమని మరిపించడానికి పడవ సరంగులు "హైలెసో బేదుజలా ఎవ్వరియవ్వా" అనుకుంటూ లాగేవాళ్ళు ముందుకు నడుస్తూ వుంటే, గెడవేస్తున్న సరంగి తత్వాన్ని పాడుతున్నాడు.

కన్నీరు కారుస్తున్న గంగకు, ఒంటరి తల్లి శాంతమ్మకు, గుర్రంమీద శవంలా పడివున్న శివాకు, నీటి వాలుకు ఎదురు ప్రయాణంచేసే పడవకు సమన్వయించే తత్వమది.

దొరయ్య గుర్రం కాలువ గట్టుకు చేరుకుంది. గుర్రాన్ని ఆపి కిందకు దూకాడు. గుర్రంమీదవున్న శివాను ఎత్తుకుని కాలువ ఒడ్డున నిలబడి నీళ్ళలోకి విసిరాడు.

వెనక్కి తిరిగి గుర్రాన్ని ఎక్కి అదిలించాడు. గుర్రం వేగంగా వెళ్ళిపోయింది.

* * *

తెలతెల్లవారుతోంది. శాంతమ్మ చీపురు చేత పట్టుకుని వీధి వాకిలి ఊడ్చడానికి బయటకొచ్చింది.

"శివా! ఇంక లేనాన్నా..తెల్లవారింది" అంది వొంగుని ఊడుస్తూ.

సమాధానం రాకపోవడంతో మంచం వైపు చూసింది.

మంచం ఖాళీగా ఉంది.

"పొద్దున్నే లేచి కాలువ గట్టుగ్గాని పోయాడేమో" అనుకుంది.

కళ్లాపు చల్లి లోపలకు వెళ్ళిపోయింది. అక్కడ....

పెద్దింట్లో గంగ నాయనమ్మ వాళ్లో పడుకునుంది.

నాయనమ్మ గంగ చెంపమీద దొరయ్య కొట్టిన చెంపదెబ్బ మూలంగా తేలిన తట్టుమీద వెన్న రాస్తోంది. చిన్నా అక్క ముఖంలోకి చూస్తూ దిగులుగా కూర్చున్నాడు.

శ్రీరాములు పొలంనుంచి వచ్చి గుమ్మంలో చెప్పులు విప్పాడు. హాలులోకి వచ్చి చేతిలో ఉన్న కర్రని ఒక మూలగా జారవేసాడు. హాలు అవల వరండాలో ఉన్న గంగను, తల్లి నాగమ్మను,చిన్నాను చూసి దగ్గరకు వెళ్ళాడు.

గంగ చెంపమీద ఉన్న తట్టును, కళ్ళకింద ఉన్న కన్నీటి చారలను చూసి "ఏమైంది?" అన్నాడు నిలబడే.

"దొరయ్య కొట్టాడు" అంది నాగమ్మ ముక్తసరిగా. పక్కనే తన అరుగుమీద కూర్చుని అన్నగారురావడం గమనించిన దొరయ్య అతని వెనకే లోపలికి వచ్చి నిలబడ్డాడు.

"దొరయ్య కొట్టాడు" అన్న మాట తల్లి నోటివెంట రాగానే "అదే నా కూతురయితే నరికి పాతేద్దును" అన్నాడు దొరయ్య.

నిశ్శబ్దంగా, నిండుకుండలా, చలించకుండా దొరయ్య ముఖంలోకి చూసాడు శ్రీరాములు.

"మరి ఎందుకాగిపోయావు?" అన్నాడు శ్రీరాములు.

"నువ్వేం అనుకుంటావోనని"

"నరికెయ్యాల్సినంత తప్పు చేసినప్పుడు నరక్కపోవడం తప్పుకదా"

"అంతకంటే పెద్దతప్పే చేసింది"

"ఏమిటది?"

"అడ్డమైనవాళ్ళ గుడ్డలు కుట్టుకుని బతికే ఆ టైలర్ శివాగాణ్ని అర్ధరాత్రివేళ తన గదిలోకి తీసుకొచ్చి...ఛీ...వినడా




నికి నీకెలా ఉందోగానీ నోటితో చెప్ప డానికి నాకే సిగ్గుగా ఉంది. వాణ్ని అయితే నామరూపాలు లేకుండా చేయ గల్గానుకానీ..." అని పళ్ళు కొరికి ఆగి పోయాడు దొరయ్య.

"మరి దీన్నెందుకు వదిలేసావు?

"నీ కూతురుకదా! నువ్వొచ్చాక..."

దొరయ్య మాట పూర్తి కాకుండానే శ్రీరాములు దొరయ్య చెంపమీద చెళ్లుమని కొట్టాడు.

"నీ కూతుర నా కూతుర అన్న తేడా నీకు ఉంటే ఈ విషయంలో అసలు నువ్వు కలుగజేసుకోనే కూడదు. నువ్వు చేసింది నేను ఎప్పుడైనా కాదన్నానా? ఈ ఇంటి పరువు ప్రతిష్టలకంటే నా కూతురు ఎక్కువనుకున్నావా? తప్పు చేసినప్పుడు తగిన శిక్ష విధించనందుకే కొట్టాను నేను. నువ్వు చెయ్యాని పని నేనే చేస్తాను" అని చూపకేసి చూశాడు శ్రీరాములు.

పనసకాయ కత్తి ఉంది ఆ ఇంటి చూరులో. చర్రున లాగాడు. ఒక్కడుగు ముందుకు వేసేసరికి నాగమ్మ రెండడు గులు ముందుకొచ్చింది-

"ఆగండిరా! మీరు ఊళ్ళో మోతు బరులే కావచ్చు. నాకంటికి మీరిద్దరూ కుర్ర కుంకలేరా" అంటూ.

"నువ్వు అనవసరంగా కలుగజేసు కోకు..అడ్డుతప్పుకో" అని మరో అడుగు ముందుకు వేశాడు శ్రీరాములు.

"నేను బతికుండగా దాన్ని నరక నివ్వనురా! నన్ను నరికాకే దాన్ని నరకాలి. ఇంతకీ ఆ పిల్ల చేసిన తప్పేమి టిరా!"

"అయితే చేసింది తప్పు కాదం టావా?" గర్జించాడు దొరయ్య.

"నువ్వు నోర్ముయ్యరా! లక్ష్మీదేవి లాంటి పెళ్లాం ఇంట్లో ఉండగా తెల్లార గట్లదాకా ఉంచుకున్నదానితో పడుకుని గుర్రమెక్కి ఊరేగే నీలాంటి జులాయి వోడికి తప్పొప్పులు ఎంచే హక్కు లేదురా"

ఆ మాట అనగానే దొరయ్య వెళ్ళి పోయాడు అక్కడినుంచి.

"ఒరేయ్ పెద్దోడా...అది చేసిన తప్పల్లా మిషన్ కుట్టుకుని బతికే లేని వాణ్ని ప్రేమించడమేగా" అంది నాగమ్మ.

"పడగ్గదిలోకి తీసుకురావడం" అరి చాడు శ్రీరాములు.

"దానికి కారణం నువ్వు. పిల్లకు పద్దెనిమిదేళ్లు వచ్చాయి. చదువు సంధ్య మరో వ్యాపకం దానికేం లేదు. ఆ పిల్ల మనసేమిటో, అవసరమేమిటో అడిగి తెలుసుకునేందుకు అమ్మలేదు. తాడి చెట్టంత తండ్రి ఉన్నావన్న పేరేగానీ పిల్లను దగ్గరకు చేరదీసి ఏం కావా లమ్మా అని అడిగిన పాపాన ఎప్పు డేనా పోయావా. పిల్లకి పెళ్ళీడొచ్చిందనే ఆలోచన నీకెప్పుడేనా వచ్చిందా? ఎంత సేపు ఊళ్ళో తగువులు తీర్చడం, తమ్ముడు చేసిన రండాచోరి గొడవల్ని కమ్ముకురావడం, నీ వ్యవసాయాన్ని పెంచుకోవడంతోనే సరిపోయింది.

నేనూ నా మనమరాలిలా ఉన్న కుటుంబంలోనే పుట్టాను.

రెండు ఎకరాలే ఉన్న మేనత్త కొడుకునే పెళ్ళాడాను.

ఈ చేతుల్తోనే వడ్లు దంచి ఆ బియ్యంతో అన్నం వండి పెట్టాను నీకు. ఆయనగారే కష్టపడి ఆ రెండకరాల్ని వంద ఎకరాలు చేసాడు. మీ ఇద్దరికీ చెరో యాభై ఎకరా

లిచ్చేడు. కోడళ్ళ మెడల్లోనూ, నా మెడలోనూ కాసులపేరు దిగేసాడు. మిమ్మల్ని మోతుబర్లుని చేసాడు. అంత మాత్రంచేత ఆ డబ్బు బలం చూసుకుని, కండబలం చూసుకుని ముక్కుపచ్చ లారని కుర్రోడి ప్రాణాలు నిలువునా తీసెయ్యడమే! డబ్బుందిగదాని మనుషుల మన్న సంగతి మర్చిపోవడమే? పిల్ల వంటిమీద చెయ్యిపడితే ఆ కుర్రోణ్ణి మీరిద్దరే చంపారని పోలీసులతో చెప్పి ఊరంతాదాటి మిమ్మల్ని ఉరికంబమెక్కి స్తాను ఏమనుకుంటున్నారో. దాన్ని చంపి తీరాలని నువ్వనుకుంటే నన్ను, ఈ చిన్నోణ్ణి, ఆ వర్ధనమ్మను కూడా చంపి ఈ వంశాన్ని దుంపనాశనం చేసెయ్. మీ వంశగౌరవం, పేరు, గొప్ప ఊరూర చెప్పుకుంటారు" అని ఆవేశం ఆపుకో లేక ఏడుస్తూ గంగను దగ్గరకు తీసు కుంది.

శ్రీరాములు చేతిలోని కత్తిని పక్కనే బల్లమీద పడేసి వీధి అరుగుమీదికి వచ్చాడు. అరుగుమీద దొరయ్య ఒక్కడే తల వంచుకుని కూర్చున్నాడు.

శ్రీరాములు నిశ్శబ్దంగా దొరయ్య పక్కనే కూర్చున్నాడు.

"ఏం చేద్దామంటావు?" సలహా అడి గాడు శ్రీరాములు తమ్ముణ్ణి.

"మేనమామగారి ఇంటికి పంపించు. ఇక్కడే ఉంటే ఈ విషయం కొన్నాళ్ళకు కాకపోతే కొన్నాళ్ళకయినా పొక్కక మానదు. పొక్కాక పెళ్ళవడం కష్టం. అక్కడే ఏదైనా మంచి సంబంధం చూసి చేసెయ్యొచ్చు" అన్నగారికి సలహా ఇచ్చాడు దొరయ్య.

"రేపే పంపేస్తాను" అన్నాడు శ్రీరాములు.

"నువ్వు దిగబెట్టి వస్తావా" అడిగాడు దొరయ్య.

"నాకు మొఖం చెల్లదు"

"సరే...సవారీ బండిమీద కొండాని తీసుకెళ్ళమను. రాత్రికి నే వెళ్ళి బావతో అన్ని విషయాలూ మాట్లాడతాను"



8

ఆరోజు శాంతమ్మ ఇంటిముందు సందడిలేదు.

శివా లేకపోవడం మూలంగా మిషన్ శబ్దంలేదు.

శివా కోసం వచ్చే నలుగురు స్నేహితులు ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు వచ్చి చూసి వెళ్ళిపోతున్నారు.

సూర్యుడు నడినెత్తికి చేరాడు. ఎండ తీవ్రంగా ఉంది. అప్పటికీ ఇంకా కొడుకు రాకపోవడంతో శాంతమ్మ వీధిగుమ్మానికే కళ్ళు అప్పగించి శివా కోసం ఎదురు చూస్తోంది.

కిట్టప్ప వచ్చాడు. తన పక్కలోంచి లేచి శివా ఎటు వెళ్ళాడో కిట్టప్ప ఒక్కడికే తెలుసు. అటు వెళ్ళిన వ్యక్తి ఇప్పటిదాకా తిరిగిరాకపోవడమంటే కిట్టప్పకి ఆందోళన గానే ఉంది. మనసు విప్పి స్నేహితులతో చెప్పినా ఏం జరుగుతుందోనని భయం.

కన్నబిడ్డకోసం తల్లడిల్లిపోతూ వీధి వాకిలికే కళ్ళప్పగించి కూర్చున్న శాంతమ్మను చూసేసరికి కిట్టప్ప కడుపు




తప్పిపోయింది. శివాతోపాటు తమ నలుగురు స్నేహితుల్నీ కూడా కన్న బిడ్డల్లాగే చూసేది శాంతమ్మ. ఒక పండు తెచ్చినా, పిండివంటచేసినా అయిదుగురికీ పంచిపెట్టేది. అందుకే వాళ్ళందరికీ శాంతమ్మ అంటే గౌరవం, ప్రేమ!

కిట్టప్ప శాంతమ్మ దగ్గరకు వెళ్ళి ఆమె కెదురుగా చతికిలబడ్డాడు. పరధ్యానంగా ఉన్న శాంతమ్మ, కిట్టప్ప వైపు చూసింది.

"శివా రాలేదుకదూ?" కిట్టప్పయే అడిగాడు.

"లేదుబాబూ! రాత్రి మీరందరూకలిసే సినిమాకెళ్ళారుగదా. నీతో ఎక్కడికైనా వెళ్ళాలని చెప్పాడా?" శాంతమ్మ అడిగింది తెలుసుకోవాలన్న ఆతృతతో.

"ఏం చెప్పలేదు" అన్నట్టు తల అడ్డంగా ఊపాడు కిట్టప్ప.

"మరి ఎక్కడకు వెళ్ళి ఉంటాడు చెప్మా. చెప్పకుండా ఎక్కడకు వెళ్ళే వాడుకాదే" తనలో తనే అనుకుంది శాంతమ్మ.

"రాత్రి నేను శివా పక్కలోనే పడుకున్నాను" కిట్టప్ప అన్నాడు. శాంతమ్మ ఆతృతగా కిట్టప్ప కళ్ళలోకి చూసింది.

"ఎంత పిలిచినా మావాళ్ళు తలుపు తెరవకపోతే వచ్చి శివా పక్కలో పడుకున్నాను. అర్ధరాత్రి దాటాక శివా నా పక్కలోంచి లేచి గోడదూకి పెద్దింట్లోకి వెళ్ళాడు" కిట్టప్ప మాట పూర్తికాగానే శాంతమ్మ మొఖంలో రంగులు మారి పోయాయి.

"నువ్వు చెప్తున్నది నిజమేనా బాబూ!" శాంతమ్మ కంఠంలో వణుకు మొదలైంది.

"తెల్లారేదాకా నేను మంచంమీదనే ఉన్నాను. శివా వస్తాడేమోనని ఎదురు చూస్తూనే ఉన్నాను. కానీ రాలేదు" ఇంక మాట్లాడలేక తల వంచుకున్నాడు కిట్టప్ప.

"నేను వద్దని బతిమాలుకున్నానుగా బాబూ! నా మాటే పెడచెవిన పెట్టాడా" అంటూ లేచి పెద్దింటివైపు నడిచింది శాంతమ్మ.

మరునిముషంలో పెద్దింట్లో ఉంది శాంతమ్మ!

శ్రీరాములు వాలుకుర్చీలో పడుకును న్నాడు చుట్టకాలుస్తూ. దొరయ్య కవాచీ బల్లమీద కూర్చునున్నాడు.

శాంతమ్మ వాళ్ళముందు నిలబడింది.

"నా కొడుకు పొద్దెక్కినప్పటినుంచీ కనపడటంలేదు బాబూ!"

శ్రీరాములు ముందు చేతులు జోడించి చెప్పుకుంది శాంతమ్మ.

'నా కొడుకు ఏమయ్యాడు?' అని ప్రశ్నించే ధైర్యంలేక అలా 'నా కొడుకు కనిపించడంలేదు' అని విన్నవించుకుంది శాంతమ్మ.

"నన్నేం చెయ్యమంటావ్?" శ్రీరాములు గంభీరంగా అడిగాడు.

"ఊరికి పెద్దకదాని చెప్పుకుంటు న్నాను బాబూ...నాకు ఉన్నది వాడు ఒక్కడేగా" దుఃఖం పొర్లిపొర్లి రావడంతో శాంతమ్మ గొంతులోంచి ఇక మాటలు బయటకురాలేదు.

"నీ కొడుకుని ఎవడైనా కొట్టినా తిట్టినా నా ముందు తగువుపెడితే వాళ్ళను పిలిపించి తగువు తీర్చగలను. నీ కొడుకు పసిపిల్లాడేంకాడు తప్పిపోయాడనుకోవడా నికి.కనిపించకపోతే నన్నేం చేయమంటావ్ చెప్పు"

వెతికి తీసుకొచ్చి ఇచ్చేస్తారా. వయసులో వున్న కుర్రాడు సినిమాలకి పోయాడో షికార్లకి పోయాడో. లేకపోతే పేటలోంచి ఏ పిల్లనో తీసుకుని..."



వీధి వాకిట్లో నిలబడిన నాగమ్మ "ఏమంటుంది శాంతమ్మ" అని అడిగింది వాళ్ళ సంభాషణ పూర్తిగా వినబడక.

"కొడుకు కనపడటంలేదట" గట్టిగా చెప్పాడు శ్రీరాములు.

"వెళ్లి పోలీస్ రిపోర్ట్ ఇయ్యి" అరిచినట్టు చెప్పి లోపలకు వెళ్ళిపోయింది.

"ఆ ముసలిదాని మాటలకేంలే. పోలీస్ రిపోర్ట్ ఇచ్చినంత మాత్రాన అర్జంటుగా

దొరయ్య మాట పూర్తికాకుండానే "నా కొడుకు అలాంటివాడుకాదు బాబూ! నా కొడుక్కి అలాంటి బుద్ధుల్లేవు" దృఢ విశ్వాసంతో చెప్పింది శాంతమ్మ.

చెప్పి, వాళ్ళ ముందునుంచి వెళ్ళిపోయింది.

పెరటి గుమ్మంనుంచి లోపలకెళ్లింది.

పెరటివైపు వరండాలో గంగ సర్వస్వాన్నీ పోగొట్టుకున్నదానిలా అయోమయ స్థితిలో ఎదురింటి అరుగు మీద మూగబోయిన మిషన్‌వైపే చూస్తూ బొమ్మలా కూర్చునుంది.

శాంతమ్మ ఆమెకు చేరువగా కూర్చుని "చిన్నమ్మాయిగారూ..." అంది.

గంగ వులిక్కిపడి, "ఊఁ" అంటూ శాంతమ్మ కళ్ళలోకి చూసింది. ఇద్దరి కళ్ళలోనూ నీళ్లు తిరిగాయి.

"నా శివ..." అని మాత్రం అనగలిగింది గాద్గదికంగా శాంతమ్మ.

గంగ కళ్లల్లో నిండిన నీరు చెక్కిళ్ళపైకి జారాయి. కుమిలిపోతూ శాంతమ్మ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని క్షమించమన్నట్లు కళ్ళకద్దుకుంది.

"అంతేనామ్మా ... నా శివా నాకింక లేడామ్మా! నేను బిడ్డలేని తల్లినైపోయానామ్మా, అంతేనామ్మా. శివా..ఎందుకురా నన్ను ఒంటరిదాన్ని చేసి పోయావు" అంటూ గంగ ముందునుంచి లేచి తనలో తనే మాట్లాడుకుంటూ వెళ్ళిపోయింది శాంతమ్మ.

* * *

కొండా నరెడ్లబండి తోలుతున్నాడు. బండికి ఇటు అటు తెరలు కట్టి వున్నాయి.

వీధి మధ్యలోంచి బండి వెళుతోంది. అలా తెరలుకట్టి వెళ్ళే సవారీబండి వీధిలో వెళుతూవుంటే జనం తప్పుకోవడం పరిపాటి. బండిలో తెరల వెనక పెద్దింటి ఆడవారు వున్నారని వూళ్లో అందరికీ తెలుసు. అందుకే తప్పుకుంటారు.

తెరల లోపల మౌనంగా మోకాలిపై చెక్కిలి ఆన్చి కూర్చున్న గంగకు శాంతమ్మ మాటలు వినిపించాయి.

"రుద్రయ్య బాబూ ... మా శివాను చూసావా! ఓ చుక్కా...మా శివా ఎక్కడైనా కనబడితే నేను రమ్మన్నానని చెప్పు. వచ్చేస్తాడులే. వెళ్ళినవాడు రాక ఎక్కడకు పోతాడు. అసలు వుంటేగా వచ్చేది" చివరకు ఏడ్చేసింది శాంతమ్మ.

"పిచ్చి ఎక్కినట్టుంది పాపం" అన్న చుక్క మాటలు వినిపించాయి గంగకు.

శాంతమ్మ గబగబా వెళ్లి బండికి వున్న వెనకాల తెర ఎత్తింది.

"చిన్నమ్మాయిగారా! మా శివా ఎక్కడైనా కనిపించాడా? కనిపిస్తే నేను రమ్మన్నానని చెప్పండీ. వాడు రాకపోతే నే బతకలేను అమ్మాయిగారూ! అసలు వుంటేగా వచ్చేది" అంటూ బండి వెనకాలే నడిచింది శాంతమ్మ.

శాంతమ్మ గొడవనుంచి తప్పించుకోవడంకోసం కొండా బండిని వేగంగా తోలాడు. గంగ కళ్లు మూసుకుని కన్నీటిని బొటబొటా కార్చింది.

"శివా లేకపోతే నేనూ బతకలేను. కానీ ఎవరితో చెప్పుకోను? నాక్కూడా నీలా పిచ్చెక్కితే ఎంత హాయిగావుండేది అత్తా" అనుకుంది గంగ.

బండి పొలాల్లోకి వెళ్ళిపోయింది.

"వాగు వచ్చిందమ్మాయిగోరూ... గట్టిగా పట్టుకోండి" అన్నాడు కొండా.

ఆ మాటలు వినగానే గంగకు గతం గుర్తుకొచ్చింది. శివా తనను ఈ వాగు దగ్గరే కలిశాడు. కళ్ళవెంట నీరు జలజలా రాలింది. బండి భూషణంగారింటికి చేసుకుంది. ఎప్పటిలాగే గంగ బండి దిగింది. కానీ వెనకటి గంగ వేరు. అది నవ్వుల జలపాతం. ఈనాటి గంగ ఎండిపోయి ఇసుక తేలిన ప్రవాహం. గంగ బండి దిగి వెళ్ళడమే తడవుగా ఆ వెనకనే దొరయ్య




గుర్రం వచ్చి భూషణం ఇంటి ముందు ఆగింది.

"ఏమిటి బావగారూ ... అమ్మాయి వెనకాలే వచ్చేసారు"

"రండి లోపలకెడదాం" కుర్చీలోంచి లేచాడు భూషణందొరయ్యని ఆహ్వానిస్తూ.

"నేను లోపలకు రావడంలేదు. మనిద్దరం బయటికే వెళ్దాం. మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అన్నాడు దొరయ్య.

''లోపల మాట్లాడుకోవచ్చుగా''

"లోపల మాట్లాడవలసిన విషయం కాదు ... రండి" అంటూ భూషణంతో కలిసి నడిచాడు దొరయ్య. అలా ఇద్దరూ చెరుకు గానుగ దగ్గరకు వచ్చారు.

"ఏదో రహస్యమన్నారు...చెప్పారు కాదు!" అన్నాడు భూషణం.

''అమ్మాయి ఈ మధ్యన ఓ అఘాయిత్యం చేసింది'' అంటూ ఉపక్రమించాడు దొరయ్య.

ఇంతలో చెరుకు క్రషర్ స్టార్ట్ అయింది. ఆ చప్పుడులోనే జరిగిందంతా చెప్పాడు దొరయ్య.

చివరికి ''ఇక్కడే ఏదో మంచి సంబంధం త్వరగా చూసి పెళ్ళి జరిపించేయాలన్నాడు అన్నయ్య. ఆ బాధ్యత మీరు మీదవేసుకోక తప్పదు'' అన్నాడు దొరయ్య.

"భలేవారే బావగారూ...గంగ నాకు బరువా! నేనే పీటలమీద ముందు కూర్చుని కన్యాదానం చేస్తాను'' అన్నాడు భూషణం.

"సరే... నేనొస్తా. అమ్మాయిని జాగ్రత్తగా చూసుకో'' అంటూ హెచ్చరించి వెళ్ళిపోయాడు దొరయ్య.

* * *

ఆ గొడవ జరిగిన తర్వాత పెద్దింట్లో ఎవరూఎవరితోనూకలివిడిగాఉండటంలేదు. నాగమ్మకు చిన్నకొడుకు దొరయ్య మీద అసహ్యం కలిగింది. గంగను మేనమామ గారింటికి పంపేసాడని పెద్దకొడుకు శ్రీరాములు మీద కోపంగా ఉంది. ఒక్క చిన్నాతోటే మాట్లాడుకుంటూ, చిన్నా కోసమే ఏదైనా వండి పెడుతూ కాలక్షేపం చేస్తోంది నాగమ్మ.

దొరయ్య, శ్రీరాములు కూడా అంత ఎక్కువగా మాట్లాడుకోవటం లేదు. వర్ధనమ్మ దొరయ్య ముందు ఎప్పుడూ మితభాషే. మాట్లాడాలని ఉన్నా, మాట్లాడానికి భయం ఆమెకు. అందుకని ఎప్పటిలాగే దొరయ్యతో ఉంటూ ఇదివరలో మాట్లాడే పొడి మాటలుకూడా తగ్గించేసింది. దొరయ్య రెండుసార్లు అరిస్తే బదులుపలుకుతోంది. ఈ గొడవ జరిగాక నాలుగైదు రోజులు దొరయ్య పారిజాతం దగ్గరకు వెళ్ళలేదు. చివరికి మనసు బాగోక ఆ రాత్రి పారిజాతం ఇంటికి చేరుకున్నాడు.

గుర్రపు డెక్కల చప్పుడు విన్న పారిజాతం దొరయ్యని ఆహ్వానించడానికి వీధి గుమ్మంలో నిలబడింది.

దొరయ్య గుర్రం దిగాడు.

దీపం వెలుగులో గుమ్మంలో ఉన్న పారిజాతం విరబూసిన పారిజాతంలాగే కనిపించింది దొరయ్య కంటికి.

దొరయ్యచేతిని తన చేతిలోకి తీసుకుని లోపలకి నడుస్తూ "ఈమధ్య మీరు మరీ నల్లపూస అయిపోయారు" అంది పారిజాతం వేళ్ళు విరుస్తూ.

దాబామెట్లు ఎక్కుతూ "నీ భాషేమిటో నీ గొడవేమిటో నాకు అర్థంకాదు. చెట్టంత మనిషిని పట్టుకుని నల్లపూస అంటావ్!

ముద్దువస్తే మందానికి సరిపోయే మనిషిని పట్టుకుని నా బుజ్జిబాబువి కదూ అంటావు" అన్నాడు దొరయ్య.

పారిజాతం నవ్వి, "అదే సరసం అంటేనూ" అంది.

"ఏంటి... నల్లపూస, బుజ్జిబాబునా''

"ఊఁ .... ఇంత మనిషిని అంత ముద్దుగా పిల్చుకోవడం ఎంత హాయిగా ఉంటుందో తెలుసా! నల్లపూస ఎప్పుడూ మెడలో ఉంటుంది. బుజ్జిబాబు ఎప్పుడూ వళ్లో ఉంటాడు" అంది పారిజాతం.

"నీ తస్సాదియ్యా! ఇలాటి మాటల్తోటి, చమత్కారాల్తోటే చెట్టంత మనిషిని పెంపుడు కుక్కలాగా మంచంకోటికి కట్టేసుకుంటావ్ కదనే'' అన్నాడు నవ్వుతూ దొరయ్య.

"ఆఁ...అందుకే ఈ వారం రోజులబట్టి రోజూ వస్తున్నారు'' అంది పారిజాతం మూతి ముప్పయి వంపులు తిప్పి.

"నీ తస్సాదియ్యా... ఆ మూతి అన్ని మెలికలు ఎలా తిరుగుద్దే నీకు" అన్నాడు నవ్వుతూ పెదవులు పట్టుకుని.

"అబ్బా...అంతా మోటుసరసం'' అంది అతని చేతుల్లోంచి పెదవుల్ని వదిలించుకుంటూ.

"మొగోడు మొరటుగానే ఉండాలి, ఆడది సున్నితంగా ఉండాలి అనేవోడు మా తాత''

"ఆ మొరటుతనం చూసేగా పడి సచ్చేది'' అంటూ అతని చొక్కా బొత్తాలు నలుపుతోంది.

దొరయ్య, "వెళ్ళి మందుసీసా పట్టుకురా" అన్నాడు.

''సిద్ధంగానే ఉంచాను" అంటూ మంచంకింద నుంచి సీసాతీసి ముక్కాలు పీటమీద ఉన్న గ్లాస్‌లో పోసింది. చేతికి అందించింది. దొరయ్య ఒక గుటక వేసి "పారిజాతం....ఈవేళ నిన్ను చూస్తోంటే సంపంగి పువ్వులా అనిపిస్తున్నావే" అన్నాడు.

"ఏం...పారిజాతంమీద మోజుతగ్గి సంపెంగమీద మోజు పెరిగిందా" వెటకారంగా అంది పారిజాతం.

"నేను మాటాడేది మనిషి సంగతి కాదు...పువ్వు సంగతి. సంపెంగ పువ్వు నలిగేకొద్దీ దాని సువాసన పెరిగిపోద్ది. అలాగే నీ వయస్సు పెరుగుతున్నకొద్దీ నీ అందం, శృంగారం పెరిగిపోతోంది"

"అబ్బో అబ్బో...మీకూ శృంగారం అబ్బిందే"

"నా తలకాయ! అలా అనాలనిపించింది అన్నాను. మీలాగా మాకిది వ్యాపారమేటి... ఈ మాటలన్నీ నేర్చుకుందుకు" అంటూ గ్లాసు ఖాళీచేసేసాడు దొరయ్య.

''ఏమిటి...ఈవేళ అంత స్పీడు!" అంది మళ్ళీ గ్లాస్ నింపుతూ.

"చూడు పారిజాతం...నేను మా ఊళ్లో ఉంటే తాగను. మా ఇంట్లో ఉన్నప్పుడు తాగను. పట్టపగలు తాగను. పొరుగూరులో అయితేనే తాగుతాను. అదికూడా రాత్రి పూట అయితేనే తాగుతాను. ఆ రాత్రి కూడా పక్కన నువ్వువుంటేనే తాగుతాను పక్కన నువ్వు లేకుండా నెలరోజుల్లో ఆ మూడురోజులు తప్ప ఏరోజునా ఉండను. ఈ మధ్య ఏదో పనిమీద నాలుగైదు రోజులు నీ దగ్గరకు రాలేక పోయాను. ఈనాలుగైదు రోజుల కోటా ఈ రోజు ఏసెయ్యకపోతే రేత్రికి, మందుకి, నీకు అన్యాయం చేసినోడినయి పోతాను. అన్నింటికీ మించి ఓ నిజం చెప్పనా. ఈవేళ నిన్ను చూస్తోంటే ఫుల్ బాటిల్ కూడా కిక్ ఇచ్చేలా కనబడటం




లేదే ! తస్సాదియ్యా....నువ్వే డబల్ విస్కీ బాటిల్‌లా ఉన్నావ్" అంటూ తన పక్కలో కూర్చున్న పారిజాతాన్ని లాగాడు.

ఆమె అతని గుండెలమీద వాలింది.

"తస్సాదియ్యా..ఈవేళ నువ్వు కొత్త గోదారిలా మంచి వడిలో ఉన్నావ్" అన్నాడు దొరయ్య ఆమెని దగ్గరకు తీసుకుంటూ.

"నాలుగు రోజుల తర్వాత కనిపిస్తే మరెలా ఉంటాను" అంది పారిజాతం.

"తస్సాదియ్యా! ఈవేళ నాలుగు రోజుల మందు కోటా పీల్చేసాను" అన్నాడు దొరయ్య పారిజాతాన్ని దగ్గరకు లాక్కుంటూ.

"అన్నీ పోకిరి మాటలే" అంటూ ముక్కు పట్టుకు గుంజింది పారిజాతం. దొరయ్య నవ్వాడు.

"మీకో శుభవార్త చెప్పనా?"

"ఏటదీ?"

"మీరు తండ్రి కాబోతున్నారు!"

"ఎవరికీ?"

"నా కడుపులో పెరుగుతున్న బిడ్డకి!"

"అయితే నువ్వు చెప్పితే నన్ను నమ్మేయమంటావు!"

"నిజమండీ! డాక్టరమ్మ పరీక్షచేసి చెప్పింది"

"డాక్టరమ్మ అబద్ధమాడిందని నేననడంలేదు. నీ కడుపులో ఉన్న బిడ్డ నా బిడ్డేనని నన్ను నమ్మమంటావా అని అంటున్నాను"

"ఏమిటండీ మీరనేది ?" అంటూ పారిజాతం అతని గుండెల మీదినుంచి లేచింది. పక్కమీద పడుకున్న దొరయ్య కూడా చివ్వున లేచాడు.

"నేనేదో నీకర్థంకాని భాషలో మాట్లాడినట్టు 'ఏమిటండీ మీరనేది' అని ఎదురుప్రశ్న వేస్తావేంటే. నా సంగతి నీకు పూర్తిగా తెలియదు. నమ్మి మోస పోవడం నాకు అలవాటులేదు. అనుమా నించి జాగ్రత్తపడటం మొదటినుంచీ నాకు అలవాటు. ఏం తోచకపోతే నన్ను నేనే అనుమానించేసుకుంటాను. అలాంటి మనిషిని అయివుండి ఒక సానిని నా అండర్‌లో పదేళ్ళనుంచి పెట్టుకున్న మాత్రంచేత ఈ పదేళ్ళబట్టి రాని కడుపు ఈవేళ వచ్చేసింది అని చెబితే ఆ కడుపు నా వల్లే వచ్చింది అని నన్ను నమ్మ మంటావు ... పోనీ నమ్ముదామనుకున్నా వీలు పడటంలేదే"

"ఎందుకనీ?" నిస్సహాయంగా అతని మొఖంలోకి చూస్తూ అడిగింది పారిజాతం.

"ఎందుకనేమిటే · వెర్రిమొఖమా! నా పెళ్ళయి పదిహేనేళ్ళయింది. నీతో పరిచయమయ్యాక ఈ పదేళ్లు నీతోనే గడిపానుగానీ అంతకితం ఐదేళ్ళు కట్టు కున్న పెళ్ళాంతో నికార్సుగానే కాపురం చేశాను.ఆ అయిదేళ్ళలోనూ అక్కడ రాని కడుపు ఈ పదేళ్ళలోనూ ఇక్కడరాని కడుపు చటుక్కున ఈవేళ నీకు వచ్చే సింది అంటే నన్ను పెద్ద మగోడి కింద సర్టిఫికెటు ఇచ్చావని మురిసిపోను నేను. నా నైజం ప్రకారం అనుమానిస్తాను. నువ్వు సానివి కాబట్టి అనుమానిస్తాను. అది కాకపోయినా నీలాటిదానికి పిల్ల లెందుకే! పిల్లా పాపలో సంసారం చేసు కోవాలంటే ఇంట్లో ఫ్యామిలీస్ లేవూ. ఏ అడ్డూ బాదరబందీ లేకుండా ఉంటూం దనేగదా నీలాంటిదాని ఇంటికి రావడం. ఇక నీతో నాకు పనిలేదు. ఇక ఈ

వ్యభిచారం మానేసి ఎవరైనా దొరికితే సంసారం చేసుకో. ఈ పాత హార్మో నియం పెట్టెతో ఇంకా ఎన్నాళ్ళు" అంటూ లేచి వెళ్ళిపోయాడు.

గుర్రపు డెక్కల చప్పుడు కుంగి పోయిన పారిజాతం చెవులకు సోకింది.

ఒక విరిగిన నవ్వు పెదవులపై కదిలింది.

"నన్ను ప్రేమించావని నమ్మాను. నేను వేశ్యనే. అయినా ఆడదాన్ని. తనువు, మనసు నీకే అర్పించాను. నీ రూపం నాలో పెరుగుతోందంటే నన్నే అనుమానించావు. అనుమానించడం నీ హక్కు. అనుమానించబడటం నా తలరాత,నా పాలిట శాపం" అని కళ్ళు తుడుచుకుంది.

"పోతేపోనీ. తాళి కట్టినవాడే కన్ను మూస్తే కన్నబిడ్డల్ని చూసుకుంటూ వారి కోసం ఎంత మంది తల్లులు బత కడంలేదు. నిన్నటిదాకా స్త్రీని. ఈవేళ నుంచి తల్లిని! ఇంక అమ్మగా బతుకుతాను. ఒకవేళ నేను ఆడపిల్లనే కంటే నా గతి దానికి పట్టకుండా ఉండ డానికి నా రక్తమాంసాలయినా ధార పోస్తాను. అవసరమైతే తూకానికి అమ్ముడుపోతాను. ఇకనుంచి నేను అమ్మను" అనుకుంది తనలో తనే.

* * *

వర్ధనమ్మ ఆరోజు కొత్త జాకెట్టు, నైలెక్స్ చీర ధరించి తన అందాన్ని అద్దంలో చూసుకు మురిసిపోయి మరి కాస్త మేకప్ చేసుకుని చివరకు విసిగి, అలసిపోయి మంచంమీద పడుకుంది. బాగా నిద్ర పట్టింది.

పారిజాతం ఇంటినుంచి రోజూ కోడి కూతవేళ బయల్దేరే దొరయ్య ఈ రాత్రి పన్నెండుగంటలకే బయల్దేరి అరగంటలో ఇల్లు చేరుకున్నాడు.

గుర్రాన్ని గుమ్మం ముందుకు తీసుకు రాకుండా ఆవేళప్పుడు పాలేరు ఉండడని గుర్రమ్మీదే గొడ్ల చావిడివైపు వెళ్లాడు. గుర్రాన్ని శాలలో కట్టేసి ఇంటివైపు వచ్చాడు.

వర్ధనమ్మ నిద్దర్లో ఉండటంచేత దూరంనుంచి గుర్రం డెక్కల చప్పుడు వినిపించుకోలేదు.

దొరయ్య తలుపు తట్టాడు. అది దొరయ్య వచ్చేవేళ కాకపోవడంతో అతను కాదనుకుని పవిటి నిండావేసుకో కుండా ఆ అలంకరణలోనే వచ్చి తలుపు తీసింది వర్ధనమ్మ.

తాగిన మైకం దిగని దొరయ్య దీపం వెలుగులో వర్ధనమ్మని పరకాయించి చూసి "ఏమిటే ఈ సానివేషాలు" అంటూ చెంపమీద కొట్టాడు. కసితీరక జబ్బ పట్టుకుని బరబరా పడగ్గదిలోకి లాక్కెళ్లి వెనకనుంచి కొత్త జాకెట్టు చింపేసాడు. వర్ధనమ్మ ఏడుస్తోంది.

"ఈ ఏడుపు మొఖం తెల్లవారేసరికి నాకు కనిపించడానికి వీల్లేదు. గుడిసేటి వేషాలు వేసుకుని నువ్వు ఈ ఇంటి కోడలుగా మసలుతోంటే చూస్తూ ఊరు కోవడానికి నేనేంచాతగాని మగాణ్ని కాదు. ఫో నీ పుట్టింటికి" అంటూ మళ్లీ ఒక దెబ్బ కొట్టాడు. ఈసారి దెబ్బకు ఓర్చుకో లేక అరిచింది వర్ధనమ్మ. వెళ్లిపోతోన్న దొరయ్య కాళ్లు పట్టుకుని, "ఈ ఒక్క తప్పు క్షమించండి.ఇంకెప్పుడూ ఇలాంటి బట్టలు కట్టుకోను" అని మొరపెట్టుకుంది.

దొరయ్య విదిలించుకుని వెళ్ళిపోయాడు. తెల్లవారొస్తున్నా వర్ధనమ్మ వెక్కివెక్కి ఏడుస్తూనే ఉంది. నాగమ్మ వర్ధనమ్మ





గదిలోకి వచ్చింది.

"ఏటమ్మా ... రాత్రి వాడి అరుపులు వినబడ్డాయి? ఏం జరిగింది?" అంది.

వర్ధనమ్మ మంచంమీదనుంచి లేచి "అత్తయ్యా" అని బావురుమంటూ నాగమ్మని కౌగిలించుకుంది.

"అసలేం జరిగిందమ్మా" అంటూ తన భుజంమీద వాలిపోయిన కోడల్ని లేపి చెంపమీదున్న తట్టును చూసింది.

"ఈడు పుట్టినప్పుడు దబ్బపండు లాటి బిడ్డను కన్నానని మురిసిపోయాను. ఈడు ఎదిగి నాకు తెలియకుండా పశువయిపోయాడు. ఎంత దెబ్బ కొట్టాడే తల్లీ....ఎందుకు కొట్టాడే...?" అంది నాగమ్మ.

"ఈ బట్టలు కట్టుకున్నానని..." అంది వర్ధనమ్మ ఏడుస్తూ.

"అంత మాత్రందానికే కొట్టాలా? సినిమాల్లో రిబ్బన్ ముక్కంత గుడ్డ ఒంటికి కప్పుకుని ఆడది ఎగిరి గంతులు ఏస్తుంటే బోలెడంత ఖరీదెట్టి టికెట్టు కొనుక్కుని చూస్తారు. ఇంట్లో పెళ్లాం కాస్తంత పలుచని చీర కట్టుకుని నాజుగ్గా ముస్తాబైతే ఓర్వలేరు మగసచ్చినోళ్లు. రైటేగానీ...అసలు ఈ ఏసం ఎందుకేసావే నువ్వు...?"

"రోజూ రాత్రి ఇలాంటి బట్టలే వేస్తానత్తయ్యా..."

"ఎందుకే?"

"ఆయనకోసమే!"

"ఆడు రేత్రి ఇంట్లో ఉండేదెప్పుడే!'' అంది నాగమ్మ.

"అందుకే అత్తయ్యా ... ఇలా అందంగా ముస్తాబైతేనన్నా ఇంటి పట్టున ఉంటారేమో అన్న ఆశతో రోజూ ఈ వేషం వేసుకుంటాను. వేసుకున్నా ఆయనకు ఎప్పుడూ కనబడలేదు. ఆ గుర్రపు డెక్కల చప్పుడు వినేసరికే ఓ ముతక చీర చుట్టబెట్టుకుని కొంగు నిండా కప్పుకుని తలుపు తీసే దాన్ని. నిన్నరాత్రి ఆయన తొందరగా వచ్చేసారు. గుర్రపు డెక్కల చప్పుడు వినపడలేదు. తలుపు తట్టితే ఆయన అనుకోకుండా తలుపు తీసాను. ఈ వేషం చూసి కొట్టారు. పుట్టింటికి పొమ్మన్నారు"

"ఏడిసాడులే... నాతో వచ్చెయ్! ఇక్కడెందుకున్నావని అడిగితే ఇదే నా పుట్టిల్లు అని చెప్పు. ఇష్టమైతే ఆడే ఉంటాడు, లేకపోతే పోతాడు. చీటికి మాటికి పెళ్ళాన్ని పుట్టింటికి పొమ్మనడం, వదిలేస్తానని అనడం పేషన్ అయిపోయింది ప్రతి మగ సన్నాసికి" అంది నాగమ్మ.

అత్తగారి కళ్ళలోకి కృతజ్ఞతగా చూసింది వర్ధనమ్మ.




శ్రీరాములు వీధిలో తలవంచుకుని గౌరవంగా నడిచివెళ్ళే పెద్దమనిషి. అరుగులమీద కూర్చున్న చిన్నా పెద్దా కూడా శ్రీరాములు వీధిన నడుస్తూవుంటే గౌరవంగా లేచి నిలబడతారు. ఆడవాళ్ళు తలుపు చాటుకి తప్పుకుంటారు. పని చేసుకుని బతికే కూలీ జనం అలను వస్తూవుంటే పక్కకు వత్తిగిలి ఆగుతారు.

ఇదంతా ఆ గ్రామంలోని జనానికి ఆయన పట్లగల గౌరవం మూలాన్నే

ఆలా నడిచివస్తోన్న శ్రీరాములుకి శాంతమ్మ ఎదురుపడింది. తైల సంస్కారానికి మొహం వాచిన జుట్టు, చిరిగి మాసిపోయిన చీరతో చూడ్డానికే పిచ్చిదానిలా కనబడుతోంది. ఆదరించే



వారు, ఆదుకునేవారు లేక ఆ పిచ్చితనంతోపాటు బికారితనం కూడా కొట్టొచ్చినట్టు కనబడుతోంది.

వీధి మధ్యన నడుస్తోన్న శ్రీరాములుకి ఎదురుగా అతను నడిచినట్లే శాంతమ్మ నడుస్తోంది. ఇద్దరూ దగ్గరయ్యారు. ఇదంతా అరుగులమీద నిలబడినవాళ్ళు, తలుపు చాటున నిలబడినవాళ్లు చూస్తూనే ఉన్నారు.

శ్రీరాములు ఆమె చేరువయ్యాక తల ఎత్తి చూసాడు. ఆ స్థితిలో ఉన్న శాంతమ్మను చూసి ముందు కంగు తిన్నాడు. అతను తేరుకునే లోపలే,

"శ్రీరాములు బాబూ..నా కొడుకు ఎక్కడయినా కనపడ్డాడా? అదే బాబూ..నా శివా కనిపిస్తే రమ్మని చెప్పు. నువ్వు మా గ్రామ పెద్దవుకదా! అందుకని నీకు చెబుతున్నా. అసలు ఉన్నాడంటావా? నీకు తెలుస్తుంది...ఉన్నాడా? ఉంటే రమ్మని చెప్పు...నేను బతుకుతున్నదే వాడికోసం. మా శివా వస్తాడు. ఉంటేగా వచ్చేది" అంటూ వెళ్ళిపోయింది శాంతమ్మ.

"పాపం కొడుకు కనబడక పిచ్చిదయిపోయింది" అన్న జనం మాటలు శ్రీరాములు చెవికి సోకాయి.

బరువుగా నిట్టూర్చి నడివీధిలో ఆ పిచ్చిదానిముందు అలా నిలబడవలసి వచ్చినందుకు కాస్తసిగ్గుపడుతూ ముందుకు నడిచాడు శ్రీరాములు.

వంచిన తల ఎత్తకుండా వేగంగా ముందుకు నడుస్తున్నాడు.

శాంతమ్మ శ్రీరాములు ఇంటివైపు నడిచింది. గుర్రంమీద వస్తోన్న దొరయ్యకు నిర్భయంగా చేతులు చాపి అడ్డంగా నిలబడింది.

"దొరయ్య బాబూ... నా కొడుకు ఎక్కడున్నాడో నీకు తెలుసా?" అంటూ నవ్వింది శాంతమ్మ.

"నాకేం తెలియదు...తప్పుకో" అని తప్పించుకోబోయాడు దొరయ్య. మళ్ళీ గుర్రానికి అడ్డుతగిలింది శాంతమ్మ.

"తలుచుకుంటే నా కొడుకుని నువ్వు తీసుకురాగలవు. నేను వాడికోసమే బతుకుతున్నాను. వాడు బతికి ఉన్నాడంటావా! ఎవరైనా చంపేసేరంటావా... చెప్పవా'' అని బతిమాలినట్లు అడిగింది శాంతమ్మ.

చుట్టూ జనం తమను గమనిస్తున్నట్టు గమనించిన దొరయ్య శాంతమ్మను ఏమీ అనలేని స్థితిలో పడ్డాడు.

"సర్లే...తప్పుకో!''

"నా కొడుకు కనబడితే రమ్మని చెబుతావా?"

"చెబుతాలే''

"నువ్వే తీసుకురావాలి నా కొడుకుని. ఉంటేగా వాడొచ్చేది... ఉంటేగా నువ్వు తీసుకొచ్చేది"

"తప్పుకో" అంటూ శాంతమ్మను పక్కకునెట్టి గుర్రాన్ని అదిలించాడు.

నీరసంగా ఉన్న శాంతమ్మ తూలి పడింది.

సుబ్బారావు, కిట్టప్ప శాంతమ్మను లేవదీశారు. "మా ఇంటికిరా పిన్నీ! కాస్త అన్నం తిందువుగానీ" అన్నాడు కిట్టప్ప.

"మరి శివా వస్తాడా! మీరు తీసుకొస్తారా!'' అంది శాంతమ్మ.

"మేం తీసుకొస్తాంగా" అన్నాడు సుబ్బారావ్.

"అసలు ఉన్నాడా?"

"ఉన్నాడు'' అన్నాడు కిట్టప్ప కళ్ళ నీళ్లు పెట్టుకుని.

''అయితే పదండి... వాడు ఉన్నాడంటే వాడికోసం ఎన్నేళ్ళయినా బతుకుతాను. వాడికోసమే తింటాను, వాడికోసమే ఉంటాను. అసలు ఉంటేగా వచ్చేది'' అంటూ కిట్టప్ప మొహంలోకి చూసింది శాంతమ్మ.

కిట్టప్ప మొహం తిప్పేసుకుని శాంతమ్మని ముందుకు నడిపించాడు.

* * *

భూషణం ఇంటిముందు సమితి జీపుతో పాటు మరో చిన్న కారుకూడా ఆగివుంది.




హాలులో భూషణం, రామాచారి, పెళ్ళి కొడుకు, పెళ్ళికొడుకు తండ్రి, పెళ్ళి కొడుకు అక్క కూర్చునివున్నారు.

భూషణం పెళ్ళికొడుకు తండ్రితో, "రామాచారిగారు మీ సంగతి అంతా చెప్పారు'' అన్నాడు.

''మీ సంగతీ మాకు చెప్పారు'' అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి.

ధనమ్మ ఫలహారాలు తెచ్చి అతిథుల ముందు పెట్టింది.

"ఇవన్నీ ముఖ్యం కాదమ్మా! కలికితే అలకదు అంటారు. ముందు అమ్మాయిని తీసుకురండి" అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి.

"ఇప్పుడే తీసుకొస్తాను" అంటూ ధనమ్మ లోపలకు వెళ్ళింది.

"అయితే ఈ సంవత్సరంతో హౌస్ సర్జన్ అయిపోతుందా బాబూ?" భూషణం అడిగాడు.

"అవునండీ" పెళ్ళికొడుకు బదులు చెప్పాడు.

ఇంతలో ధనమ్మ చాలా నిరాడంబరంగా అలంకరించుకున్న గంగను తీసుకువచ్చి పెళ్ళివారిముందు ఓ కుర్చీలో కూర్చోబెట్టింది.

"హౌస్‌సర్జన్ అయిపోయాక ఏం చేద్దామనుకుంటున్నారు?" భూషణం మరో ప్రశ్న వేసాడు.

"పైచదువులకి స్టేట్స్‌కి వెళ్దామనుకుంటున్నాను."

"బావుంది...మంచి ఆలోచనే! పెళ్ళయితే అమ్మాయిని కూడా తీసుకు వెళతారా"

"ఇంకా ఏమీ అనుకోలేదండి"

"ఎంతవరకు చదువుకున్నావమ్మా?" పెళ్ళికొడుకు అక్క అడిగింది గంగను.

గంగ వంచిన తల ఎత్తకుండానే "పెద్దగా చదువుకోలేదండి" అంది.

"మా బావగారింట్లో పెద్ద ఘోషాండీ! ఆడవాళ్లు పొరుగూరు వెళితే ఇప్పటికి బండికి వెనకాముందూ తెరలు కట్టుకుని వెళతారు. ఆ ఊరి వీధి బడిలో ఐదవక్లాస్ దాకానేవుంది. అంతవరకే చదువుకుంది అమ్మాయి" అని సమర్థించాడు భూషణం.

"నువ్వేమయినా అడుగుతావా?'' పెళ్ళికొడుకు అక్క అన్నది పెళ్ళి కొడుకుతో.

''ఆఁ...ఏమడుగుతాంలే!" అంటూ "మీకు పాటలు వచ్చా?'' అని అడిగాడు గంగను.

"రావండి" అంది ముక్తసరిగా గంగ.

"పెళ్ళిచూపుల కోసమైనా ఒక్క పాట నేర్చుకోలేదా?'' అన్నాడు అతను. అందరూ నవ్వారు.

గంగ నవ్వలేదు. తల ఎత్తి చూడలేదు.

"అమ్మాయికి వల్లమాలిన సిగ్గండి'' అన్నాడు భూషణం.

''కనిపిస్తూనే వుందిగా'' పెళ్ళికొడుకు అక్క అంది.

"ఇంక నువ్వు లోపలకు వెళ్ళమ్మా" అని భూషణం అనగానే ధనమ్మ వచ్చి తీసుకెళ్ళింది.

''కట్నకానుకల గురించి మీరు ఆలోచించక్కర్లేదు. అబ్బాయి చదువుకి, మీ హోదాకు తగ్గట్టుగా అన్నీ జరిపిస్తాం. అబ్బాయి అమ్మాయిని కూడా విదేశాలకు తీసుకువెళితే ఆ ఖర్చు అంతా కూడా మేమే భరిస్తాం'' అన్నాడు భూషణం.

"భూషణంగారూ! రామాచారిగారు మీ సంగతి ముందుగానే చెప్పారు. శ్రీరాములు గారికైనా మీకైనా ఉన్నది ఈ ఒక్క ఆడపిల్ల, ఇంకో కుర్రాడేగదా!నాకు ఇష్టమే.

ఇంటికివెళ్ళి అబ్బాయినికూడా కనుక్కొని ఓ శుభముహూర్తాన ఖాయం చేసుకుందాం. తాంబూలాలు పుచ్చుకుందాం'' అంటూ లేచాడు పెళ్ళికొడుకు తండ్రి. మిగిలిన వాళ్లూ లేచారు. వీధివాకిలిదాకా పెళ్ళివార్ని సాగనంపారు భూషణం, ధనమ్మ.

ధనమ్మ తిరిగి లోపలకు వెళ్ళి, "పెళ్ళి కొడుకుని చూసావామ్మా?'' అంది గంగ తల నిమురుతూ

"లేదన్నట్టు'' తల అడ్డంగా ఊపింది గంగ.

అప్పటికే గంగ కళ్ళనిండా నీళ్లు తిరిగాయి.

''నీకు నచ్చలేదా?" ధనమ్మ అడిగింది.

"అసలు నేను చూస్తేగా"

"మరి ఎందుకు చూడలేదు?"

గంగ ధనమ్మ మొహంలోకి చూసింది జాలిగా.

''ఆడపిల్ల పెళ్ళి తన ఇష్టా యిష్టాలతో జరగదమ్మా! ఆడదాని జీవితం సాఫీగా సాగిపోవాలంటే స్వంతంగా ఆలోచించకూడదు. స్వంతమైన అభి ప్రాయాలు ఉండకూడదు. పెళ్ళయ్యేదాకా తండ్రి అదుపులోనూ, పెళ్ళి అయ్యాక భర్త అదుపులోనూ, తల్లి అయ్యాక కొడుకుల అదుపులోనూ ఉండిపోతే ఏ గొడవా ఉండదు" అంది ధనమ్మ.

పెళ్ళివారు వెళ్ళిపోయారు. రామాచారి, భూషణం ఇంట్లోకి వచ్చారు.

"నాలుగు రోజుల్లో స్వామివారి కళ్యాణం. ఆరోజునే రుక్మిణీ కళ్యాణం నృత్యనాటిక కూడా ఏర్పాటు చేసాం. తమరు ఎదరుండి జరిపించాలి" అన్నాడు రామాచారి.

''భలేవారే...దేవుడి కార్యం గురించి మీరు చెప్పాలా! అది నా బాధ్యతకాదూ" అన్నాడు భూషణం.

"పెద్దవాళ్లతో ముందుగా చెప్పడం నా బాధ్యతగదా" అన్నాడు రామాచారి నవ్వుతూ.

"ఇంతకీ ఈ సంబంధం.." అన్నాడు భూషణం.

"మీరు, బావగారు ఖాయం అనుకుంటే ఖాయమే. ఇలాంటి సంబంధం కావాలనుకుంటే మాత్రం దొరుకుతుం దటండీ వాళ్ళకి! మరిక నేను వస్తాను. ఉత్సవం తాలూకు ఏర్పాట్లు అన్నీ చూసుకోవాలి" అంటూ రామాచారి వెళ్ళిపోయాడు.

* * *

వేణుగోపాలస్వామి ఆలయంలో గర్భ గుడి వెలుపల ధనమ్మ, గంగ నిలబడ్డారు. ఎదురుగుండా కాస్త దూరంలో స్టేజి కట్టివుంది. ఆరోజే స్వామివారి కళ్యాణ మహోత్సవం కావడంచేత జనం బాగా వున్నారు. గుడి అంతా హడావిడిగావుంది.

''అమ్మా గంగా...పుణ్యం కొద్దీ పురుషుడు అంటారు. మంచివాడు, నిన్ను సుఖపెట్టేవాడు భర్తగా కావాలని దేవుణ్ణి కోరుకో. రుక్మిణీ కళ్యాణం రోజున కోరిన కోరికల్ని స్వామివారు కాదనరట" అంది ధనమ్మ.

గంగ కళ్ళు మూసుకుని చేతులు జోడించి మొక్కుకుంది.

"ఏమని మొక్కుకున్నావ్?'' అంది ధనమ్మ.

"మనసుకు నచ్చినవాడిని ఇమ్మన్నాను. లేదంటే ఈ తనువునే తీసుకుపొమ్మ న్నాను'' అంది గంగ.

చిన్న పూజారి మంత్రాలు చదివి నీరాజనం అందించాడు. ఇద్దరూ హారతి




కళ్ళకద్దుకున్నారు. కుంకుమ తీసి బొట్టు పెట్టుకున్నారు.

"రామాచారిగారేరి బాబూ?" చిన్న పూజార్ని అడిగింది ధనమ్మ.

''రుక్మిణీ కళ్యాణం నాటకం కదండీ! మన రామాచారిగారే సూత్రధారుడు'' అన్నాడు చిన్న పూజారి.

రంగస్థలంతెర తొలిగింది. రామాచారి సూత్రధారునిగా రంగస్థలంమీదకు వచ్చి నాటకం గురించి ప్రస్తావన మొదలు పెట్టాడు. చివరికి "రుక్మిణీ కళ్యాణ కథా సంగ్రాహం ఎట్టిదన్న'' అని రామాచారి గారు అనేసరికి నాటకంప్రారంభమయింది

రుక్మిణి తన చెలికత్తె ద్వారా తమ పురోహితునికి కబురు పంపి కృష్ణుని వద్దకు ప్రేమలేఖ పంపింది.

అలా నాటకం జరుగుతోంటే గంగ కృష్ణునిలో శివాను వూహించుకుంది. రుక్మిణిలో తనను ప్రతిష్ఠించుకుంది. తాను రుక్మిణి అయి, శివా కృష్ణుడయి కథా సంవిధానం సాగిపోతున్నది.

ఆ కథలోకి దొరయ్య శిశుపాలుడుగా వచ్చాడు. చివరకి శ్రీకృష్ణుడు అందర్నీ చిత్తుగా తన్ని రుక్మిణీదేవిని తీసుకుని విజయవంతంగా వెళ్ళిపోయాడు.

నాటకం అయిపోయింది.

జనం చప్పట్లు కొట్టారు.

గంగ ఈ లోకంలోకి వచ్చింది. వచ్చే ఏడుపును ఆపుకోలేక వోణీ కొంగుని నోట్లో కుక్కుకుని ఇంటికి వెళ్ళిపోయింది.

పక్కన గంగ కనపడకపోవడంతో ధనమ్మ కూడా లేచి వెళ్ళిపోయింది.

* * *

గంగ పెరటివైపు వరండాలో పర ధ్యానంగా పడుకునివుంది.

వంట ఇంట్లోంచి బయటకొచ్చిన ధనమ్మ "అలా చాపమీద దిండు కూడా లేకుండా, తలకింద చెయ్యి పెట్టుకొని ఆ పడుకోవడం ఏమిటమ్మా?'' అంది.

"ఫరవాలేదు అత్తయ్యా! ఇలా బాగానే వుంది'' అంది గంగ.

ధనమ్మ తన పనిలో తను హాలులోకి వెళ్ళిపోయింది.

దుక్కోడు వచ్చి, ''అమ్మాయిగోరూ! కనకాంబరాలుతెచ్చానండి. మన పొలంలో పూసిన పూలండి'' అంటూ ఆమె పక్కనే చాపమీద పైపంచిలోంచి దిమ్మరపోసాడు.

గంగ కళ్ళు తెరచి చూసింది. ఆ పూలను ఒక్కొక్కటే జాగ్రత్తగా పేర్చడం మొదలుపెట్టింది. అలా 'శివా' అని పేర్చింది. ఓసారి తృప్తిగా చూసుకొంది. ఆమెకు తెలియకుండానే ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. 'శివా' అన్న పూల పేరు స్పష్టంగా కనిపించడంలేదు కంటికి.

బక్కోడు ''అమ్మగోరూ'' అని పిలిచాడు.ఏమిటన్నట్లు కన్నెత్తి చూసింది గంగ.

"పచ్చబొట్టు పొడిసే మడిసి కావాలన్నారుకదండీ...వీధిలో కనపడిందండి. మనింటికి లాక్కొచ్చానండి" అన్నాడు. బక్కోడు.

''అరుగుమీద మావయ్య ఉన్నారా" గంగ అడిగింది.

"లేరండీ .... పొలంలో వున్నారు" అన్నాడు బక్కోడు.

''సరే.,నువ్వువెళ్ళు "అని, బక్కోణ్ణి పంపివేసింది గంగ.

తనముందు పచ్చబొట్టుపొడిచే మనిషి నిలబడి వుంది.

"నువ్వు ఏయే పచ్చబొట్లు పొడవ గలవు?'' గంగ అడిగింది.

"ఒక పేటమ్మా! బద్రాద్రి రాములోరినా, తిరుపతి ఎంకన్నబాబునా, కాశీయిశవనాధుడినా, బెజవాడ కనక దురగమ్మనా, హనుమంతులోరినా, సూరీ నారాయనమూర్తినా, చంద్రయ్యబాబునా? తమరు ఏది కోరుకుంటే అది అట్టా అచ్చుగుద్దినట్టు దించగలను తల్లీ" దండకం చదివింది పచ్చబొట్టు మనిషి.

"బొమ్మలొద్దులే! ఈ పేరు పొడవాలి" ఎదురుగా పూలతో తీర్చిదిద్దిన 'శివ' పేరును చూపించింది గంగ.

"అమ్మో ... ఇంచక్క ముత్తాలల్లె దిద్దినావు తల్లీ! ఏడ దించమంటావు? కుడి సేతిమీదనా ఎడం సేతిమీదనా?" పచ్చబొట్టు మనిషి అడిగింది.

"ఇక్కడ!" కుడిచేయి చాపింది గంగ.

పచ్చబొట్టుమనిషి సూదులూ, రంగు సిద్ధం చేసుకొని, చేయి ఒకసారి పామి, "కాతంతసురుకుసురుకు మంటది తల్లి. ఓర్సుకోవాల" అంది.

"ఫరవాలేదులే ... నువ్వు కానియ్" ధైర్యంగా అంది గంగ.

పచ్చబొట్టు మనిషి పొడవడం మొదలు పెట్టింది. మొదటి రెండు మూడు సూది పోట్లకు పళ్ళుబిగించి బాధను భరించ డానికి ప్రయత్నించింది గంగ. బాధ తట్టుకోవడం కష్టమే అనిపించింది. చివరికి మానసికంగా సిద్ధపడిపోయి, శివానే తలుచుకుంటూ, కళ్ళు మూసుకొని అలాగే వుండిపోయింది. ఆ మాటా ఈ మాటా చెబుతూ, ఏవేవో దేవుళ్ళపేర్లు వల్లిస్తూ పచ్చబొట్టు పొడవడం పూర్తిచేసింది ఆ మనిషి.

ఆ మనిషికి డబ్బులిచ్చి పంపించేసింది గంగ.

తన ముంజేతిమీదవున్న పచ్చబొట్టును చూసుకుంది గంగ. 'శివ' అని తనలో తానే చదువుకుంది. నవ్వుకుంది. ముద్దు పెట్టుకుంది.

"నీ పేరు ఇంత స్పష్టంగా ముంజేతి మీద వుండగా ఇంకా నన్ను ఎవరు పెళ్ళాడతారో చూస్తాను" అనుకుంది గంగ.

* * *

ఓ వారం రోజులోకి దొరయ్య వచ్చాడు భూషణాన్ని కలవడానికి.

భూషణం, దొరయ్య అరుగుమీద కూర్చున్నారు కుర్చీల్లో.

కాసేపు ఏవో పిచ్చాపాటీ మాట్లాడు కున్నారు ఇద్దరూను.

"కాఫీ పంపించవోయ్ ధనం... బావగారు వచ్చారు" లోపలికివినిపించేలా చెప్పాడు భూషణం.

"దుక్కోడు చెప్పాడు...గంగ పట్టు కొస్తోంది" లోపలినుంచి బదులు చెప్పింది ధనమ్మ.

మరుక్షణంలోనే గంగ రెండు గ్లాసులతో కాఫీ పట్టుకొని అరుగుమీదకు వచ్చింది.

ఎడమచేతిలోని గ్లాసు భూషణానికి ఇచ్చింది.

కుడిచేతిలోనిగ్లాసు దొరయ్యకి అందిం చింది. గ్లాసు అందుకోబోతున్న దొరయ్య కంటికి గంగ ముంజేతిమీద 'శివ' అన్న పచ్చబొట్టు అగుపించింది.

దొరయ్య వళ్ళు మండిపోయింది. కోపంతో కంపించిపోయాడు.ఆ కాఫీగ్లాసు అలాగే విసిరేసి ప్రళయరుద్రుడై పోయాడు.

గంగ జబ్బపట్టుకొని బరబరా అరుగు మీదనుంచి లోపలికి లాక్కుపోయాడు.




"బావగారూ... ఏమైంది?" అంటూ భూషణం వెంటపడ్డాడు.

"మీకు తెలీదు..వూరుకోండి" అని, గంగ ముఖం పైకెత్తి "ఏమిటిది" అని గర్జించాడు దొరయ్య.

గంగ మాట్లాడలేదు. నిర్భయంగా దొరయ్య కళ్ళల్లోకే చూస్తూ నిలబడి పోయింది.

"మాట్లాడవేం? ఏమిటిది??" మళ్ళీ గర్జించాడు దొరయ్య.

"పచ్చబొట్టు" ముక్తసరిగా బదులు చెప్పింది గంగ.

"ఆ సంగతి నాకు తెలీదా? ఎందుకు పొడిపించుకున్నావు చేతిమీద??"

"కావాలనే"

"అంటే...?"

"నాకు ఇష్టంకనక"

"ఆ తలమాసిన పైలరు వెధవంటే నీకిష్టమా. ఇంత జరిగాక కూడా ఆ వెధవ పేరు చేతిమీద పొడిపించుకుంటావా! అసలు నీ వుద్దేశం ఏమిటే?"

"నేను శివాను మరచిపోలేను. నన్ను ఎవరూ పెళ్లాడకూడదనే ఇలా పొడిపించుకున్నాను. ఇది చూసి నన్నింక ఎవరు పెళ్ళాడతారు?" అంది గంగ మొండిగా, అమాయకంగా.

దొరయ్య పూనకం వచ్చినవాడిలా ఆవేశంతో వూగిపోయాడు. తన కళ్ళ ముందు పుట్టిపెరిగిన పిల్ల ఇంత ధైర్యంగా తనకి సమాధానం చెప్పడం సహించలేక పోయాడు. అదే పరాయివాళ్ళయితే ఈ పాటికి కాలో, చెయ్యో విరిచేసేవాడే. అన్నగారి కూతురు కావడంతో, ఇంటి ఆడబిడ్డ కావడంతో ఏమీ చేయలేక, ఉక్రోషాన్ని ఆపుకోలేక గంగ చెంప ఛెళ్ళుమనిపించాడు. గంగ కెవ్వున అరచి పడి పోయింది.

"బావగారూ ... ఏమిటీ దారుణం" అంటూ అడ్డం వెళ్ళబోయాడు భూషణం.

"ఆగండి! ఇది మా ఇంటి గౌరవానికి సంబంధించిన వి ష య ం" అంటూ, ఎదురుగా బల్లమీదవున్న కొడవల్ని లాక్కొని గంగను లోపలి గదిలోకి లాక్కుపోయి తలుపులు మూసేసాడు దొరయ్య.

ఇంతలో ఈ హడావిడికి లోపలినుంచి వచ్చిన ధనమ్మ" గంగను చంపేస్తాడేమోనండీ! దారుణం మనిషిలా వున్నాడూ" అంది భూషణంతో.

భూషణం, ధనమ్మ గది తలుపులు బాదుతూ తలుపు తెరవమనీ, గంగను ఏమీ చేయవద్దనీ అరుస్తూనే వున్నారు.

లోపల దొరయ్య చేతిలోని కొడవల్ని చూసి గంగ పులిముందు మేకపిల్లలా వణికిపోయింది. మరుక్షణంలోనే గుండె రాయిచేసుకొని ధైర్యంగా నిలబడింది.

"నువ్వు వాణ్ని మరచిపోలేవా? ఇలా చేతిమీద పచ్చబొట్టు పొడిపించుకుంటే నిన్నింకెవ్వరూ పెళ్ళాడరనుకుంటున్నావా. చూద్దువుగాని - నువ్వు ఆడ్ని ఎలా మరిచిపోయేలా చెయ్యాలో, ఆడి పేరు నీ చేతిమీద లేకుండాఎలా చెయ్యాలోనాకు బాగా తెలుసులేవే" అంటూ గ ం గ చే తి ని లాక్కొని కొడవలితో 'శివా' అని వున్న పచ్చబొట్టుమీద రెండు కోతలు కోసాడు. తలుపుతీసి కొడవలి విసిరేసాడు. బయట కెళ్ళి గుర్రం ఎక్కాడు దొరయ్య.

"పిల్లని చంపేసినట్టున్నాడండీ!" అంటూ ధనమ్మ లోపలికెళ్ళింది. వెనకే భూషణమూ వెళ్ళాడు. రక్తం కారుతున్న గంగ చేతిని చూసి ధనమ్మ పమిటకొంగు చింపి కట్టుకడుతోంది.

"నేను చూడనేలేదు. ఎందుకు చేసావమ్మా ఈ పని" అంది ధనమ్మ.

"కావాలనే చేసాను" గంగ బదులు చెప్పింది.

"చూడు ఇప్పుడేమైందో"

"ఏమైందీ...చేతిమీద రాత చెక్కెయ్యగలిగాడుగాని గుండెల్లోని రూపాన్ని చెరిపెయ్యగలడా?" అంది గంగ మొండిగా.



"లంకను పుట్టినవాళ్ళంతా రాక్షసులే అన్నట్టు మీరందరూ మొండిఘటాలే నమ్మా!'' అంది ధనమ్మ కట్టు పూర్తి చేసి.

గంగ ఓ చిరునవ్వు నవ్వి, "ఒకే రక్తం, ఒకే వంశం కదా అత్తయ్యా" అంది.

* * *

గంగ మేనమామగారింటికి వెళ్ళి నెల రోజులు పైన కావొస్తోంది. అప్పటినుంచి చిన్నా వంటరివాడయ్యాడు. బామ్మతోటి, పినతల్లి వర్ధనమ్మతోటి కాసేపు కాలక్షేపం చేసినా తన అక్క గంగతో ఉన్నప్పుడు



ఉన్నంత హాయిగాలేదు. గంగ దగ్గర చిన్నాకు బాగా చనువు. తల్లి పోయినప్పటి నుంచీ గంగ తన తమ్ముడికి తల్లిప్రేమను చవిచూపించింది. కాసేపు ఇద్దరూ ఆడుకునే వారు. అంతలో కజ్జాకు దిగేవారు. చిన్నా మూతి ముడుచుకుంటే గంగ బతిమాలి లాలించి నవ్వించేది. చిన్నా ఎన్ని ఆటల్లో ఉన్నా వేళకు పట్టుకుని అన్నం పెట్టేది.

అటువంటి అక్క కళ్ళముందు లేక పోవడంతో చిన్నా ఒంటరివాడయ్యాడు.

నాగమ్మ చిన్నాను వెయ్యికళ్ళతో చూసుకున్నా చిన్నాకు అక్కలేని లోటు లోటుగానే ఉంది.

"బామ్మా...అక్క ఎప్పుడొస్తుంది'' అంటూ ఒకటి రెండుసార్లు చిన్నా అడిగాడు కూడా.

"వచ్చేవారమో ఆ పైవారమో వచ్చేస్తుందిరా" అంటూ సర్దిచెప్పేది నాగమ్మ.

"అక్క పెళ్ళిచేసుకుని అత్తారింటికి వెళ్లిపోతే ఏంచేస్తావు?'' అనేది వర్ధనమ్మ.

"అత్తారింటికి వెళ్తే అక్కడే ఉండి పోతుందేమిటి? పండగలకి బావగార్ని తీసుకుని వస్తుందిగదా''అనేవాడు చిన్నా.

ఏదియేమైనా ప్రస్తుతం చిన్నాకు ఒంట్లో బాగోలేదు. తరచు దగ్గువస్తోంది. కాస్త జ్వరంకూడా తగులుతోంది.

ఓసారి పట్నం తీసుకెళ్లి చిన్నోణ్ణి ఇంగ్లీషు డాక్టరుకు చూపిస్తే మంచిది అనిపించింది నాగమ్మకు.

శ్రీరాములుతో చెప్పి పట్నం వెళ్ళ డానికి బండి ఏర్పాటు చేయించింది. కొండ బండిమీద నాగమ్మ, చిన్నా పట్నానికి వెళ్లారు.

డాక్టరు చిన్నాను పూర్తిగా పరీక్ష చేయడానికి ఆరోజు, మర్నాడు హాస్పటల్‌లోనే ఉండమన్నాడు. గది ఇచ్చాడు హాస్పటల్‌లోనే. అందుచేత ఓ చెట్టునీడలో బండిని విప్పేసి కొండా నాగమ్మకు, చిన్నాకు కావల్సిన సదుపాయాలు చూడ వలసి వచ్చింది.

చిన్నా కోసమని పళ్లు, రొట్టె తేవ డానికి కొండ బజారుకు వెళ్లాడు.

కొండ ఓ షాప్‌లో రొట్టెకొంటున్నాడు.

ఆ పక్కనే ఉన్న మరో ఫ్యాన్సీ షాపులో శివా గుండీలు, దారపుబళ్ళు కొంటున్నాడు. శివ కొండను చూసి పలకరించబోయి మానేసాడు.

అక్కడనుంచి తప్పించుకుని పోవ డానికి ప్రయత్నించాడు. కానీ, ఇంతలోనే కొండ శివాను చూశాడు.

''ఏమిటి శివయ్యబాబూ...నువ్విక్క డున్నావా! నువ్వగపడ్డంలేదని మీ అమ్మ ఊరంతా గాలించేసి కనపడిన మడిసినల్లా నీ గురించే అడుగుతావుంది. కొంతమంది పిచ్చెక్కిందేమో అనుకుంటున్నారు. అసలు నువ్వు ఊరొదిలి పట్నానికి ఎందుకొచ్చేసావయ్యా'' అన్నాడు కొండ.

'అయితే కొండాకు జరిగిన సంగతి తెలియదన్నమాట' అనుకున్నాడు శివ. కొంత ధైర్యమొచ్చింది.

''ఇంతకీ మా అమ్మ ఎలావుంది?'' శివా అడిగాడు.

''బాగా సిక్కిపోయిందయ్యా! ఎక్క డెక్కడో నీకోసం తిరుగుతా ఉంది. నీకోసం బాగా బెంగెట్టుకొని ఉంటుంది. పాపం చెప్పాచెయ్యకుండా ఊరొదిలి వచ్చేసావేటయ్యా'' అన్నాడు కొండా.

''ఏదైనామంచిపని చూసుకుందామని" అన్నాడు శివ.

"ఏదైనా పని చూసుకునేందుకు వెళ్ళేటప్పుడు చెప్పివెళ్ళొచ్చుగా! ఎవత్తినో





లేవదీసుకుపోయినట్టు ఎవరికీ సెప్పకుండా సెయ్యకుండా వచ్చేసావ్''

''సర్లే.... నువ్వెందుకొచ్చావ్ పట్నానికి?''

"సవారీబండి తోలుకొచ్చాను''

"చిన్నమ్మాయిగారు వచ్చారా?"

''అదిగో. వూరెళ్లి వచ్చేసావ్...నీకే సంగతీ తెలియదు''

''ఏమైంది అమ్మాయిగారికి?'' ఆత్రుతగా అడిగాడు శివ.

''ఆరికేమవుద్దీ! మేనమామగారి ఇంటికి నేనే తీసుకెళ్లి దిగబెట్టాను. పెళ్ళిడొచ్చిం దిగా.అక్కడ సూత్తున్నారు సంబంధాలు"

''ఏ ఊరు? అమ్మాయిగారి మేనమామ గారి వూరా?''

"అ...గుమ్మలేరు. ఏటిపట్టునే"

''మరైతే బండిలో ఎవరొచ్చారు?"

''ఏటి...నీకు సెప్పలేదేటి నేను"

"ఎప్పుడు చెప్పావు''

"చిన్నయ్యగారికి జ్వరమొత్తే పెద్దమ్మగారు ఆసుపత్రికి తీసుకొచ్చారు"

"ఏ ఆసుపత్రి?''

"మిషన్ ఆసుపత్రి. నేను వెళు న్నానురా గదిచూపిత్తాను" అంటూ కొంత ముందుకు నడిచాడు. వెనకే శివ.

ఇద్దరూ ఆసుపత్రికి చేరారు.

కొండ చిన్నావున్న గదిలోకి అడుగు పెడుతూ చిన్నా పక్కనే కూర్చున్న నాగమ్మతో, "మన ఊరి కుట్టుమిషను శివయ్య ఇక్కడే వుంటున్నాడండీ! బజారులో అగపడ్తే తీసుకువచ్చేసాను" అన్నాడు.

శివా ఇక్కడే వుంటున్నాడనే మాట వినగానే నాగమ్మ షాక్ తిన్నదానిలా చూసింది.

కొండ పక్కనే శివా కనిపించాడు. ఒక్క క్షణం తన కళ్ళని తనే నమ్మ లేకపోయింది.

మరుక్షణంలోనే కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఏం జరిగిందో నాగమ్మకు తెలుసు. బతికి బట్టకట్టి మళ్లీ తన కళ్ళముందు శివా ఎలా నిలబడ్డాడో అర్థం కావడంలేదు.

నాగమ్మ కొండను పాలు తెమ్మని ఫ్లాస్క్ ఇచ్చి పంపించింది. కొండ వెళ్ళి పోయాక శివ చిన్నాను చూసి, "బాగా చిక్కిపోయాడు.జ్వరమాండీ?" అన్నాడు నుదుటిమీద చెయ్యివేసి చూస్తూ.

చిన్నా మంచి నిద్దట్లో వున్నాడు.

"ఇంతకీ నువ్వు మళ్లీ మామూలు మనిషివి ఎలాఅయ్యావు బాబూ!"నాగమ్మ అడిగింది శివాను ఎంతో ఆప్యాయంగా.

తను అంటే నాగమ్మకు కోపంలేదని నిర్ధారణ చేసుకున్నాడు శివ - ఆమె ధోరణినిబట్టి.

ఆ తర్వాత జరిగింది చెప్పడం మొద లెట్టాడు. "గుర్రంమీద నన్ను మోసుకెళ్లి దొరయ్యగారు కాల్వలో పారేసారు. అసలు నాకు ఈతరాదు. పైగా ఓ కాలు, చెయ్యి కదలడంలేదు. రెండుసార్లు అడుక్కిపోయి పైకి తేలాను. మూడవసారి కూడా మునిగి తేలితే పోయినట్టేనండి. ఇంతలో ఓ దొర బోటు సరంగులు నన్ను నీళ్ళల్లోపడేసిన చప్పుడు విని వాళ్లు నీళ్ళల్లోకి దూకి నన్ను రక్షించారండి! దొరబోటుమీద వెల్లకిలాను, బోర్లాను పడుకోబెట్టి నేను మింగిన నీరు కక్కించారండి. ఇంతలో బోటులోని దొరగారు అడేనండి ఇంజనీరు గారటండీ బయటకొచ్చి చూసారండీ. ఏం జరిగిందని అడిగారండి. ఎవరో కొట్టి కాల్వలో పారేసారని చెప్పారండి వాళ్లు. ఆయన బోల్డంత జాలిపడిపోయాడండీ. నన్ను పట్నం తీసుకొచ్చి వైద్యం చేయిం

చారండి. తర్వాత మనిషి తోడిచ్చి పుత్తూరు పంపించి ఈ ఎడమ కాలు, కుడి చెయ్యి బాగుచేయించారండీ! ఇరవై ఒక్కరోజులు కష్టేసనండీ! ఇప్పుడు ఫర్వాలేదండి ... కాలు, చెయ్యి పనిచేస్తున్నాయి. అందుకని ఇంకా ఆ ఇంజనీర్ గారి మీదే ఆధారపడటానికి మనసొప్పక వేరే షాప్‌లో మిషన్‌మీద పనిచేయడానికి మొన్ననే కుదిరానండీ" అన్నాడు శివ.

"పోనీలే బాబూ... బాగున్నావు. ఆ గొడవ జరిగాక రెండు రోజులపాటు గంగ పచ్చి మంచినీళ్ళు ముట్టుకోలేదు. అలా కన్నీరు కారుస్తూనే ఉంది. అయిందేదో అయిపోయింది. నువ్వు మాత్రం ఊళ్ళోకి రాకు. మా దొరయ్య దసలే పాము పగ. మీ అమ్మని నీదగ్గరకు నేనే పంపిస్తాను" అని సలహా ఇచ్చింది నాగమ్మ.

ఇంతలో కొండా వచ్చాడు – ప్లాస్క్ పట్టుకుని.

"సరే ... నువ్వింక వెళ్ళిరా బాబు" అంటూ శివాను పంపించేసింది నాగమ్మ.

"నేనూ వత్తున్నాను ఉండు" అన్నాడు కొండా.

"నువ్వు ఆగరా...నీతో పనుంది" అంటూ కొండాను ఆపింది. కొండా "సరేనని" నిలబడిపోయాడు.

"శివా కనబడినట్టు మన ఊళ్ళో ఎవరితోటీ అనకు. ముఖ్యంగా మా దొరయ్యతో అసలు అనకు"

"సరేనండి...ఆడి అమ్మతో సెప్పొచ్చాండీ!"

"నువ్వు ఎవరిదగ్గరా ఆ శివా గొడవ ఎత్తకు"

"ఎందుకనండీ?"

"దానికి చాలా గొడవలున్నాయిలే"

"సరేనండి... చెప్పొద్దంటే చెప్పను" అంటూ బయటకు వెళ్ళిపోయాడు కొండా.



## 10

నాగమ్మ, చిన్నా హాస్పిటల్ నుంచి తిరిగొచ్చేసారు.

కొండా కర్ర చంకలో పెట్టుకుని కిట్టప్ప, సుబ్బారావు కూర్చున్న అరుగు మీదుగా పొలం పోతున్నాడు.

అపుడే శాంతమ్మ ఎదురైంది.

"ఇదిగో....మా శివా కనపడ్డాడా నీకు ఎక్కడైనా?నిజం చెప్పు. నీకు కనపడ్డాడు కదూ" అంటూ పట్టుకుంది కొండను శాంతమ్మ.

"అయ్యబాబోయ్....నీకెలా తెలిసిపోయిందమ్మా" అనుకున్నాడు నెమ్మదిగా తనలో.

"ఉన్నాడూ...నా కొడుకు వస్తాడూ"

"ఉన్నాడులే. నే చెప్పకూడదు. చెప్తే గొడవలొస్తాయి" అని శాంతమ్మని పదిలించుకుని పారిపోబోయాడు కొండ.

కిట్టప్ప ఇది గమనించాడు. పారిపోతున్న కొండాను, "ఒరేయ్ కొండా! ఈ పొగాకు కాడ వాసన చూడు" అంటూ మంచి పొడవైన లంక పొగాకును ఊపుతూ పిలిచాడు.

మంత్రం వేసినవాడిలా కొండ వాసన చూస్తూ కిట్టప్ప దగ్గరకొచ్చేసాడు.

సుబ్బారావు, "ఏం గొడవరాదుగానీ

చెవిలో చెప్పేయ్‌రా" అంటూ కొండను దగ్గరకు లాగాడు.

కిట్టప్ప కొండ చేతిలో మరో పొగాకు కాడ కూడా పెట్టాడు.

కొండ పెదవులు కదిలాయి. నోరు తెరుచుకుంది. చెప్పాల్సిందేదో చెప్పేసి పారిపోయాడు వాడు.

ఇంతలో దొరయ్య గుర్రమెక్కి వచ్చాడు. శాంతమ్మ అతన్ని చూసి-

"దొరయ్య బాబూ ఎక్కడ నా శివా?" అంటూ వెంటబడింది. దొరయ్య పళ్లు పటపట కొరికాడు. కళ్లు నిప్పురవ్వలయ్యాయి. గుర్రాన్ని వెనక్కి తిప్పుకుని వెళ్ళిపోయాడు.

ఆ వెనకే శాంతమ్మ దొరయ్య వెంటపడింది పరిగెడుతూ.

దొరయ్య తన మకాందగ్గరకు వెళ్లాడు. గుర్రందిగి చుట్టూ పరకాయించాడు. జనం చేలల్లో పనిచేస్తున్నారు. అల్లంత దూరాన శాంతమ్మ కనిపించింది.

గుర్రానికి మాలిష్ చేస్తున్న తన పాలేరును పిలిచాడు.

'చిత్తమండి' అంటూ పాలేరు వచ్చాడు.

"ఒరేయ్.. ఆ పిచ్చిదాన్ని పిలుచుకురారా! ఎన్నిరోజులక్రితం భోంచేసిందో పాపం! నా భోజనం దానికి పెట్టెయ్ ఇక్కడకు తీసుకొచ్చి" అన్నాడు.

ఆ పాలేరు శాంతమ్మను తీసుకురావడానికి వెళ్లాడు.

దొరయ్య మకాంలోకి వెళ్లాడు. తన క్యారేజి విప్పాడు. పక్కనేవున్న ఎలకల మందు బస్తాలోంచి గుప్పెడు మందుతీసి పులుసులో కలిపాడు. అన్నీ సర్దేసి చేయి కడుక్కుని బయటకు వచ్చేసాడు.

శాంతమ్మను తీసుకొచ్చాడు పాలేరు. అరటిఆకు పరచి అన్నం వడ్డించాడు. ఆకలిగా వట్టి అన్నమే తినేస్తోంది శాంతమ్మ. అన్నంలో పులుసు పోసాడు.

ఆబగా తింటూనే ప్రాణం వదిలేసింది శాంతమ్మ.

చచ్చిపడున్న శాంతమ్మ దగ్గరకు వచ్చాడు దొరయ్య.

పాలేరు అక్కడే నిలబడ్డాడు.

"ఎలా పోయిందిరా?''

"అలా పులుసు అన్నం నాలుగు ముద్దలుతిని అలా పడిపోయి గిలగిల్లాడిందండి! నేను నూతిదగ్గరకెళ్ళి మంచి నీళ్ళట్టుకొచ్చేసరికి అంతా అయిపోయిందండి" అన్నాడు భయపడుతూ పాలేరు.

"సరేలే... అన్నం నీచేత్తో పెట్టావు. నలుగురికీ తెలిస్తే నువ్వు బొక్కలోకి పోతావు. పది పదిహేను రోజులు కూడు లేకుండా ఒక్కసారి ఆకలిమీద తినేత్తే అలా పోతారుగాబోలు. ఆనవాలులేకుండా దాన్ని తీసుకెళ్ళి ఆ మురికి కాల్వలో పారెయ్యి. కాలుజారిపడి సచ్చిందనుకుంటారు. ఆ అన్నం పట్టుకెళ్ళి చేలో చల్లేసి సుబ్బరంగా గిన్నెలు కడిగెయ్" పురమాయించి వెళ్ళిపోయాడు దొరయ్య.

మరునాటి ఉదయాన్నే శాంతమ్మ చావువార్త ఊరంతా పాక్కింది.

మురికికాలువ గట్టునే నడిచివెళ్తున్న వాళ్ల ఎవరో చూసారు. ఆ నోటా ఆనోటా కిట్టప్పకీ, అలా మిగిలిన ముగ్గురు స్నేహితులకూ తెల్సింది. కూడబలుక్కుని వెళ్ళి శవాన్ని తీసుకొచ్చి శాంతమ్మ ఇంటి అరుగుమీదే పడుకోపెట్టారు.

శవాన్ని పడుకోపెట్టిన మరుక్షణమే, "నేనొచ్చేదాకా శవానికి నిప్పుపెట్టొద్దు" అంటూ వెళ్ళిపోయాడు సుబ్బారావు.

మిగిలిన ముగ్గురూ శవం దగ్గర కూర్చున్నారు. తలదగ్గర దీపంపెట్టారు. ఒక్కొ

క్కళ్ళే చూసి వెళ్తున్నారు.

గుర్రంమీద దొరయ్య వచ్చాడు.

"ఎప్పుడు పోయిందిరా?" అన్నాడు శాంతమ్మ శవాన్ని గుర్రంమీదనుంచే చూసి దొరయ్య.

"ఎప్పుడుపోయిందో కానీ మాకు ఈవేళ పొద్దున్నే తెల్సింది" అన్నాడు కిట్టప్ప.

"మరింకా కూర్చున్నా రెందుకు! పుల్ల కావల్సిస్తే మాఇంటి దగ్గరుంది. తీసుకెళ్ళి తగలేసేయండి" అన్నాడు దొరయ్య.

"సుబ్బారావు రాలేదు" అన్నాడు అబద్దం.

"సరే...త్వరగా కానిచ్చేయండి! అలా ఊళ్లో శవం అట్టేసేపు ఉండకూడదు" అంటూ గుర్రాన్ని అదిలించాడు.

పట్నం వెళ్ళిన సుబ్బారావు తిరిగి వచ్చేసాడు. సుబ్బారావు తిరిగి వచ్చే సరికేకిట్టప్ప, అబద్ధం మిగిలిన ఏర్పాట్లన్నీ చేసారు. పాడికట్టె సిద్ధంగా వుంది.

"ఇంక కానివ్వండి ... ఆవిడకోసం వచ్చేవారెవరున్నారింక" అన్నాడు సుబ్బారావు.

శాంతమ్మ పాడి లేచింది.శివా నలుగురి స్నేహితులూనాలుగు కొమ్ములూ కాశారు. వెనకవూరి చాకలి వున్నాడు.చుట్టుపక్కాల అమ్మలక్కాలు 'ఆ కొడుకు మీదే బోల్డన్ని ఆశలు పెట్టుకు బతికింది. తన్ని బూడిద చేసాడనుకుంది పాపం. ఎటు పోయేడో, ఏమైపోయాడో. ఆ అరుగు మీద కూర్చునే కుర్రోళ్లే దిక్కయారు చివరికి. ఎవరి బతుకు ఎలా ముగిసి పోతుందో ఎవరికెరుక' అనుకున్నారు.

చుక్క కళ్ళ నీళ్ళ తిర్రిగాయి. ఎదురింటి వరండాలోంచి నాగమ్మ శవాన్ని చూసి కళ్ళు వత్తుకుంది.

"గోవిందా ... గోవిందా" అంటూ శవాన్ని వూరి కాటివైపు మోసుకు పోయారు ఆ నలుగురు స్నేహితులూ.

కాటి దగ్గర శవాన్ని దింపారు. పుల్ల బండికోసం ఎదురుచూస్తున్నారు.

అప్పటికే బాగా చీకటి పడింది. పెట్రొమేక్స్ లైటు పట్టుకొచ్చాడు వూళ్ళోంచి మరోవ్యక్తి.

"పుల్లబండి ఇంకా రాలేదేంరా కిట్టప్ప" అన్నాడు అబద్దం.

"మన పొలంనుంచి పుల్లలేసుకు రమ్మన్నాను. పాలేరు వెళ్ళాడు. ఈపాటికి రావాలి మరి" అన్నాడు కిట్టప్ప.

ఇంతలో గుర్రపు డెక్కాల చప్పుడు వినపడింది.

"శవం వెంట పడుతున్నా డెందుకు వీడు" అన్నాడు కిట్టప్ప.

"చేసిన తప్పు దిద్దుకుందుకేమో" అన్నాడు సుబ్బారావు.

"వీడుచేసింది తప్పుకాదు.. ఘోరమైన పాపం" అన్నాడు కిట్టప్ప.

"అయితే ఆ పాపానికి ప్రాయశ్చిత్తం గానే పుల్లయిస్తాననీ, దహనం చేసారా అని వెంటబడుతున్నాడేమో" అన్నాడు సుబ్బారావు.

"నాకేదో అనుమానంగానే వుందిరా. శవం నలబడింది. ఈ చావుకి కూడా కారణం వీడేనా అని" అన్నాడు కిట్టప్ప.

"ఇంకా కూర్చున్నారేం" అన్నాడు దొరయ్య గుర్రాన్ని ఆపి దిగకుండానే.

"పుల్ల రావాలి" అన్నాడు కిట్టప్ప.

"మా ఇంటినుంచి తెచ్చుకోమన్నా నుగా" అన్నాడు దొరయ్య.

"మా పొలంనుంచి వస్తోంది" అన్నాడు కిట్టప్ప.

"దిక్కులేంది కదా అని పాతి




పెట్టకండి" అన్నాడు దొరయ్య.

"దిక్కులేంది ఎందుకవుతుంది శాంతమ్మ. శాంతమ్మకి అయిదుగురు కొడుకులు. ఒకడు లేకపోయినా మిగిలిన నలుగురం వున్నాంగా" అన్నాడు సుబ్బారావు.

"సరే...కానిచ్చెయ్యండి. ఇప్పటికే పొద్దుపోయింది" అని వెళ్ళిపోయాడు దొరయ్య. గుర్రపు డెక్కల చప్పుడు దూరమయ్యింది.

పుల్ల బండి వచ్చింది.

పుల్ల పేర్చాడు పూరి చాకలి. శవాన్ని పడుకోబెట్టారు పేర్చిన పుల్లల మీద. ఉన్న నలుగురులోకి కాస్త పెద్దాడు సుబ్బారావు కావడంతో సుబ్బారావే శివాకి ఇచ్చిన మాట ప్రకారం తలకొరివి పెట్టడానికి సిద్ధమయ్యాడు.

శవం చుట్టూ మూడుసార్లు తిరిగాడు సుబ్బారావు. అతనివెంట మిగిలిన ముగ్గురు కూడా తిరిగారు.

పూరి చాకలి, కాటికాపరి నిలబడి చూస్తున్నారు. పెట్రొమేక్స్ లైటు ఓ తులసి కోటమీద వుంచారు.

సుబ్బారావు శాంతమ్మకి తలకొరివి పెట్టబోయే సమయానికి అతని చేతిలోని కొరకంచును ఎవరో లాక్కున్నారు.

"ఎవరూ" అంటూ సుబ్బారావు వెనక్కి తిరిగిచూసాడు.

నల్ల దుప్పటి ముసుగేసుకొని నిలబడ్డాడు, చేతిలో కొరకంచుతో శివా.

నలుగురు స్నేహితులూ 'శివా' అన్నారు ఒకేసారి. కాటికాపరి, పూరి చాకలి "సరిగ్గా సమయానికి వచ్చావయ్యా! అంతే ఋణానుబంధమంటే" అన్నారు.

శివా కొరివిపెట్టాడు. తల్లి చితిచుట్టూ ప్రదక్షిణంచేసి స్నేహితుల్ని ఒకసారి చూసి వెళ్ళిపోయాడు శివా.

నలుగురు స్నేహితులూ కళ్ళు వత్తుకున్నారు. చెలరేగిన మంటల్లో శాంతమ్మ దేహం బూడిదైపోతోంది.

పూరి చాకలి గెడకర్రతో పుల్లలు ఎగదోస్తున్నాడు. కాలుతోన్న శవాన్ని కర్రతో పొడుస్తున్నాడు.

* * *

మామిడితోటలోంచి గుర్రంమీద వెడుతున్న దొరయ్యకిఊరిచాకలి కనిపించాడు.

"ఒరేయ్..ఇటురా!" అంటూ దొరయ్య పిలిచాడు.

ఎందుకు పిలిచాడో అన్న భయంతోనే వణుకుతూ దొరయ్యకు చేరువగా వెళ్ళి చేతులు కట్టుకొని నిలబడ్డాడు పూరి చాకలి.

"శాంతమ్మ శవదహనం బాగా జరిగిపోయిందా" అన్నాడు దొరయ్య.

"బాగానే జరిగింది బాబూ! సరిగ్గా సమయానికి ఎక్కడనుంచి వచ్చాడోగాని శివయ్య బాబుకూడా వచ్చాడు.ఆయనగోరే తలకొరివి పెట్టాడండి" అన్నాడు పూరి చాకలి ఎంతో తృప్తిని వ్యక్తపరుస్తూ.

"శివా వచ్చి తల్లికి తలకొరివి పెట్టాడన్న మాట" దొరయ్య కంఠంలో నలుసుపడినట్లు అయింది.

"శివగాడొచ్చాడా అక్కడికి?" అన్నాడు దొరయ్య.

"అవునండి బాబు" అన్నాడు చాకలి.

మరోమాట వినడానికి సిద్ధంగాలేడు దొరయ్య. గుర్రాన్ని అదిలించాడు.

ఊళ్ళోకెళ్లాడు. శాంతమ్మ ఇంటికి వెళ్లాడు. ఎప్పుడూ కుర్రాళ్లు కూర్చునే అరుగు ఖాళీగా వుంది. అరుగుమీద మిషను లేదు. ఇంటికి తాళంపెట్టివుంది. గుర్రాన్ని అదిలించి కిట్టప్ప ఇంటివేపు పోనిచ్చి, ఓ



సారి పరకాయించి చూసి పొలంవేపు పోనిచ్చాడు.

వెయ్యి కళ్ళతో చుట్టూచూస్తూ గుర్రాన్ని నడుపుతున్నాడు దొరయ్య.

అల్లంత దూరాన ఓ తాడిచెట్టు మొదట్లో ముంజెలుతింటూ కనిపించారు కిట్టప్ప,

అబద్ధం, పుల్లయ్యాను.

సుబ్బారావు చెట్టుమీద వున్నాడు.

"చాలా? ఇంకో రెండు గెలలు నరకనా?" అన్నాడు చెట్టుమీదనుంచి సుబ్బారావు.

గుర్రపు డెక్కల చప్పుడు వినిపించి కిందవున్న ముగ్గురూ అటు చూసారు.

గుర్రం తమవేపే వస్తోందని కిట్టప్ప గమనించాడు.

"వీడు మన వెంటపడుతున్నాడు ఎందుకురా?" అన్నాడు కిట్టప్ప.

"ముంజికాయలు తిందామనిపించి వస్తున్నాడేమో" అన్నాడు అబద్ధం.

ఇంతలో గుర్రం వాళ్ళదగ్గరకొచ్చి ఆగింది.



"నాలుగోవాడేడిరా?" అన్నాడు దొరయ్య.

"ఇప్పుడు వాడితో పనేమొచ్చింది?" అన్నాడు కిట్టప్ప.

"అడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పకుండా ఎదురుప్రశ్నలేత్తావ్ శవలతత్తు కొడక" అంటూ కిట్టప్ప నెత్తిమీద ఒక్క దెబ్బ కొట్టాడు దొరయ్య.

కిట్టప్పతూలిపడబోయి ఆపుకున్నాడు.

"ఎందుకు అలా కొడతావ్" అన్నాడు కిట్టప్ప.

దొరయ్య కిట్టప్ప జుట్టు పట్టుకొని దగ్గరకి లాక్కున్నాడు. "ఎక్కడున్నాడు ఆడు?" కిట్టప్ప కళ్ళలోకి చూస్తూ అడిగాడు దొరయ్య.

"ఎవడు?"

"శివాగాడు?''

"నాకేం తెలుసు?''

"నీకు తెలియకుండానే నిన్నరాత్రి వచ్చి తల్లికి తలకొరివి పెట్టాడా ఆడు" అంటూ ఓ గుంజు గుంజాడు కిట్టప్పని. కిట్టప్ప విలవిలలాడాడు.

పుల్లయ్య, అబద్ధం పారిపోబోయారు.

దొరయ్య కిట్టప్పని వదలకుండానే అతని జుట్టు తన గుప్పెట్లో వుంచుకొనే గుర్రాన్ని వాళ్ళవేపు అదిలించి పుల్లయ్యని ఓ తన్ను తన్నాడు. పుల్లయ్య బోర్లా పడ్డాడు. అబద్ధం జుట్టు కూడా పట్టుకున్నాడు.

ఇంతలో పైనుంచి ఓ ముంజెల గెల పడింది దబ్బుమని.

"ఎవర్రా పైన?" అని గర్జించాడు దొరయ్య.

"నేనురా" అన్నాడు సుబ్బారావు.

"నన్నే 'రా' అంటావురా" అంటూ అబద్ధం జుట్టూ, కిట్టప్ప జుట్టూ పట్టుకొనే పైకి చూసాడు.

"నా చేతిలో కత్తివుంది. నీకంటె ఎత్తున వున్నాను. ఇక్కడినించి విసిరితే రెండుముక్కలౌతావ్. వదిలెయ్ వాళ్ళని" అని గర్జించాడు సుబ్బారావు.

"నీకెంత ధైర్యం వచ్చిందిరా?" బుసలు కొట్టాడు దొరయ్య.

"గదిలోపెట్టి కొడితే పిల్లికికూడా ధైర్యం వస్తుంది. వదలకపోతే కత్తి గురి చూసి నీమీదకి విసిరేస్తాను" బెదిరించాడు సుబ్బారావు.

దొరయ్య కంటికి సుబ్బారావు అన్నంతపని చేసేలాగే కనబడ్డాడు.

"సరే ... రేపు సాయంత్రానికి ఆ శివాగాడు ఎక్కడున్నాడో నాకు చెప్పాలి. చెప్పకపోతే విడివిడిగా మిమ్మల్ని వేటాడి వూరగాయెట్టేస్తాను నా కొడకల్లారా! ఒరేయ్ సుబ్బిగా... ఈవేళ చెట్టుమీద వున్నానని పొంగిపోకు. కిందకి దిగకుండానూవుండలేవు,నాచేతిలో పడకుండానూ వుండవ్. ప్రాణాలమీద ఆశవుంటే ఆడి జాడ రేపటిలోపల చెప్పండి లేదా ఆణ్ణీ మిమ్మల్నీ కలిపి కైమా చేసేస్తాను కుర్ర నాకొడకల్లారా" అంటూ గుర్రాన్ని అదిలించి వేగంగా పోనిచ్చాడు.

దెయ్యాలవాగు దాటి గుర్రం వెళ్ళిపోయింది.

అలా వెళ్ళి జీపు ఎక్కబోతున్న భూషణం ముందు ఆగింది దొరయ్య గుర్రం.

భూషణం జీపు ఎక్కబోయి దిగాడు. దొరయ్య గుర్రం దిగాడు.

ఇద్దరూ కాస్త ఎడంగా వెళ్ళారు.

"వాడు బతికే వున్నాడట" దొరయ్య అన్నాడు.

"అలాగా!మరి ఏం చేద్దామంటావూ?"

భూషణం అడిగాడు.

"వాణ్ని ఏం చేద్దామన్న విషయం తరవాత ఆలోచిద్దాం. వాడి సంగతి నాకొదిలెయ్. ఈ వారంలో గంగ పెళ్ళి జరిగిపోవాలి. ఒకవేళ వాడిక్కడికి రావొచ్చు. వస్తే పిట్టని కాల్చినట్టు కాల్చి పారెయ్..తరవాత సంగతిచూసుకుందాం"

"ఆ సంగతి నువ్వు చెప్పాలా.నువ్వెళ్ళి బావనూ, ముసలమ్మనూ పంపించు. సంబంధం సిద్ధంగానే వుంది" అన్నాడు భూషణం.

"ఎవరి సలహాలు చూపులూ నిర్ణయాలూ అక్కర్లేదు. సంబంధం ఖాయంచేసి ముహూర్తం పెట్టించెయ్ బావా...నాలుగైదు రోజుల్లో అయిపోవాలి పెళ్ళి. పిల్ల అత్తారింటికి వెళ్ళిపోవాలి" చెప్పి వెళ్ళిపోయాడు దొరయ్య.

వెంటనే భూషణం రామాచారిగారి దగ్గరకెళ్ళాడు జీపులోనే.

గుళ్ళోవున్న రామాచారి భూషణం జీపు చప్పుడు వినగానే బయటకొచ్చాడు.

రామాచారి ముందు జీపు ఆగింది.

"మీరు ప్రయాణానికి తయారై ఇంటికి రండి" అన్నాడు భూషణం.

"ఎక్కడికి బాబూ ప్రయాణం?" రామాచారి అడిగాడు.

"పెళ్ళివారింటికి.సంబంధం ఖాయమని చెప్పి ముహూర్తాలు పెట్టుకురావాలి. త్వరగా రండి ఇంటికి" చెప్పాల్సిన విషయం రామాచారికి చెప్పి వెనక్కి తిప్పుకున్నాడు జీపును భూషణం.

జీపు భూషణం ఇంటిముందు ఆగింది.

జీపులోంచి దిగాడు.

"ఒరేయ్ బండోడా" అన్నాడు భూషణం.

"అయ్యా" వచ్చి నిలబడ్డాడు కర్ర చేత పట్టుకొని బండోడు.

"దుక్కోడేడిరా?"

"కొత్త పెళ్ళాం కదండీ...నిన్ననే కట్టుకొచ్చాడండి ... ఇంకా రాలేదండి" అన్నాడు బండోడు.

"అణ్ని కూడా ఎంటేసుకొని ఊళ్ళోకి ఏ ఒక్క కొత్త మనిషి వచ్చినా నా దగ్గరకి లాక్కురండి...తప్పించుకు పోనివ్వొద్దు" ఆదేశించాడు భూషణం.

'సిత్తం'అని బండోడు దుక్కోడికోసం వెళ్ళిపోయాడు. దుక్కోడికి స్నానం చేయిస్తోంది చుక్క.

"ఓరినీ తస్సాదియ్యా... నీ బోగాలు తరవాతగాని, దొరయ్యబాబు మనిద్దరికీ ఓ పెద్దపని అంటగట్టాడురా దుక్కోడా" అన్నాడు బండోడు.

"ఈడు బండోడే! నాతోబాటే భూషణం గారి దగ్గర కొలువు" పరిచయం చేసాడు దుక్కోడు.

"సూసాలే మా వూరొచ్చినప్పుడు" అంది చుక్క.

"ఏంటిరా... అంత పెద్ద పనా" దుక్కోడు అడిగాడు.

"ఊళ్లోకి కొత్తమనిషి ఎవరొచ్చినా బాబుగారి కాడకి లాక్కురమ్మన్నారు' అన్నాడు బండోడు.

"ఆడమనుషల్ని లాక్కురమ్మన్నారా మొగమనుషలైనా ఫరవాలేదా" అంది చుక్క.

"ఆ ఇసయం అడగలేదు నేను" అన్నాడు బండోడు తలగోక్కుంటూ.

"ఎల్లి అడిగిరామరి" అంది చుక్క.

"బలేదానివే! ఇలాటి ప్రశ్నలేత్తే కర్ర తిరగేత్తాడు అయనగారు.నువ్వుబేగాలెగరా దుక్కోడా! ఆడామగా తేడా ఏంటిగాని, ఎవరు కొత్తగా అపడితే అళ్ళని లాక్కు

పోదాం ఆయనగోరికాడకి"

"నన్ను మాత్రం వదిలెయ్యండయ్యా మొగోళ్ళు! వూరికి కొత్త మనిషినే అయినా మీలో ఒకడికి పెళ్ళాన్నికదా" అంది చుక్క నవ్వుతూ.

"నీ పెళ్ళాం సిసింద్రీయేరా దుక్కోడా" అన్నాడు బండోడు.

"అందుకేగా సరదాపడి సేసుకుంట" అన్నాడు దుక్కోడు తలతుడుచుకుంటూ.




బండోడు, దుక్కోడు కొత్తమనిషి ఎవరైనా వూళ్ళోకి వచ్చారా అని వెయ్యి కళ్ళతో వెతుకుతున్నారు.

ఎంత వెతికినా రోజూ కనిపించేజనం. రోజూ కనిపించే అడుక్కునేవాళ్ళూ, రోజూ కనిపించే ఐస్‌ఫ్రూట్‌లు అమ్ముకునేవాడే తప్ప ఎవరూ కనిపించలేదు. అలాంటి సమయంలో ఎవరోగాని కొంగు నిండాకప్పుకొని గళుక్కు గళుక్కుమని చప్పుడు చేసుకుంటూ గజ్జెలగుర్రంలా నడిచిపోతోంది వీధి మధ్యమంచి.

"ఈ కేసు ఎవరో కొత్త కేసునాగే వుందిరోయ్ దుక్కోడా" అన్నాడు బండోడు.

"అయితే పోనియ్యకు" సపోర్టుచేసాడు దుక్కోడు.

ఇద్దరూ పిల్లిపిల్లల్లా సెమ్మదిగా ఆ మనిషివెనకాలే నడిచి చెరో జబ్బా పట్టుకొని, "ఇంక తప్పించుకోడం నీ తరం కాదు" అన్నారు.

ఆ మనిషి కుయ్యో మొర్రోమంటూ వెనక్కితిరిగి దుక్కోణ్ణిచూసి, "అయ్యో బావయ్యలూ... వెనకసాయినుంచి వచ్చి ఇంత గట్టిగా పట్టుకోవాలా! కావాలని కన్నుకొడితే వాళ్ళొచ్చి వాలిపోనూ ఇంతటి పెరసనాలిటీస్ దొరకటమే సాలు" అంటూ ఆ కొజ్జామనిషి ఇద్దరి మీసాలనీ ముద్దాడింది.

"వెదవ్వేసాలెయ్యకు... నాకు నిన్నే పెళ్ళయింది. అయ్యగారి దగ్గరకిపద" అంటూ ముందుకు నెట్టాడు దుక్కోడు.

భూషణం ముందుకి తోసి, "ముసుగేసుకొని దొంగచాటుగా పోతంటే పట్టుకుని లాక్కొచ్చాంమండి" అన్నాడు బండోడు.

ఆ కొజ్జామనిషి, "పరాయి ఆడదన్న శంకలేకుండా చెరో జబ్బా ఉడుంపట్టు పట్టి లాక్కొచ్చారు చూడండి బావయ్యగారు" అంటూ భూషణం మీదకి నడిచింది.

"ఆగు..అక్కడాగు" అంటూ దాన్ని ఆపి, "ఏరా గుడ్డిసన్నాసుల్లారా...నేను తీసుకురమ్మన్నది ఇలాంటివాళ్ళనిరా" అంటూ చెరో చెంపదెబ్బ వేసాడు భూషణం.

"అద్దది...అలా అంటించండి దొంగ సచ్చినోళ్ళని. మా బావయ్యగారంటే యేంటో తెలిసొత్తాది" అంటూ వంపులు తిరిగింది కొజ్జామనిషి.

"నోర్ముయ్! ఫో అవతలకి" అని కసిరాడు భూషణం.

"అంత కోపమెందుకు బావయ్యా గారూ" అంది.

"దీన్ని లాక్కుపొండిరా అవతలకి.

మీరు పట్టుకు తీసుకురావలసింది ఇరవై యేళ్ళుదాటి పాతికేళ్ళుదాటని కుర్రాళ్ళని.. తెలిసిందా" అని గర్జించాడు భూషణం.

'చిత్తం' అంటూ ఆ కొజ్జామనిషిని నెట్టుకుంటూపోయారు దుక్కోడు, బండోడూను.

వీధిలో ఇటూ అటూ దిక్కులు చూస్తూ పచార్లుచేస్తున్న దుక్కోడికి, బండోడికి మరో కొత్త వ్యక్తి కనిపించాడు.

బండోడు అతనికి కాస్త ఎడంగా నడుస్తున్నాడు. బండోడి వెనక దుక్కోడు నడుస్తున్నాడు. తనను ఎవరో వెంటాడు తున్నట్లు గమనించిన ఆ వ్యక్తి కాస్త వేగంగా నడవసాగాడు.

దుక్కోడు, బండోడు ముఖ ముఖాలు చూసుకొని ఆ వ్యక్తిని చుట్టుముట్టారు. ఆ వ్యక్తి కాస్త భయపడి, కదలకుండా నిలబడిపోయాడు.

"నీ వయసెంత?"బండోడు అడిగాడు.

"ఇరవైమూడు" అన్నాడతను.

"అంటే ఇరవై పైనేకదా?" బండోడు అన్నాడు.

"ఇరవైదాటందే ఇరవైమూడు ఎల్లా వత్తదిరా" అన్నాడు దుక్కోడు.

"అయితే పద" అంటూ బండోడు ఆ వ్యక్తిని జబ్బ పట్టుకున్నాడు.

అలా ఆ వ్యక్తిని ఇద్దరూ కలసి లాక్కొచ్చి భూషణం ముందు నిలబెట్టారు.

''ఇతనే బాబుగారూ మీరు తీసుకు రమ్మన్నతను" అన్నాడు బండోడు.

''నీ పేరేమిటయ్యా?" భూషణం అడిగాడు.

"నా పేరు రాజు. నేనెవరనుకుంటు న్నారో నాకు తెలీదుగాని, నేను భూషణం గారిని కలవడానికి వచ్చాను'' అన్నా డతను.

"భూషణంగారు ఎవరు?" భూషణమే అడిగాడు.

"సమితి ప్రెసిడెంటు. దానికంటె ముఖ్యం, మా అన్నయ్యకి వారి మేనకోడలితో మూడురోజుల్లో పెళ్ళి జరగబోతోంది" అన్నాడతను.

"చంపేరు...మీరు మొగ పెళ్ళివారా? వదలండ్రా ఆయన్ని...చవటల్లారా" అంటూ దుక్కోణ్ణి, బండోణ్ణి కేకలేసి ఆయన్ని లోపలికి తీసుకెళ్ళాడు భూషణం 'రండి...రండి' అంటూ.

''ఛీ..ఈ కేసూ ఫేలయిపోయిందిరా" అంటూ మళ్ళీ ఊరుమీద పడ్డారు ఇద్దరూ కలసి.

* * *

చుక్క వయ్యారంగా నడుచుకుంటూ భూషణం ఇంటికొచ్చింది.

భూషణం దాన్ని ఎగాదిగా చూసి, "ఎవరివే నువ్వు? ఎవరు కావాలి నీకు??" అన్నాడు.

''నేను దుక్కోడి పెళ్ళాన్నండి. మా పుట్టిల్లు గంగమ్మగోరి పుట్టినూరేనండి అమ్మాయిగోర్ని సూసి బట్టలట్టుకెడిదామని వచ్చానండి" అంది చుక్క.

"వెళ్ళు ... లోపలికెళ్ళు" అన్నాడు భూషణం.

పరధ్యానంగా కూర్చున్న గంగ ముందు కూర్చుని "అమ్మాయిగోరూ" అంది చుక్క.

గంగ ఉలిక్కిపడి "ఎవరూ" అని, "చుక్కా! ఎప్పుడొచ్చావే?'' అంది కొంచెం నవ్వు ముఖంలోకి తెచ్చుకొని.

''నేను మొన్నొచ్చానమ్మాయిగారూ ఆ దుక్కోడ్ని కట్టుకొని.తమర్ని సూడాలని ఇలా వచ్చేసాను" అంది చుక్క.

"నువ్వు అదృష్టవంతురాలవే! నచ్చిన

వాణ్ని కట్టుకున్నావ్" అంది గంగ.

"ఇంకేమిటే మన వూరి విశేషాలు" అంది గంగ చుక్క ఏమి చెబుతుందో నని ఆత్రుతగా ఎదురుచూస్తూ.

"శాంతమ్మగోరు పోయారమ్మా" అంది చుక్క.

గంగ కళ్ళు మూసుకుంది. అంతా నా మూలానే అనుకుంది తనలోతనే.

* * *

శివా తల వంచుకొని నడుస్తున్నాడు వీధిలో.

దుక్కోడు, బండోడు ఎదురయ్యారు. పరకాయించి చూసారు.

ఎదురెళ్ళారు.

"నీ పేరేమిటి?" దుక్కోడు అడిగాడు

శివా చెప్పబోయాడు.

"నీ పేరు మాటకేంలే నీ వయసు ఇరవైదాటిందా?'' బండోడు ప్రశ్నించాడు.

"లేదు'' శివా బదులు చెప్పాడు.

"అయితే ఎల్లిపో ...నీతో మాకు పనిలేదు" అన్నాడు దుక్కోడు.

శివా గుడివైపు నడిచి వెళ్ళిపోయాడు.

* * *

గంగ ముందునుంచి లేస్తూ చుక్క "ఎక్కడోచోట ఉండే వుంటాడనిపిస్తం దమ్మాయిగారూ నామనసుకి'' అంది.

"ఏం జరిగిందో నీకు తెలీదుకాబట్టి నీకలా అనిపించడం సహజమే. ఏం జరిగిందో నాకు తెలుసుకాబట్టి నాకా ఆశలేదు" అంది గంగ.

"పోనీలెండమ్మాయిగారూ గుండిరాయి సేసుకోడంతప్ప ఇందాకా వచ్చాక మనం సెయ్యగలిగిందేమీలేదు. సందాల తమర్ని పెళ్ళికూతుర్ని సేత్తారంటకదా. మళ్ళీ వత్తాను" అంది చుక్క.

"నా చిన్నప్పుడు బొమ్మలపెళ్ళిళ్ళకి తాటాకు బొమ్మల్ని పెళ్ళికూతుళ్ళనుచేసి ఆడుకునేదాన్ని. ఇప్పుడు ఈ తాటాకు బొమ్మను పెళ్ళికూతుర్నిచేసి మావాళ్ళు ఆడుకుంటున్నారు" అంది గంగ.

"అలా బాధ పడిపోకండి అమ్మాయి గోరూ! మనసు కూడగట్టుకోండి. ఇంకేం సేత్తాం" అని ఓదార్చింది చుక్క.

* * *

శివా సంపంగి చెట్టును చూసాడు గుడి తోటలో. ఆ సంపంగి చెట్టు దగ్గరికి వెళ్ళి నిలబడి చెట్టున పండిన ఓ పువ్వును తీసుకొని స్వామి దర్శనం చేసుకున్నాడు రామాచారి శివానెత్తిన శఠగోపం వుంచి, తీర్థ ప్రసాదాలు ఇచ్చాడు.

శివా రామాచారి ఇచ్చిన కొబ్బరిచెక్క పగల గొట్టుకుని తింటూ కూర్చున్నాడు మెట్లమీద.

పెద్ద రద్దీ లేకపోవడంతో, "ఎవరు బాబూ నువ్వు? మా వూరివాడివిలా లేవు" అని పలకరించాడు రామాచారి శివాని.

"ఔనండి. మాది ఈ ఊరు కాదు. ఈ వూళ్ళో ఈ మధ్య పెళ్ళిళ్ళు ఏమైనా జరిగాయా అండి?"' శివా అడిగాడు.

"ఎందుకు బాబూ... అలా అడుగు తున్నావు?" రామాచారి ప్రశ్నార్థకంగా చూస్తూ అడిగాడు.

"ఏంలేదండి! నేను పాటలు పాడతాను. ప్రోగ్రాం కోసం అడిగాను" అన్నాడు శివా.

"తుంటిమీద కొడితే పళ్ళు రాలాయి అన్నట్టు, నీ ప్రోగ్రాము కోసమైతే ఈమధ్య పెళ్ళిళ్ళు ఏమైనావున్నాయా అని అడగాలిగానీ, పెళ్ళిళ్ళు జరిగాయా అని అడుగుతారా నాయనా?" అన్నాడు రామాచారి.

"బాగా చెప్పారు స్వామి! అలా అడగ





దానికి కారణం – జరిగిన పెళ్ళిళ్ళలో ఎట్లాంటి ప్రోగ్రాములు పెట్టారో తెలుసుకొందామని అడిగాను. ఇంతలో కేమాటగాడి తప్పింది''

"అదా సంగతి. అయితే నువ్వు పాడతా వన్న మాట. నేనూ నాటకాల్లో వేషాలు వేస్తుంటాను. పాడతాను కూడా అనుకో. త్వరలో అంటే మూడురోజుల్లో ఓ పెళ్లి జరగబోతోందయ్యా. అది పెద్దింటి పెళ్ళి! మనలాంటివాళ్ళ ప్రోగ్రాములు పనికి రావు" అన్నాడు రామాచారి.

ఇంతలో గంగ, ధనమ్మ, చుక్క మరికొంతమంది అటు వస్తుండటం చూసాడు రామాచారి.

''అదిగో... పెళ్ళికూతురు మాటల్లోనే వచ్చింది" అంటూ రామాచారి లేచాడు.

శివ తొందరగా పూపొదలమాటుకు తప్పుకున్నాడు. పొద చాటునుంచే పెళ్ళికూతురు వేషంలో వున్న గంగను మనసారా ఓసారి చూసుకున్నాడు. చాలా రోజుల తరవాత గంగను చూడగలిగినందుకు ఓ పక్క ఆనందంగా వున్నా మరోపక్క ఏడుపు పొంగుకు వచ్చింది శివాకు.

''ఈరోజునే గంగని పెళ్ళికూతుర్ని చేసాం రామాచారిగారూ! అందుకే తీసుకొచ్చాను అమ్మవారి దర్శనానికి" అంది ధనమ్మ.

''మంచిపని చేసారమ్మా! మళ్ళీ పెళ్ళిరోజున పెళ్లిపీటలమీద కూర్చోబోయే ముందు తీసుకురావాలి అమ్మాయిని! స్వామివారికీ, దేవికీ బట్టలు ఇచ్చి, మనసులోని కోరిక చెప్పుకొని వెళ్ళాలి. తమకి తెలియనిదేవుంది'' అన్నాడు రామాచారి.

శివా అంతా విన్నాడు.

తిరిగి వాళ్లు వెళ్ళిపోయేటప్పుడు ఓ సంపంగి పువ్వు తుంపాడు శివా. ముద్దు పెట్టుకొని విసిరాడు. అది గురి తప్పి ధనమ్మకు తగిలింది. ధనమ్మ ఏదో తగిలిందని దులుపుకొని ముందుకు నడిచింది. గంగ వంచిన తల ఎత్తకుండా, కదులుతున్న శిల్పంలా వాళ్ళతోనడిచింది. తను విసిరిన పువ్వు గంగకు తగలలేదనీ, గంగ చూడలేదనీ విలవిల్లాడాడు శివ.

గంగ, ధనమ్మ ఇంటికి చేరేసరికి నాగమ్మ, చిన్నా, శ్రీరాములు వచ్చి వున్నారు. దొరయ్య బయట అరుగుమీద కూర్చుని భూషణంతో మాట్లాడుతూ పందిరి పనులు పురమాయిస్తున్నాడు.

"ఏవమ్మా ధనమ్మా! నేను చూడకుండా దాని తండ్రి చూడకుండా ఇంత దొంగచాటుగా, ఇంత అర్జంటుగా ఈ సంబంధం కుదిర్చెయ్యడమెందుకూ– ఈ పెళ్ళికొడుకుని అట్టుకొచ్చి పిల్ల నెత్తిన రుద్దడమెందుకూ? అసలు నువ్వు దిగావా మీ ఆయన్ని" అంది నాగమ్మ.

"లేదు పిన్నీ! మొగాళ్ళ మాటకి నేనెప్పుడు ఎదురుచెప్పాను చెప్పండి" అంది ధనమ్మ నవ్వుతూ.

"ఆ.... పెద్ద మొగాళ్ళు బయలుదేరారులే! ఎంత పెద్ద మొగాడైతే మాత్రం ఆడది లేకుండా ఎవడు పుట్టాడమ్మా? మొగాళ్లు తప్పు చేస్తే అడిగే హక్కు ఆడదానికి వుంది నన్నడిగితే" అంది నాగమ్మ.

* * *

శివాకి ఏమీ పాలుపోవడంలేదు. తను ఊళ్ళో ఉన్నట్టు గంగకు తెలియాలి. ఎలా తెలియచెప్పాలో తెలియడం లేదు. గంగకు పెళ్ళి అయిపోతోందన్నఆలోచన మనసులోకి వస్తే గుండెలు మండిపోతు

న్నాయి. తను కళ్లారా గంగను చూసాడు. నవ్వుతూ తుళ్లుతూవుండే గంగ ఎండిపోయి ఇసుక పర్రలా వుంది. పెళ్ళికూతురు ముస్తాబులో కళకళలాడుతూండాల్సిన గంగ ప్రాణంలేని తాటాకు బొమ్మలా వుంది.

అసలు గంగను కలవడం ఎలా!

తను ఆమె కోసం ఎదురుచూస్తున్నట్లు తెలియడం ఎలా ? ఆలోచనలు తెగడం లేదు. ఆమె ఎక్కడ ఉందో తెలీదు. వీధివీధికి తిరిగాడు. చీకటి పడింది. గుడికి చేరుకున్నాడు. రేపొక్క రోజులేదు. ఎల్లుండే పెళ్ళి అనుకొన్నాడు.

"బాబూ భోంచేసావా? చెయ్యకపోతే చేద్దువ్గానిరా" అన్నాడు రామాచారి శివాతో.

"ఆకలి లేదండీ" అన్నాడు శివ.

"పోనీ ఓ పనిచెయ్! కాసేపు ఆగి భోంచేద్దాంకాని, సంధ్యవేళకదా, స్వామి మీద ఓ చక్కని పాటో పద్యమో పాడు



బాబూ" అన్నాడు రామాచారి.

తన గళం గంగకు గుర్తేనన్న సంగతి శివాకు గుర్తు వచ్చింది.

"అయ్యగారూ.. పెళ్ళివారిల్లు ఇక్కడి కెంత దూరం?" అన్నాడు శివా.

"నీ పాటకందేటంత దూరం బాబూ! నీ పాట నచ్చితే వాళ్ళెవరేనా వచ్చి నీ ప్రోగ్రాము కూడా పెట్టుకోవచ్చు" అన్నాడు రామాచారి.

శివా ఎంతో ఆశతో 'కృష్ణా' అంటూ గళం ఎత్తాడు.

ఆ ఆలాపన పరధ్యానంగావున్న గంగ చెవికి సోకింది. ఎండిపోయిన గంగలోకి వరదొచ్చినట్టు గంగలోశక్తి వుప్పొంగింది. గంగ లేచి కూర్చుంది. పాట వింటూంటే ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. పెదవులపై నవ్వు. కళ్ళలో నీళ్ళు. నీళ్ళ వెనక ఏదో మెరుపు. ఆనందం. ఒక్క పరుగున ఆ పాట వస్తున్న వైపు పరుగెత్తాలనిపించింది. శివా ఒడిలో వాలిపోయి వళ్ళంతా తడిమి తన శివాను మనసారా అక్కున చేర్చుకోవాలనుకుంది.

లేచింది... పరుగు పరుగున వీధి గుమ్మందాకా వెళ్ళింది.

ఎదురుగా దొరయ్య గుర్రం కనిపించింది. అలాగే ద్వారబంధానికి చేరబడి కుప్పలా కూలిపోయింది గంగ.

నాగమ్మ గంగను లేపి లోపలికి తీసుకెళ్ళింది.

పాట ఆగిపోయింది.

"మనుషులనే కాదయ్యా... రాళ్ళనూ, రాళ్ళలోని దేవుళ్ళనూ కదిలించే గళం బాబూ నీది" అన్నాడు రామాచారి.

మర్నాటి సాయంత్రం గంగ, చుక్క, మరో అమ్మాయి జీపులో ఆలయానికి వచ్చారు. ఆరోజున దొరయ్యలేడు ఇంటి దగ్గర. బట్టలు కొనడానికిపట్నం వెళ్లాడు.

జీపు వీధిన వెడుతున్నప్పుడు గంగ కళ్లు శివా ఎక్కడైనా కనపడతాడాని వెతుకుతూనే వున్నాయి.

జీపు దిగి గంగ, చుక్క, మరో అమ్మాయి గుళ్లోకి వెళ్లారు. గంగ కళ్లు మూసుకుని "నా శివాను నాకు చూపించు స్వామీ" అంటూ లోలోపలే వాపోయింది. చుక్క చుట్టూ చూస్తోంది. ఎవరూలేరు.

రామాచారి వచ్చి, "ఎంత సేపయ్యిందమ్మా వచ్చి" అంటూ శఠగోపం నెత్తిన పెట్టి తీర్థ ప్రసాదాలు ఇచ్చాడు.

ప్రసాదం తింటూ గుడి మెట్టుమీద కాసేపు కూర్చుందామనుకొని కూర్చున్నారు ముగ్గురూను.

ఓ సంపంగి పువ్వు గంగ వడిలో పడింది.

ఎవరూ చూడకుండా తీసుకొని వేయి కళ్ళతో వెతికింది గంగ. అల్లంతదూరాన గంగకు శివా కనిపించాడు ఓ పొద మాటున.

గంగ ఆనందానికి అవధులులేవు. తనువు పులకించిపోయింది. కళ్ళనిండా నీళ్ళు నిండాయి. శివా పరిస్థితి కూడా అంతే. గంగ కళ్ళలో నీళ్లు చూసి శివా కళ్ళు చెమ్మగిల్లాయి. ఒకరికొకరు కనిపించడంలేదు. ఒకరినొకరు లీలగా చూసుకుంటున్నారు.

"మావయ్యగోరురమ్మంటున్నారమ్మా.. పట్నం నుంచి కొత్త బట్టలొచ్చాయంట" అన్నాడు బండోడు వాళ్ళముందునిలబడి.

గంగ కళ్లు వత్తుకొని లేచింది.

"ఓ సంపంగి పువ్వు కోసుకొని వస్తాను. జీపు ఎక్కండే" అంటూ అటు వెళ్ళి తన చేతిలోని పూమాలు శివాకి కనపడేలా ఓ పొద మొదల్లో వేసి వెనక్కి

వచ్చింది గంగ.

గంగ జీపు ఎక్కింది. జీపు వెళ్ళి పోయింది.

శివా ఒక్క పరుగున వెళ్లి గంగ వదిలిన చేతిరుమాలును తీసుకున్నాడు.

"శివా!

చివరి ఘడియదాకా బతకదలుచుకునే బతుకుతున్నాను. తాళి కట్టించుకోవలసి వస్తే నా కట్టెకేగాని నాకు కాదని ఎప్పుడో నిర్ణయించుకున్నాను. మనం కలుస్తామని చెప్పి నా మనసు చెబుతోంది. అందుకే ఏ అఘాయిత్యం చెయ్యలేదు. రేపు రాత్రికి పెళ్లిపీటలమీద కూర్చోబోయేముందు గుడికి వస్తాను. గర్భగుడిలో దేవుడివెనుక వుండు. అక్కడినుంచే మనం బయటకు వెళ్ళడమో అక్కడే ఆ గుడిలోనే మన గుడికూడా కట్టుకోవడమో ...

-గంగ"

శివా ఆ వుత్తరాన్ని మళ్ళీ మళ్ళీ చదువుకుని ముద్దాడి మురిసిపోయాడు. శివా పాట విన్నప్పుడే రాసి పెట్టుకుందా ఉత్తరాన్ని గంగ.

చీకటిపడేదాకా గంగ రాసిన జేబు రుమాలుమీది వుత్తరాన్ని పదేపదే చదువు కుంటూనే వున్నాడు శివ.

తనను కాలూ చెయ్యీ విరిచి కాలువలో పడేసిన దొరయ్య గంగను ఆ ఆవేశంలో ఏం చేసేసాడోనని పరిపరివిధాల పోయేది తన మనసు. గంగ క్షేమంగానే వుంది. నాకోసం ఎదురుచూస్తూనేవుంది. సమయానికి రాబట్టి సరిపోయింది. లేకపోతే బలవంతంగా గంగను మరొకరికిచ్చి పెళ్ళి చేస్తే ఎంత బాధపడిపోయేదో, ఏం అఘాయిత్యంచేసి వుండేదో? అలా ఏవేవో ఆలోచించుకుంటూ గంగ ధ్యానంలోనే వుండిపోయాడుశివా. మరునాటిసాయంత్రం దాకా గంగ కనిపించదన్న ఆలోచనవస్తే శివా మనసుకు వూరట లభించడంలేదు.

కాస్త చీకటి పడింది.

అక్కడ ఇల్లంతా హడావిడిగా వుంది. పెళ్ళివారిల్లు ఎలా వుండాలో అలా వుంది. గంగమాత్రం పెళ్ళికూతురు ఎలావుండాలో అలా లేదు. ఆమెలో ఏదో కంగారు. ఏదో ఆనందం. ఏదో భయం. ఇంటి నిండా బంధువులు. తెల్లవారితే మొగ పెళ్ళివారుకూడా వస్తారు. చుక్క హడావిడిగా అటూఇటూ తిరుగుతూ ధనమ్మ పురమాయించిన పనులను చేస్తోంది. ఏదోలా ఒక్కసారి శివాను కలవాలని మనసు తహతహలాడుతోంది గంగకు. రేపు సాయంత్రందాకా శివాను కలవకుండా, చూడకుండా వుండటం అంటే చేతకావడంలేదు గంగకు. మరో భయం కూడా ఆమెను పీకుతోంది.

శివాకూడా తనలాగే వుండలేక తెగించి ఇక్కడకే వచ్చేస్తాడేమోననీ, తీరా అలా వచ్చేస్తే వీళ్ళంతా కలిసి శివాని ఏం చేసేస్తారోననీ తనలో తనే సతమతమైపోతోంది గంగ. గుడ్డిలో మెల్ల అన్నట్టు ఇంత భయంలోనూ ఓ చిన్న ధైర్యం- దొరయ్య ఇంకా రాలేదు, పట్నంనుంచి. దొరయ్య కూడా ఇక్కడే వుంటే, అసలు వూళ్లోనే వుంటే శివాకి పెద్ద ముప్పే. అలాంటి ఆలోచనతో గంగ గుండె ఝల్లుమంది.

ఇంతలో తనకు సుపరిచితమైన మురళీ నాదం వినిపించింది గంగకు. తనకి తెలుసు ఆ మురళీనాదం శివా మురళినుంచే. తాను ఒకసారి ఇలాంటి మురళీనాదం అతన్నించి వింది. చాలా బాగుందని చెప్పింది తను. గొంతువిప్పి పాడితే గొంతు గుప్పుపడతారని కాబోలు. మురళీ

నాదంతో తనను పిలుస్తున్నాడు శివా.

గంగ వుండబట్టలేకపోయింది. ఆమె తనువు దూదిపింజలా గాలిలో తేలిపోతోంది. తన రేగిన జుట్టును సవరించుకోలేదు.

తొలిగిన బట్టల్ని పట్టించుకోలేదు.

పారాణి పాదాలు ఆ రాత్రివేళ చల్ల గాలిలో తేలివస్తున్న మురళీనాదంవేపు వడివడిగా కదిలిపోతుంటే తాను నిమిత్త మాత్రంగా వుండిపోయింది.

తను అలా తన గదిలోంచి బయలుదేరి ,హాల్లోకివచ్చి వీధి గుమ్మందాటి మెట్లు దిగి వీధిలోకి రావడం ఎవరెవరు చూసారో తెలీదు ఆమెకు.

ఆ మురళీనాదం వినవస్తున్న వేపే యాంత్రికంగా ఆమె నడుస్తోంది. మురళీ నాదం వేగం పెరిగింది. ఆమె పారాణి పాదాలవేగం కూడా పెరిగింది. మురళీ నాదం ఆమె పాదాలను పరుగెట్టిస్తోంది.

ఆలయం ఆవరణలోకి చేరుకుంది గంగ. ఆమె కళ్ళముందు కనబడగానే శివా మురళీనాదం ఆగిపోయింది.

'శివా...శివా' అంటూ గంగ శివా సందిట్లోకి చేరిపోయింది. ఆ గుడి ఆవరణలో శివా, గంగ, గర్భగుడిలోని దేవుళ్లుతప్ప ఎవరూలేరు. వాళ్ళిద్దరి దృష్టిలో ఆ సమయంలో, ఆ ఆలయంలో వాళ్ళిద్దరే తప్ప మరెవ్వరూలేరు. ఈ ప్రపంచమే లేదు వాళ్ళ దృష్టిలో. వాళ్ళిద్దరే నిజం. వాళ్ళిద్దరే వున్నారు.

ఎన్నో రోజుల ఎడబాటు తరువాత, 'కలవడం కల్ల' అనుకున్న తరువాత ఒకరికొకరు వున్నారో లేరో అన్న సందిగ్ధంలో ఇన్నాళ్ళూ కుమిలిపోతున్న సమయంలో ఇలా కలుసుకోవడం ఎంత ఆనందం. అది ఆనందమేనా...అంతకంటే ఎక్కువదే! అదేమిటో, ఆ అమితానందం పేరేమిటో వాళ్ళకి తెలీదు.

"ఇంక మనల్ని ఎవరూ వేరు చేయలేరు శివా" గంగ అంది.

"ఔను గంగా"

"బతికితే కలిసే బతుకుదాం. చస్తే కలిసే చద్దాం"

"నీతో నాకు ఒక్క క్షణం జీవితమైనా చాలు గంగా"

"నాకు చాలదు శివా! నీతో కలిసి ఎన్నో జీవితకాలాలు ఒక జీవితంగా గడపాలనివుంది" గంగ అంది ఆవేశంగా.

శివ ఆమె కళ్ళలోకి చూస్తూ వుండిపోయాడు.

"మాట్లాడవేం శివా?" గంగ అంది గోముగా.

"నువ్వు మాట్లాడుతూవుంటే వినాలనిపిస్తోంది గంగా"

"మనం మళ్ళీ ఇలా కలుస్తామనుకున్నావా నువ్వు?"

"ఆశైతే వుండేదిగాని నమ్మకంలేదు"

"పిచ్చి శివా! నదులు ఎక్కడెక్కడో పుట్టి ఎక్కడెక్కడో ప్రవహించి, చివరికి సముద్రుణ్ని చేరతాయి. ఈ గంగ-ఎన్ని చిక్కులు వచ్చినా, ఎన్ని అడ్డంకులు వచ్చినా, చివరికి ఈ శివుణ్నే చేరుతుంది" గంగ అతని చేతిని తన చెక్కిలికి హత్తుకుంటూ అంది తన్మయత్వంతో.

ఆ తన్మయత్వంలో అప్పటికే వాళ్ళచుట్టూ పదిమంది మూగారని వాళ్ళిద్దరికీ తెలియలేదు.

"మనం ఇక్కణ్నించి ఎక్కడికేనా దూరంగా వెళ్ళిపోదాం శివా" కళ్ళు మూసుకునే అంది గంగ.

"అలాచేస్తే నిన్ను అందరూ ఆడిపోసుకుంటారు గంగా! అలా వెళ్ళినా

 

పెళ్ళిచేసుకోని వాళ్ళందరికీ మనం కనబడాలి. నిన్ను ఎవరేనా పల్లెత్తు మాటంటే నేను సహించలేను"

"నాకు నువ్వు, నీకు నేను. ఈ ప్రపంచంతో మనకేమీ సంబంధంలేదు శివా"

"చాల్లే ఇక...లే" అంటూ భూషణం గంగ జబ్బపట్టుకునిశివానుంచి విడదీసాడు.

"పిణ్ని తీసుకుపోయి గోదారిమధ్యలో వున్న మన లంకపొలం మకాంలో కట్టి పారెయ్యండ్రా! పెళ్ళి అయ్యాక చూసుకుందాం! సమయానికి దొరయ్యా లేకపోబట్టి సరిపోయింది. లేకపోతే పెళ్ళికి ముందేఈడిపనిపూర్తయిపోయేది"అంటూ జీపువైపు నడిచాడు భూషణం గంగతో కలిసి.

దుక్కోడు, బక్కోడు శివాని బలవంతంగా లాక్కుపోతున్నారు. భూషణం గంగను గింజుకుంటున్నా వదలకుండా జీపులో కూర్చోబెట్టుకొని వెళ్ళిపోయాడు.

## 12



భూషణం జీపులోంచి దిగి గంగను ఇంట్లోకి తీసుకెళ్ళాడు. ఇంటినిండా ప్పటికే బంధువులున్నారు.

లోపలి గదిలోకి తీసుకెళ్ళాడు గంగని. ధమ్మని పిలిచాడు.

జరిగిన సంగతి ధనమ్మకి తెలుసు. ధన్మ గంగ కనబడటంలేదని చెబితేనే భూణం వెళ్ళి వెతికి తీసుకొచ్చాడు.

ధనమ్మకి మాత్రమే అర్థమయ్యేలా, "పెళ్ళికూతుర్ని చేసాక కూడా అమ్మాయి తెలియకబయటకెడితే చూసుకో అనక్కర్లేదా నువ్వు? పెళ్ళికూతుర్ని చేసాక గడప దాటి బయటకెళ్ళకూడదని అమ్మాయికి చెప్పడం మరచిపోయావా?" అన్నాడు భూషణం.

"వెళ్ళడం నేను చూడలేదు. చూస్తే వెళ్ళనిచ్చేదాన్ని కాదు" అంది ధనమ్మ.

"ఇంక జాగ్రత్తగా చూసుకో'' అని బయటికి వెళ్ళిపోయాడు భూషణం.

"ఏమిటమ్మా ఈ పని? నలుగురికీ తెలిస్తే తలెత్తుకోగలమా?" అంది ధనమ్మ కాస్త మందలింపుగా గంగతో.

"నా బొందిలో ప్రాణంవుండగా ఈ పెళ్ళి జరగదు. తాళి కడితే నా శ వా ని కే" అంది గంగ ఏడుస్తూ నిస్సహాయంగా.

"చాల్లే వూరుకో. ఎలా జరిగేది అలా జరుగుతుంది. ఎవరేనా వింటే బాగోదు" అంది ధనమ్మ అనునయంగా గంగతో. గంగను రెచ్చగొట్టడం ధనమ్మకి ఇష్టం లేదు.

"అత్తా ! నాకో చిన్న వుపకారం చేస్తావా?" అంది గంగ.

''ఏమిటి?''

"చేస్తానని మాటిస్తే చెబుతాను"

''చెప్పమ్మా! నీకంటె నాకెక్కువెవరు చెప్పు. వరసకి మేనకోడలివిగాని నిన్ను కూతురులాగే చూసుకుంటున్నానుగా" అంది ధనమ్మ.

"నేనీ పెళ్ళి చేసుకోవడం తప్పకపోతే తాళి కట్టించుకొనే వేళకి నేను కన్ను మూసేలా నాకు కాస్త విషం తెప్పించి పెట్టు అత్తా"అంది గంగ ఏడుస్తూ. తనని

ఇంక బయటకి వెళ్ళనిస్తారన్న నమ్మకం పోయింది గంగకి. అందుకే అలా నిస్పృహగా మాట్లాడింది. అంత పనీ చేయడానికి సిద్ధంగానే వుంది.

గంగ మాటలకు ధనమ్మ మనసు నీరైపోయింది. కళ్ళ నీళ్ళు తిరిగాయి.

"నేనందుకే నీకు ఉపయోగపడతా ననుకున్నావా అమ్మా" అంటూ బయటకు వెళ్ళిపోయింది ధనమ్మ.

దిండులో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది గంగ.

చుక్క వచ్చింది గదిలోకి.

నిజానికి చుక్కని ధనమ్మే పంపింది. ధైర్యంచెప్పి వూరుకోబెట్టమని చెప్పి పంపించింది.

"లేచి భోజనం చెయ్యండమ్మాయి గోరూ" అంది చుక్క.

గంగ కళ్ళు విప్పి చూసింది.

"నా మాటినండి అమ్మాయిగోరూ... లెగిసి భోంచెయ్యండి. మీరు భోజనం సెయ్యకపోతే ఎందుకు, ఏంటి అని అందరూ అడుగుతారు. నా మాటినండి" అని బతిమాలింది చుక్క.

ఇంతలో నాగమ్మ వచ్చింది గదిలోకి.

"ఏవమ్మా! లేచి భోంచెయ్యకుండా అలా పడుకున్నావేంటి? వంట్లో బాగోలేదా?" అంటూ మనుమరాలి మెడమీద చేయివేసి చూసింది నాగమ్మ.

"నాకు ఆకలిలేదు బామ్మా" అంది గంగ వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

నాగమ్మకి శివా ఈ వూళ్ళోనే వున్నాడని తెలీదు. శివా అంటే గంగకి ఇష్టం అని తెలుసు. శివా బతికేవున్నాడని తనొక్క రికే తెలుసుననీ, గంగకు తెలీదనీ నాగమ్మ నమ్మకం. నాగమ్మ శివా సంగతి చెప్ప దల్చుకోలేదు కూడా. చెబితే ఆ పిల్ల ఈ పెళ్ళికి వప్పుకోదని నాగమ్మకి తెలుసు. గంగ అలా వుంటే శివా గుర్తొచ్చాడు నాగమ్మకి. ఆ జ్ఞాపకాన్ని అలాగే మనసులోనే దాచేసుకొని "అలా అన కూడదమ్మా...కాసిన్ని పాలేనా తాగి పడుకో. పెళ్ళికూతురు లంఖనం వుండ కూడదు'' అని బతిమాలింది నాగమ్మ గంగను.

"నేను అట్టుకొచ్చి యిత్తాలెండి పాలు" అంది చుక్క.

"కాస్సంత నువ్వే దగ్గరుండి చూసుకో పిల్లని. అది ఒట్టి వెర్రిబాగుల పిల్లే" అంటూ బయటకెళ్ళిపోయింది నాగమ్మ.

"శివాని లంకలోని మకాంలో దాచ మన్నాడు మావయ్య. అదెక్కడుందో నీకు తెలుసా" గంగ అడిగింది చుక్కను.

"గోదారి మధ్యలో వుంది'' అంది చుక్క.

"ఎలా వెళ్ళడం అక్కడికి?"

"అసలు ఎవరెళ్ళనిత్తారు మిమ్మల్ని అమ్మాయిగోరూ?''

"వాళ్ళని అడిగి అనుమతి తీసుకొని వెడతానా? కాస్త నాకు తోడురా. దారి చూపించు. నీ మేలు నేను జన్మలో మరిచి పోలేను చుక్కా! ఇద్దరం ఒక వూరివాళ్ళం. నీ చిన్నప్పటి నుంచి మా ఇంటి దాకలివి. ఈమాత్రం వుపకారం చెయ్యవే" గంగ బతిమాలింది.

"మీరింతబతిమాలక్కర్లేదుఅమ్మాయి గోరూ...మీకు ఎలాసాయం చెయ్యగనా అనే నేనూ ఆలోచిత్తన్నాను. నా పాలు పోయినా ఫరవాలేదమ్మాయిగోరూ! మీకు సాయపడగలిగితే అదే పదివేలు నాకు. కాని మీరు ఇలా వుంటే మాత్రం నా వల్లకాదు"




"మరేం చెయ్యమంటావూ?ఎలా వుండమంటావు?"

"లేచి నవ్వుతూ ఇల్లంతా తిరగండి. అందరితో మాట్లాడండి. కలివిడిగా కలుపుగోరుతనంగా వుండండి. దొరయ్య గారు వచ్చాక జరిగినదానికి ఏమీ అనుకోవద్దని, ఈ పెళ్ళి ఇష్టమేనన్నట్లు మాట్లాడండి. అంతా మిమ్మల్ని నమ్ముతారు. మీ గురించి అంత పట్టించుకోరు. అప్పుడు ఎలాగోలా ఇంట్లోంచి బయటపడొచ్చు. ఇంట్లోంచి బయటపడితే మిమ్మల్ని శివయ్యబాబుకాడకి ఎట్టాగోలా చేరుత్తాను" అంది చుక్క.

చుక్క సలహా గంగకు నచ్చింది.

"నువ్వు చెప్పినట్లే చేస్తాను. నన్ను శివా దగ్గరకి చేర్చాల్సిన బాధ్యత నీదే" అంది గంగ.

* * *

చుక్క సలహా విన్నతరువాత గంగలో మార్పు వచ్చింది.

తమ్ముణ్ని పిలిచి ఆడుకోడం మొదలెట్టింది. ధనమ్మ దగ్గరకెళ్ళి "అత్తా! నాకు జడవెయ్యవా" అంది నవ్వుతూ.

బామ్మతో కలివిడిగా పిచ్చాపాటి మాట్లాడింది. తన తండ్రి శ్రీరాములు దగ్గరకెళ్ళి కాసేపు కూర్చుని చక్కగా మాట్లాడింది. వూళ్ళో అందర్నీ పెళ్ళికి పిలిచారా అని అడిగింది.

శ్రీరాములు వచ్చి రెండు రోజులు అయినా, వచ్చినరోజున ముక్తసరిగా శ్రీరాములు పలకరిస్తే గంగ బదులు చెప్పడమే తప్ప తండ్రీ కూతుళ్ళ మధ్య వుండాల్సినంత ఆప్యాయత కనబరచలేదు గంగ. శ్రీరాములు కనబరచడానికి అవకాశమూ ఇవ్వలేదు గంగ.

తన వూరు వదిలివచ్చాక గంగా, శ్రీరాములూ ఇంత ఆప్యాయంగా మాట్లాడుకోవడం ఇదే మొదటిసారి. శ్రీరాములు మనసుకు కాస్త వూరట దొరికింది గంగ ప్రవర్తనలో వచ్చిన మార్పు మూలంగా.

"నువ్వు సుఖంగా వుండాలనేనమ్మా మా ఆరాటం" అన్నాడు శ్రీరాములు జరిగినదానికి సంజాయిషీ చెప్పుకుంటున్నట్లుగా.

దొరయ్య వచ్చాడు.

గంగే స్వయంగా ఎదురెళ్ళి కాళ్ళు కడుక్కుందుకు నీళ్లు అందించింది.

మంచినీళ్లు, కాఫీ అందించింది.

దొరయ్య తను చూస్తున్నది నిజమో అబద్ధమో నమ్మలేని స్థితిలో పడ్డాడు. తను అంటే గంగకి మంటని తెలుసు. చేయి మీద పచ్చబొట్టు కోసేసిన తరువాత తనంటే అసహ్యమని కూడా తెలుసు. ఆ తరువాత ఎప్పుడూ ఇంత ఇదిగా తనతో లేదు గంగ.

"నువ్వు తెచ్చినచీరలన్నీ బాగున్నాయి బాబాయ్" అంది గంగ.

"నీకు నచ్చితే చాలమ్మా" అన్నాడు దొరయ్య.

"జరిగిందేదీ మనసులో వుంచుకోకు బాబాయ్! నేను ఎక్కడున్నా నువ్వు నన్ను చూడ్డానికి వస్తూవుండాలి" అంది గంగ.

దొరయ్య కళ్లు చెమ్మగిల్లాయి.

"పిచ్చిపిల్లా...నీమీద నాకు కోపం ఎప్పుడూ లేదమ్మా! నువ్వు సుఖంగా బతకాలనే మా తాపత్రయం తల్లీ" అన్నాడు దొరయ్య.

ఇంట్లోఅంతా గంగలో వచ్చిన మార్పు మూలంగా ఎంతో హాయిగా వున్నారు.

పెళ్ళిరోజు సాయంత్రానికి మొగ పెళ్ళి

వారు వచ్చారు. విడిదిలో దిగారు.

మొగ పెళ్ళివారి తాలూకు ఆడవాళ్ళు కొంతమంది పెళ్ళికూతుర్ని చూడ్డానికి వచ్చారు. గంగ చక్కగా ముస్తాబై వచ్చిన వారితో కలివిడిగా మాట్లాడింది. అంతా పెళ్ళికూతురు బాగుందనీ, మంచి అమ్మాయనీ అనుకొని వెళ్ళిపోయారు.

గంగ కళ్లు ప్రతిక్షణం చుక్క మీదే వుంటున్నాయి.

చీకటి పడింది.

తెల్లవారుఝామున పెళ్ళికావడంతో అంతా ఎవరి పనుల్లో వాళ్లు వున్నారు. భోజనాల ఏర్పాట్లు, ఆ తరువాత పేకాట ఏర్పాట్లు భూషణం, దొరయ్యా చూసుకుం





టున్నారు. వేసవికాలం మూలంగా చెమటలు పడుతున్నాయి.

భోజనాల పంక్తి దగ్గర భూషణం ఫేనులు ఏర్పాటు చేసాడు. అయినా ఉక్కగానే వుంది. గంగ తన గదిలో వుంది. ధనమ్మ కూడా అక్కడికి వచ్చింది ఏదో సరుకులు తీసుకుందుకు.

చుక్క గంగ దగ్గరే వుంటోంది.

ధనమ్మ వచ్చినప్పుడు, "మొగమంతా ఎలా చెమటలు పట్టేసాయో చూడండి. ఓపాలి తానం సేయిత్తాను రండమ్మాయి గోరూ" అంది చుక్క గంగతో.

"జానే! ఎన్నిసార్లు స్నానంచేసినా ఇంకా చెయ్యాలనిపిస్తోంది ఈమాయదారి వుక్కమూలంగా" అంది ధనమ్మ.

ఆ ఆసరాతో "లెగండమ్మాయిగోరూ" అంది చుక్క.

ఇద్దరూ స్నానాల గదిలోకి వెళ్లారు.

"ఇప్పుడెందుకు చుక్కా స్నానం పెట్టావు" అంది గంగ.

"నేను చెప్పినట్టు సెయ్యండమ్మాయిగోరూ! నా బట్టలు మీరు కట్టుకోండి. జుట్టు నాకుమల్లే కొప్పెట్టుకోండి. ఈ బట్టల మూట నెత్తినెట్టుకోండి. ముఖం ఎవరికీ అంత బాగా ఆపడదు. నేను ఈ గదిలోనే వుండి చెంబుతో చిందిన సప్పుడు సేత్తానే వుంటాను. బయటకి గోడమీద మీ బట్టలు ఆపడతానే వుంటాయి. 'లోపల ఎవరే' అని ఎవరేనా అంటే, 'అమ్మాయిగోరు తానంసేత్తన్నారండి' అని నేను చెబుతానే వుంటాను.
మీరు ఏటిగట్టుకు ఎల్లిపోవాలి. నేనొచ్చి మిమ్మల్ని చేరుకుంటాను" సలహా ఇచ్చింది చుక్క గంగకి.

చుక్క చెప్పినట్లే చేసింది గంగ.

కాసేపయ్యాక ధనమ్మ స్నానాల గది వైపువచ్చి, "ఇంకా స్నానం అవలేదటే" అంది.

"అయిపోయిందండి... వచ్చేత్తన్నారు" అని బదులు చెప్పింది లోపలినుంచి చుక్క.

ఆ తరువాత స్నానాల గదిలోవున్న ఏదో సాదా చీర చుట్ట బెట్టుకొని బయట పడింది చుక్క.

పెరటి దారినే పరుగెత్తింది.

గంగ ఏటిగట్టు చేరుకునేసరికి చుక్క కూడా చేరింది గంగ దగ్గరకు.

గంగను అక్కడవున్న పడవలోకి ఎక్కించింది చుక్క.

చుక్క తెడ్లు అందుకుంది. లంకవైపు పడవపోతోంది.




లంకలోని మకాంలో శివాను ఓ గదిలో పడేసి తలుపులు బయటకివేసి, గుమ్మం ముందు దుక్కోడు, బక్కోడు, మరో ఇద్దరూ కాపలావున్నారు. శివా గదిలోంచి ఎలా బయటపడాలా అని వేయివిధాల ఆలోచిస్తున్నాడు. తెల్లవారుఝామున పెళ్ళి అని తెలుసు. అంతకుముందు గుడికి వస్తానని గంగ చెప్పింది. ఆ సమయానికి ఎలాగైనా గోదారిదాటి గుడికి చేరుకోవాలని శివా తాపత్రయం.

ఆ గది మిద్దె గది కాదు. ఎలాగోలా గోడెక్కి అవతల పక్కకు దిగగలిగితే గుమ్మందగ్గర వున్న వాళ్ళ కంటపడకుండా గోదారి గట్టుకు చేరొచ్చు. ఏదో పడవ వుండే వుంటుంది. లేకపోతే ఏదో ఒకటి చెయ్యొచ్చు. ఈ ఆలోచన బాగానే వున్నట్లు అనిపించింది శివాకు. ఎదురుపడవాళ్లతో కొట్లాడే శక్తి తనకిలేదు. వాళ్లు నలుగురు, తను ఒక్కడు. 'ఇదే మంచి ఆలోచన' అనుకొని నెమ్మదిగా గోడకి జారేసివున్న నాగలిని ఆసరాగా చేసుకొని గోడ పైఅంచు అందుకున్నాడు.

నెమ్మదిగా, వాదిగి వాదిగి చూరు లోంచి దూరి వళ్ళు కొట్టుకుపోయినా

లెక్క చెయ్యకుండా ఆవలి పక్కకు దిగాడు శివ.

ఆ చీకట్లో ఆల్లంతదూరాన నక్షత్రాల వెలుగులో మెరుస్తున్న గోదారివైపు నడిచాడు.

* * *

పడవ లంక రేవు చేరుకుంది. గంగ, చుక్క దిగారు. మకాంవైపు దారి తీసింది చుక్క. వెనకే గంగ.

ఎవరో తమవైపే రావడం చూసింది చుక్క.

"ఎవరో వత్తన్నారు! ఈ రెల్లుదుబ్బు చాటుకి తప్పుకోండమ్మాయిగోరూ" అంది చుక్క.

ఇద్దరూ రెల్లుదుబ్బు చాటుకి తప్పుకున్నారు. ఆ మనిషికూడా అటేవచ్చాడు. తలవొంచుకుని వడివడిగా నడిచి పోతున్నాడు.

"శివాయేనే" అంది గంగ చుక్కతో.

ఆ మాటలు శివాకి వినిపించాయి ఆ నిశ్శబ్దంలో.

"శివయ్య బాబూ!" పిలిచింది చుక్క.

"ఎవరూ?" శివా వెనక్కి తిరిగాడు.

"మేవే బాబూ! గంగమ్మగోరొచ్చింది" అంది చుక్క.

ఇద్దరూ ఒకరినొకరు హత్తుకున్నారు.

"నిన్ను మళ్లీ చూస్తాననుకోలేదు శివా'' అంది గంగ.

"ఇయ్యన్నీ తరువాత మాట్లాడుకుందురుగాని అమ్మాయిగోరూ! ముందు పడవెక్కండి. దూరంగా ఎక్కడికో ఎల్లేక మీ ఇట్టమొచ్చినంతసేపు వూసులాడుకోవచ్చు. ఇక్కడ ఇంకో చెనంసేపున్నా మళ్లీ మీరిడిపోవటమే అవుద్ది. ఈపాటికి మీకోసం వెతుక్కుంటూనే వుంటారు ఇంటికాడ. ముందు పడవెక్కండి" అని తొందరచేసింది చుక్క.

గంగా, శివా చుక్క వెనక నడిచారు. ఇద్దర్నీ పడవెక్కించింది చుక్క.

"ఇంక మీరెళ్ళండి అమ్మాయిగోరూ. నే దిగెడతాను" అంది చుక్క.

గంగ చుక్కకి చేతులెత్తి నమస్కరించింది.

"నువ్వు జాగ్రత్తే! మావాళ్ళు నిన్నేం చేస్తారోననిభయంగావుంది" అంది గంగ.

"నేనేంతప్పుసెయ్యలేదమ్మాయిగోరూ! నాకేంభయంలేదు. మీరు సల్లగా వుండాలి.. అంతే!" అంటూ ఒడ్డునే నిలబడిపోయింది చుక్క.

పడవలో శివా, గంగ గోదావరిలో ప్రయాణం..గమ్యంతెలియని ప్రయాణం.

తెలతెలవారుతోంది. పక్షుల కిలకిలా రావాలు వినిపిస్తున్నాయి. శివా వడిలో పడుకున్న గంగకు మెళకువ వచ్చింది. శివా అలా తెడ్డు వేస్తూ పడవను గోదారికి వాలుగానే నడుపుతున్నాడు.

ఎదురుగా ఏదో పడవ వస్తున్నట్లు కనిపించింది శివాకు.

వెనక్కి చూసాడు.

వెనక కూడా పడవే.

ఎటు చూసినా పడవలే.

నాలుగువైపుల్నుంచీ నాలుగు పడవలు తన పడవను చుట్టుముట్టాయి. గోదావరి ఒడ్డున గుర్రంమీదదొరయ్య కనిపించాడు.

"వాణ్ణి గోదాట్లోకి తోసేసి అమ్మాయిని తీసుకురండి" దొరయ్య అరిచాడు.

గంగ కళ్ళు తెరిచింది. పడవలు దగ్గరౌతున్నాయి.

"శివా" అంటూ శివాని గట్టిగా కౌగలించుకుంది. ధైర్యం తెచ్చుకుంది.

''మమ్మల్నిద్దర్నీ మీరెవ్వరూ వేరు చెయ్యలేరు. బతికితే ఇద్దరం కలిసే

బతుకుతాం. చస్తే ఇద్దరంకలిసే చస్తాం.మీ చేతికి చిక్కితే ఒకర్ని చంపుతారు.ఒకర్ని బతికించి నిత్యం చంపుతారు. మీరు ఎవరు పడవ దగ్గర కొచ్చినా జాగ్రత్త" అంది గంగ.

"దానిమాటలకేంలే ... ముందు కెళ్ళండి" అనరిచాడు దొరయ్య. శ్రీరాములూ, భూషణంకూడా వచ్చారు ఆ సమయానికి అక్కడికి.

"నిన్ను సారీ చీరా పెట్టమనలేదు. కట్నకానుకలు ఇమ్మనలేదు నాన్నా... నాకునచ్చిన వాడితో నన్ను బతకనిమ్మన్నాను. ఈ చిన్నకోరిక కూడా తీర్చలేవా నాన్నగా?" అంది గంగ తండ్రితో.

శ్రీరాములు మాట్లాడలేదు. అతనికి మాటలు రాలేదు. రావటం లేదు.

పడవలు దగ్గరయ్యాయి.

"ఇంక లాభంలేదు గంగా" అన్నాడు శివా.

ఇద్దరూ ఒక్కక్షణం ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

ఇద్దరూ కౌగలించుకొని అలాగే గోదావరిలోకి దూకేసారు.

పడవలోనివాళ్ళు కూడా కొందరు గోదావరిలోకి దూకారు.

గంగా, శివా గోదావరిలోకి దూకగానే "అమ్మా ... గంగా!" అన్నాడు శ్రీరాములు. భూషణం గుండెఝల్లుమంది.

ఎంత వెతికినా ఎవరికీ దొరకలేదు వాళ్ళిద్దరూ.

ఎక్కడికి కొట్టుకుపోయారో? ఎక్కడ తేలేరో?

బతికే ఒడ్డుకి చేరారో? శవాలే ఒడ్డుకి చేరాయో?

పెళ్ళివారిల్లు నిశ్శబ్దం అయిపోయింది.

మొగ పెళ్ళివారు వెళ్ళిపోయారు.

ఈ వార్త విన్న నాగమ్మ క్షణంపాటు కొయ్యబారిపోయింది. ఆమె కళ్ళలో నీళ్ళురాలేదు.

కొడుకులిద్దరూ అరుగుమీద కూర్చున్నారు. వాళ్ళ దగ్గరకెళ్ళింది.

శ్రీరాములు తల్లిని చూసి బావురుమన్నాడు. దొరయ్య తల వంచుకున్నాడు.

"నా మనమరాలు తప్పుచెయ్యదురా! దానికి తప్పుచెయ్యడం రాదు. ఏడడుగులు నడిస్తేనే పెళ్ళయినట్టంటారు. ఆ శివాతో దానికి అంతకంటె ఎక్కువ సంబంధమే. ఆడే తన మొగుడనుకుంది. అందుకే మీరంతా వంశం, పరువు, హోదా అని మరొకడికిచ్చి దాన్ని కట్టబెట్టాలనుకున్నా అది ఒప్పుకోలేదు...తలవంచలేదు. అది మనసారాకట్టుకున్నోడ్ని కాదని మరొకడికి కట్టబెడితే ఓ సంసారిని వ్యభిచారిగా మార్చడమేకదా! ఆమాత్రం జ్ఞానం మీకు లేకపోయింది. నా బిడ్డకుంది.అందుకే అది మీరు తప్పు చేయించాలనుకున్నా. తప్పు చేయకుండా ఒప్పే చేసింది. అది నా మనవరాలురా'' అంది నాగమ్మ ఆవేశంగా!

''ఎక్కడున్నా బతికుంటేచాలే" అన్నాడు శ్రీరాములు.

"మీరుండనిస్తార్రా ఆళ్ళని ఈ భూమ్మీద" అంది నాగమ్మ వెటకారంగా దొరయ్యను చూస్తూ!

దొరయ్య తల వంచుకున్నాడు.

అంతా అనుకున్నారు మనస్సులోనే–వాళ్ళిద్దరూ ఎక్కడున్నా బతికుంటే బాగుండునని!

అంతమందీ వాళ్ళు ఇద్దరూ బతికేవుండాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూంటే వాళ్ళు బతికే వుంటారు ఎక్కడో!



# చతుర ఫీచర్

భారతీయ శృంగార జీవనంలో నాట్య గత్తెలు, వేశ్యల ప్రభావం విడదీయ రానంత గాఢమైనది! పూర్వం మన దేశపు నాట్యగత్తెలలో 3 వర్గాలుండేవి. దేవుళ్లకి అంకితమైపోయి దేవాలయాలలో నాట్యం చేస్తూ 'దేవదాసీలు'గా వ్యవహరింపబడిన వాళ్ళు మొదటి వర్గానికి చెందుతారు. ఆస్థాన నాట్యగత్తెలుగా మహారాజులచే

క్రీ.పూ. 4వ శతాబ్దంనాటి మౌర్య ఆస్థానంలో వేశ్యలు ప్రభుత్వ ఆధీనంలో వుండేవారు. వారిపై అజమాయిషీకి గణికాధ్యక్షుడనే పర్యవేక్షణాధికారి వుండేవాడు. ఆ కాలంలో వేశ్యకు అందం, యవ్వనం వుంటే సరిపోయేదికాదు. కొన్ని ఇతర కళలలో కూడా వారు ప్రవీణులై వుండాలి. అందుకోసం వేశ్యలకి వీణ, వేణువు,



# అలనాటి శృంగారజీవనం

నియమితులైనవారు రెండవ వర్గం. వయసు ఉడిగి, శరీరాకర్షణ కోల్పోయాక ఇతర వృత్తులలోకి మార్చబడేవారు. మూడో వర్గం సామాన్యులనుంచి ప్రసిద్ధులవరకూ తమ ఆటపాటలతో రంజింపచేయటమేకాక వుంపుడుగత్తెలుగా కూడా జీవించేవారు. ఆనాటి నాట్యగత్తెల ఆదాయంపై పన్నులు వసూలు చేయడంవలన ప్రభుత్వానికి రాబడి కూడావుండేది. హిందూ రాజుల కాలంలో అంతగా ప్రాచుర్యంలో లేని ఈ నాట్యగత్తెలకి మహమ్మదీయ, సిక్కు రాజుల ఆస్థానాలలో మంచి ఆదరణ లభించి, అది 19వ శతాబ్దం వరకూ కొనసాగింది.

మృదంగంలాంటి సంగీత వాయిద్యాలను వాయించడంలోనూ, రాయడం, చదవడం, నృత్యం, నటన, చిత్రకళ, మనోభావాలను చదివే కళ, సెంట్ల తయారీ, ఇతరుల్ని ఆకర్షించి, ఆకట్టుకునే నేర్పు వంటి విద్యలను బోధించేందుకు కొందరు గురువుల్ని ప్రభుత్వమే నియమించేది.

ఆస్థాన వేశ్యలు పూర్తిగా ప్రభుత్వ ఆధీనంలోనే వుండేవారు. వేశ్యలలో ఎవరయినా పరదేశానికి వెళ్ళినా, చనిపోయినా ఆమె కూతురు, లేకుంటే సోదరి ఆమెకు బదులుగా ఆమె ఆస్తిపాస్తుల్ని,

ప్రభుత్వం ఇచ్చే వేతనాన్ని పొందేది. అందుకై ప్రతివేశ్య నియామకానికిముందే తన స్థానంలో తనకు బదులుగా వ్యవహరించేందుకు మరొకరిని సూచించాలి. అలా ఎవరూ లేనట్లయితే ఆమె ఆస్తి సమస్తం రాజు పరమవుతుంది.

ఆస్థాన వేశ్యకి ఎవరయినా హానిచేస్తే జరిమానాగా 72వేల పణాలు (ఒక్కొక్క పణా 11 అణాలకి సమానం) చెల్లించాలి. వేశ్య తల్లికి, కూతురికిగాని పూలమాలలు, సెంట్లు తయారుచేసే దాసీలకిగాని హాని చేసినవారికి జరిమానా 500-1000పణాల మధ్య వుండేది. ఆస్థానంలోకి కొనబడిన ఈ వేశ్యలు 24 వేల పణాలు చెల్లించి తిరిగి స్వేచ్ఛ సంపాదించవచ్చు. వేశ్య కొడుకు ఆ మొత్తంలో సగం చెల్లించి స్వేచ్ఛాజీవి కావచ్చు!

ఆస్థానవేశ్యలందరిఆదాయవ్యయాలపై అదుపు వుండేది. వేశ్యల ఆదాయం, వారసత్వపు ఆస్తి,వ్యయం మొదయిన వివరాలు పర్యవేక్షణాధికారికి తెలియపరచవల్సి వుండేది. ఆస్థాన వేశ్య తన సగలను తల్లికి తప్ప, ఇతరులకి ఎవరికయినా ఇస్తే నాలుగున్నర పణాల జరిమానా విధించేవారు. తన అధీనంలోవున్న ఆస్తిని అమ్మడంగాని, తాకట్టు పెట్టడం గాని చేస్తే యాభయిం పావు (50¼) పణాల జరిమానా. వేశ్య నెలకి రెండుసార్లు తన ఒకరోజు సంపాదనను ప్రభుత్వానికి కట్టాలి. ఆవిధంగా వచ్చిన రాబడి మొత్తాన్ని మధ్యయుగ కాలంలోని విజయనగర చక్రవర్తి రక్షణ దళానికి జీతాలు చెల్లించడానికి వినియోగించేవాడు.

ఆస్థాన వేశ్యల శృంగార వ్యవహారాలలో కూడా ప్రభుత్వం జోక్యం చేసుకొనేది. వేశ్య ఎవరితోనైనా శృంగారానికి అంగీకరించకపోతే రాజాజ్ఞ ప్రకారం ఆమెను వేయి కొరడా దెబ్బలు, లేదా 5 వేల పణాల జరిమానాతో శిక్షించేవారు. విటుని దగ్గర డబ్బు తీసుకున్నాక అతన్ని తిరస్కరిస్తే ఆ మొత్తానికి రెట్టింపు తిరిగి చెల్లించే శిక్ష పడేది. ప్రతి వేశ్య తన రోజువారీ సంపాదన, విటుల పేర్లను గణికాధ్యక్షుడికి తెలియపరచాల్సి వుండేది.

ఆ కాలంలో ప్రతి వేశ్యకీ కొన్ని హక్కులుండి అవి పరిరక్షింపబడేవి. వేశ్యను ఎవరైనా బలాత్కరించినా, వ్యక్తిగత ద్వేషంతో ఆమెను కురూపిని చేసినా జరిమానా 1 వేయి నుంచి 40వేల పణాల దాకా వుండేది. ఆ నేరం వెనుక గల పరిస్థితులు, ఆ వేశ్య హోదాలపై జరిమానా ఎంత నేది ఆధారపడేది. విటుడిని సుఖపెట్టని వేశ్య తను తీసుకున్న సొమ్ముకు ఎనిమిదింతల మొత్తాన్ని జరిమానాగా కట్టాలి. వేశ్య నగలను, డబ్బును విటుడు దొంగిలించడమో, ఆమెకివ్వాల్సిన డబ్బును ఇవ్వకపోవడమో జరిగితే దానికి శిక్షగా ఎనిమిదింతలు జరిమానా చెల్లించాలి. విటుడిని హత్య చేసిన వేశ్యను సజీవంగా కాల్చి, లేదా నీటిలో ముంచి చంపేవారు.

వయసుడిగిన ఆస్థాన వేశ్యలకు ప్రభుత్వ నేత సంస్థల్లోనో, ప్రభుత్వ గిడ్డంగి లేదా రాజభవనంలోని వంటశాలలోనో ఉద్యోగం కల్పించేవారు. ప్రభుత్వ గిడ్డంగులలో వాళ్లు ధాన్యపు గింజలను కొలచడం,తూచడం,నిల్వచేయడం, పప్పు, కాయధాన్యాలను దంచడం,పిండిచేయడం, పానీయాలు, చెరుకురసం తయారు చేయడం లాంటి పనులలో నియమితుల యేవారు. కొందరికి నర్సుల, మంత్ర

సానుల విధులను అప్పగించేవారు.

8వ శతాబ్దంలో లలితాదిత్య ముక్తపీడ అనే రాజు ఏలుబడిలో కాశ్మీర్‌లో కూడా దేవదాసీ విధానం వున్నట్లు తెలుస్తోంది. క్రీ.శ. 713 నుంచి 750 సం॥వరకూ కాశ్మీర్‌ను ఏలిన లలితాదిత్య ముక్తపీడకు వారసుడైన లలితపీడ వేశ్యాలోలుడు. వేశ్యల్ని, వందిమాగధుల్ని చుట్టూ చేర్చుకుని తన కొలువులోని ఉన్నతోద్యోగుల్ని కించపరుస్తుండేవాడు. వేశ్యల పాదముద్రలున్న దుస్తుల్ని ధరించమని గౌరవనీయ హోదాల్లోనివారిని బలవంతపెట్టేవాడు. ఆ తర్వాత 936-39 కాలంనాటి కాశ్మీర రాజు ఉన్మత్తవంతి, 939-948 కాలపు యశస్కర, 949-50లో పర్వగుప్త, 950-958 నాటి క్షేమగుప్త అనే రాజులు కూడా వేశ్యాలోలురిగా, పరస్త్రీ వ్యామోహపరులుగా పేరుపొందారు. వీరందరినీ మించి 1063-89 సంవత్సరాలలో కాశ్మీరు నేలిన కలశ అనే రాజు విపరీతమైన స్త్రీలోలుడిగా పేరుపడ్డాడు.

1442లో పర్షియన్ రాయబారి అబ్దుర్‌రజాక్ భారతదేశం వచ్చినపుడు విజయనగరాన్ని రాజధానిగా చేసుకుని 2వ దేవరాయలు పరిపాలిస్తున్నాడు. అబ్దుర్‌రజాక్ ఆనాటి వేశ్యల గురించి రాస్తూ, వారికి అందమైన, దివ్యమైన సొంత భవనాలు వుండేవని పేర్కొన్నాడు.

మధ్యయుగ కాలంలో ఉత్సవాలలో నాట్యగత్తెలవల్ల హంగు, సందడి పెరిగేవి. విజయనగరంలో జరిగే మహానవమి ఉత్సవంలో మొదటిరోజు చక్రవర్తి, ఇతర ఉన్నతోద్యోగులు, సైనికుల సమక్షంలో వారి నాట్యప్రదర్శనలు జరిగేవి. ఆ సమయంలో వాళ్లు ఒంటినిండా స్వర్ణాభరణాలు, విలువైన వాళ్ళ నగలు ధరించేవారు.

హిందూ రాజాస్థానాలలో కంటే ముస్లింరాజుల పరిపాలనలో నాట్యగత్తెలకి అధిక ప్రాధాన్యత లభించింది. ఒక్కొక్కప్పుడు ఆయా రాజులు ప్రజల బాగోగులు పట్టించుకోకుండా విందు వినోదాలతోనే కాలమంతా గడిపిన సందర్భాలూ వున్నాయి. 1441లో గుజరాత్‌లో అహ్మద్‌షా మరణానంతరం అతనికుమారుడు మొహమ్మద్‌షా సింహాసనాన్ని అధిష్టించాడు. అతను భోగలాలసుడై తను పరిపాలించడానికో దేశం వుందనీ, ప్రజల రక్షణాభారం తనదేననీ పూర్తిగా విస్మరించాడు.

మొగలురాజైన బాబర్‌కు మద్యపానం తప్ప నాట్యగత్తెలపై ఎలాంటి ఆసక్తి, మక్కువ వుండేవికావు. షాజహాన్ పరిపాలనలో మళ్ళీ నాట్యగత్తెలకు ఆదరణ పెరిగింది. సాధారణంగా వారి నృత్యాలు ఆగ్రా నగరంలో మాత్రమే జరిగేవి. సాయంత్రం 6 గంటలకు మొదలై 9 గంటలదాకా కొనసాగేవి. ఆ నాట్యగత్తెలకి మంచి పారితోషికం లభించేది.ఆ కాలంలో నాట్యగత్తెలకి, వేశ్యలకి ఎంతో స్వేచ్ఛ వుండేది. ఔరంగజేబు అధికారంలోకి వచ్చాక నాట్యగత్తెలంతా పెళ్లిళ్లు చేసుకోవాలి, లేదా రాజ్యం వదిలిపోవాలని ఆజ్ఞ జారీచేశాడు. దాని ప్రకారం కొందరు వివాహాలు చేసుకుని, కొందరు మరో రాజ్యానికి పలసపోగా, మరికొందరు చట్టాన్ని ఉల్లంఘించి చాటుమాటుగా తమ పాత జీవనాన్నే గడిపారు.

—జాకీ



# చతురకతలు

## రక్తం...! రక్తం...!

ఆరోజు సాయంత్రం అయిదు గంటకు లేచాను. మా ఆవిడన్న ప్రతి మాటకు "రైట్" చెప్పి, నైట్‌డ్యూటీకి బయలుదేరాను. ఇంతలో పక్కింటి పరంధామయ్య ఎదురై "ఏం నాయనా! ఈరోజు ఏ వూరు వెళుతున్నావు?" అని అడిగాడు.




''తెనాలి అండీ" అన్నా.

"అయితే ఒక్క క్షణం మా ఇంటికి వచ్చిపో బాబూ" అని అడిగాడు.

ఇంటికి చేరగానే, ఆయన భార్యని కేకేశాడు–

"ఏమే..సిద్ధం అయిందా?" అంటూ.

"ఏదో ఫలహారం చేయించాడు" అని లొట్టలు వేసుకుంటూ కూర్చొని ఎదురు చూడసాగాను.

ఇంతలో ఆవిడగారు ఓ పెద్ద జాడీ తీసుకొచ్చి ముందు పెట్టింది.

పరంధామయ్య నెమ్మదిగా, "మా అల్లుడికి ఎవరిచేతనైనా ఈ వూరగాయ పంపుతానని చెప్పాను నాయనా! అపద్బాంధవుడిలా తగిలావ్! బస్టాండు ఎదురుగానే అల్లుడి ఇల్లు. ఇది పట్టుకెళ్ళి ఇచ్చేయి నాయినా...పుణ్యం వుంటుంది" అన్నాడు.

నా గుండె గుభిల్లుమంది.

అడుగున్నర ఎత్తున్న ఆ జాడీ తీసుకెళ్ళాలా?

"ఏం బాబూ! ఏమైనా ఇబ్బందా?"

"అదేం లేదులెండి ... బస్సేగదా మోసేది!" అన్నాను నవ్వుతూ.

"బాగా చెప్పావబ్బాయ్! బస్సెవరిది? మనది! ప్రభుత్వ ఆస్తి ప్రజల ఆస్తిగా చూస్కొమ్మని చెప్పారుగా" అంటూ ఆ జాడీ నాకప్పగించేశాడు.

జాడీని ఒక చేత్తో పట్టుకోవటానికి కుదరలేదు. సచేనని తెగించి భుజంమీద పెట్టుకొని బయల్దేరాను.

దారిలో ఇద్దరు ముగ్గురు ఎదురుపడి, "ఏం బాబూ! వూరగాయా? ఎంతకిస్తున్నావు కిలో?'' అంటూ అడగనారంభించారు. ఇక లాభం లేదనుకుంటూ ఓ రిక్షాను పిల్చాను.

"బస్టాండుకు వస్తావా?"

"ఆ....అయిదు రూపాయలివ్వండి"

"అయిదా? సగం దూరం నడిచే వచ్చాను. ఇక ఫర్లాంగు దూరం కూడా లేదు. పోనీ రెండు రూపాయలిస్తా" అన్నాను.

వాడు నావంక బిచ్చగాణ్ణి చూసినట్లు చూస్తూ వెళ్ళిపోయాడు - బీడీపొగ నా మొహాన వదిలేసి.

'తాదూర కంతలేదు మెడకో డోలు' సామెత గుర్తొచ్చింది. జాడీని పక్కన వున్న కాలవలోకి విసిరి పడేద్దామనుకున్నా. కానీ రేపు వాళ్ళింటి మీదగానే రావాలి డ్యూటీకి. ఈ విషయం తెలిస్తే వాళ్ళు నన్నే వూరగాయ పెట్టుకొంటారు. టైము అవుతోందని మళ్ళీ జాడీ నెత్తిమీద పెట్టుకొని పరిగెత్తా బస్టాండుకి. ఇంతలో పక్క సందులోంచి ఓ కుక్క వచ్చి, నన్ను చూసి మొరుగుతూ నా వెంట పడింది.

నాకసలే కుక్కలంటే భయం. దానికితోడు పైన ఈ బరువు. దాంతో వేగం పెంచాను. ఆ కుక్క సగందూరం నా వెంట వచ్చి తిరిగి వెళ్ళిపోయింది.

ఎలాగయితేనేం అయిదు నిముషాల ముందుగానే విజయగర్వంతో స్టేషనులోకి అడుగుపెట్టా. అందరూ నన్నే చూస్తున్నారు. నాకేం అర్థం కాలేదు. తరువాత నెత్తిమీద బరువనిపించి వెంటనే నా బస్సులోకి ఎక్కి ఓ మూలగా దాన్ని పెట్టి దిగి మేనేజరు రూమ్‌లోకి వెళ్ళాను. టిక్కెట్ బంచ్, నా డబ్బుల తోలుసంచీ తీసుకొని మా డ్రైవరు వద్దకెళ్ళాను.

నన్ను చూడగానే డ్రైవరు పరిగెత్తుకుంటూ వచ్చి నన్ను మెడమీద చేయివేసి గట్టిగా పట్టుకొని ఎక్కడికో ఈడ్చుకుపోసాగాడు. నాకు వూపిరి ఆడటం లేదు.

"ఆ...ఆ..." మూలగసాగాను.

"ఫర్లేదు గురూ ... కాసేపు ఓపిక పట్టు" అన్నాడు వాడు వోదార్పుగా.

వాడి బారినుండి నా మెడ వదిలించుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాను. కానీ ఈ లోపల మరో నలుగురు వాడికి సాయం వచ్చారు "ఏం జరిగింది...ఏం జరిగింది" అంటూ. చివరికెలాగయితేనేం విడిచిపెట్టాడు.

"అమ్మా .... అబ్బా...'' అంటూ మెడ సవరించుకోసాగాను ఆ నొప్పికి. చేతికి ఏదో జిగటగా అంటితే చెయ్యి చూశాను. ఎర్రగా వుంది ... 'రక్తం'. నాకు ఏడుపుతో పాటు, కోపం వచ్చింది. డ్రైవరుతో ''నేనేం చేశాననీ! నా గొంతు పిసకటమే గాకుండా, బ్లేడుతో కోశావు? నేను తినే డబ్బుల్లో ఎప్పటికప్పుడు నీ భాగం నీకు ఇస్తూనే వున్నా నాకింత ద్రోహం తలపెడతావా?" అంటూ వాడి మీదకి దూకాను.

"ఆగు గురో ... నీవు నా దగ్గరికి రాకముందే నీ ముఖంమీద రక్తం వుంది. అందుకే దెబ్బతగిలిందేమోనని నీకు

ఫస్ట్ ఎయిడ్ చేయటానికి డ్రెస్సింగ్ రూములోకి తీసికెళుతున్నాను. నువ్వేమో ఇలా..." అంటూ బాధపడ్డాడు నా మొహాన్నే చూస్తూ.

నాకు అనుమానం వచ్చింది. వెంటనే చేతికంటిన రక్తాన్ని వాసన చూశాను... వెగటు వాసన వచ్చింది. నోట్లో వేలు పెడితే కారంగా వుండి గొంతు మండింది. అక్కడున్న వాళ్ళంతా నన్ను 'రక్తం తాగే రాక్షసుడి'లా చూస్తున్నారు.

"తొందరగా నీళ్ళు తెండిరా... గొంతు మండిపోతోంది. అది రక్తంకాదు- ఆవకాయ. నా ఖర్మకాలి ఈవేళ ఈ పనిని నెత్తిన పెట్టుకున్నా..." అంటూ కన్నీళ్ళు పెట్టుకోసాగాను మంట ఎక్కువయేసరికి.

ఆవకాయంటే పడి చచ్చే మా డ్రైవర్, కళ్ళు వింతగా మెరుస్తుండగా అమాంతం నన్ను కౌగలించుకుని, బస్సులో వున్న జాడీ మీదకి చూశాడు.

—కస్తూరి రాజశేఖర్

# కంగాళీ

ప్రయాణీకులతో కిక్కిరిసివున్నా ఆ బస్సు 'బస్‌స్టాప్‌లోనే' ఆగింది! అది వస్తుండగానే దానిలో చొరబడేందుకు అమితోత్సాహంతో కొందరు ప్రయత్నిస్తే మిగిలినవారు ఆగీ ఆగగానే దాన్ని చుట్టుముట్టారు. ఆ గుంపులో ఒకడైన గోవిందరావు తన ప్రమేయం లేకుండానే బస్సు కదిలేసరికి దాని మధ్యకు చేరుకుని కమ్మీని పట్టుకుని నిలబడివున్నాడు.

విందు భోజనం పీకలవరకూ దట్టించి కడుపు నొప్పితో డాక్టర్ దగ్గరికెళ్ళిన ఆసామీ డాక్టరిచ్చిన మాత్ర చూసి- "అది పట్టేచోటు వుంటే మరి రెండు లడ్డూలు తిని వుండనా?" అన్నాడట. పుట్ బోర్డ్ మీద వేలాడుతున్న మరో డజను మందిని చూస్తే బస్ కెపాసిటీకి, ఆ ఆసామీ పొట్టకి ఏదో అవినాభావ సంబంధం తోచి నవ్వొచ్చింది గోవిందరావుకి. తపస్సు చేసే సరదా అణుమాత్రం లేకపోయినా అతనికి ఒంటికాలిపై నిలబడటం తప్పలేదు. అంతా ఒకరినొకరు హత్తుకుపోయి వుండటం చూస్తే ఆ సిటీ బస్సు ప్రయాణంలో సర్వమానవ సౌభ్రాతృత్వం విలసిల్లుతున్నట్టుంది.

అంత రద్దీలో కూడా అందరిమధ్యకి దూసుకుపోతూ విధినిర్వహణచేసే కండక్టర్లు వీరాభిమన్యుడి రక్తసంబంధీకులేమో అని అనుమానం కలుగుతుంది. ఒకామె 'పైసలెక్కువ తీసుకున్నా'వని గొడవ మొదలెడితే, "క్రితంసారి బస్ ఎప్పుడెక్కావమ్మా? రేట్లు పెరిగినై" అంటూ సమాధానపరిచాడు కండక్టరు. ప్రతివాళ్ళనీ "టికెట్ దీస్కో శీనూ" అంటున్నాడు. 'శీను' అతని వూతపదంలా వుంది.

"నేను ఇందాకట్నుంచీ ఒంటికాలి మీద నిలబడున్నానయ్యా!" అని కండక్టరుకి మొర పెట్టుకున్నారెవరో.

"అరె! ఆ మాట ముందే చెబితే హాఫ్ టిక్కెట్టే ఇచ్చేవాణ్నిగదయ్యా!" అంటూ కండక్టరు ముసిముసి నవ్వులతో బస్‌లోనివారి రెస్పాన్స్‌కోసం చూశాడు.

రెండు స్టాపుల తర్వాత టి. ఐ. సి. పాయింట్ దగ్గర బస్ ఆపినపుడుగానీ కండక్టరు జనంలో ఈదుకుంటూ గోవిందరావు దగ్గరికి చేరుకోలేదు.

గోవిందరావు ఓ క్షణం టిక్కెట్టు మానేద్దామా అనుకున్నాడు. రేట్లు






పెరిగాక టిక్కెట్టు తీసుకునేందుకు మనసొప్పడంలేదు. అదే దూరానికి, అదే నిలబడిచేసే ప్రయాణానికి మరో పావలా ఎక్కువైంది. పైగా జేబులో ఒకే ఒక రూపాయివుంది. ఈసారికి మానేస్తేనో!బస్ దిగగానే హాయిగా కాఫీ తాగొచ్చు అన్పించింది. కాని అనుకోకుండా చెకింగ్ లాంటిది జరిగితేఅవమానాన్నిఎదుర్కోవాలని పేంటు జేబులోంచి రూపాయితీసి కండక్టర్ చేతిలోపెట్టాడు. అతను ఇచ్చిన టిక్కెట్టు,మిగిలిన పావలా తిరిగి జేబులోకి వెళ్ళినై.

కండక్టరు టిక్కెట్లు కొట్టడం పూర్తి చేసి వెనుక డోర్‌గుండా బైటపడి ముందు కెళ్ళి బస్‌ని అధిరోహించగానే తిరిగి మందగమనంతో కదిలింది.

స్టాపుల్లో బస్ దిగేవాళ్లు దిగుతున్నా దానికి సమానంగా ఎక్కేవాళ్లు వుండడంతో రద్దీలో మార్పేంలేదు.

గోవిందరావు తను దిగవలసినచోటుకి రెండు స్టాపులకి ముందే దిగే ప్రయత్నం మొదలెట్టి ఆ స్టాపు వచ్చేటప్పటికి డోర్ దగ్గరికి చేరుకుని ఎలాగైతేనేం బస్ దిగగలిగాడు.

వేసవికాలపు ఎండ నెత్తిమాడ్చేస్తోంది. దగ్గరలో ఓ పాన్‌షాపును చూసిన గోవిందరావుకి సోడా తాగి సేదదీరాలనిపించింది.

అక్కడికి నడిచి డబ్బులకోసం జేబులో చెయ్యిపెట్టాడు.

విచిత్రం!

అతని చేతిలోకి పావలానాణెం బదులు రూపాయినోటు వచ్చింది.

దాన్నిచూసి ఆశ్చర్యపడి మరోసారి చేత్తో జేబులో తడిమాడు గాని పావలా లేదూ, బస్ టిక్కెట్టూలేదు!

గోవిందరావుకి ఈ మాయ ఏమిటో అర్థంకాలేదు!

అంతే-తను రద్దీలో మరొకరి జేబులోని రూపాయితో టిక్కెట్టు తీసుకుని తిరిగి వాళ్ళ జేబులోకే టిక్కెట్టు, పావలాలని.......

-జాస్తి శ్రీకృష్ణ వరప్రసాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 482.

